

52

**బికినీ కహాని**

ఆధునిక ప్రపంచంలో బికినీ ఓ ఫ్యాషన్. బహిరంగ సమావేశాల్లో బికినీ భామల హడావుడి డెబ్భైయేళ్ళ క్రితమే మొదలైందట. 300 యేళ్ళ చరిత్రలో బికినీ క్రమంగా సైజు తగ్గించుకుంటూ ప్రస్తుత దశకు చేరింది. వివిధ రంగాల్లో, పలు దేశాల్లో బికినీ హల్‌చల్‌పై ఓ లుక్.....

16

**వెట్టి**

(కొత్త సీరియల్ ప్రారంభం)

ధైర్యం, సాహసం, తెగువ ఉట్టిపడే ఓ మొనగాడి కథ వెట్టి. సంచలన రచయిత మధుబాబు సీరియల్ ఈ వారం నుండి మీ కోసం...

72

**ఇంటర్వ్యూ**

ఎంతో తెలివైన ఈనాటి ప్రేక్షకుల్ని మెప్పించడం, సంతోషపెట్టడం అంత ఈజీ కాదంటున్న బహుభాషా నటుడు సురేష్ ఇంటర్వ్యూ.....

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



*ముఖచిత్రం:* నిత్యామీనన్
ఫొటో: గోపీకృష్ణ


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**
*నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33.* email: navyaweekly@andhrajyothy.com





**ఇదీసంగతి**

పుప్పి పన్ను పీకించుకునేందుకు వెళ్ళి, పళ్ళ డాక్టర్‌ని కలిశాడు సుబ్బారావు. ముందు ఫీజెంత అని అడిగాడు.

"పన్నెండువందలు" చెప్పాడు డాక్టర్.

"కొంచెం తక్కువలో చెప్పండి." బతిమలాడాడు సుబ్బారావు.

"తక్కువలో చెప్పమంటే...మత్తుమందు అక్కర్లేదంటే, అది ఇవ్వకుండా పీకితే మూడొందలు." అన్నాడు డాక్టర్.

"సరే! మత్తుమందు ఇవ్వకుండానే పన్ను పీకండి." చెప్పాడు సుబ్బారావు.

డాక్టర్ అలాగే చేశాడు. పన్ను పీకేశాడు. నిజానికి పన్ను పీకుతోంటే ఎంతటివాడైనా గోల పెడతాడు. ఏడుస్తాడు. అలాంటిది సుబ్బారావు గోల పెట్టలేదు. ఏడవలేదు. పైగా సన్నగా నవ్వుతూ కూర్చున్నాడు. అది గమనించి డాక్టర్ బిత్తరపోయాడు. బిత్తరపోవడమేకాదు, సుబ్బారావుని మెచ్చుకోలుగా చూశాడు. అన్నాడిలా.

"నా ముప్పై ఏళ్ళ సర్వీసులో నీలాంటివాణ్ణి చూడలేదయ్యా! నిజంగా నువ్వు చాలా గొప్పవాడివి! గొప్ప ధైర్యవంతుడివి. నీ ధైర్యానికి నాదో చిన్న కానుక. నువ్వు నాకు ఇవ్వాల్సిన మూడు వందలు కూడా ఇవ్వక్కర్లేదు. పైగా నేనే నీకు అయిదువందలు ఇస్తున్నాను, తీసుకో."

తీసుకున్నాడు సుబ్బారావు. "థాంక్యూ సర్" అని అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి క్లబ్బులో అందరికీ సుబ్బారావు గురించే చెప్పసాగాడు డాక్టర్. సాటి డెంటిస్ట్‌లంతా ఆశ్చర్యపోతూ వినసాగారు. విననిది ఒకే ఒక్క డాక్టర్. ఆ డాక్టర్ పెద్దగా అరుస్తూ అన్నాడిలా.

"ఆ సుబ్బారావు వెధవ! నీ దగ్గరకొచ్చి పన్ను పీకించుకున్నాడా? ముందు నా దగ్గరకి వచ్చాడు. మత్తుమందు ఇచ్చాను. ఓ అరగంట కూర్చో. తర్వాత పన్ను పీకుతానన్నాను. అరగంట తర్వాత పిలిస్తే లేదు. ఏమయిపోయాడో అనుకున్నాను. ఇదా సంగతి."

•••

*ఒకడు:* ఎందుకు అంతమంది అలా పరిగెడుతున్నారు?
*మరొకడు:* పరుగుపందెం సార్! కప్ కోసం పరుగు పందెం.
*ఒకడు:* కప్పు ఎవరికి వస్తుందో?
*మరొకడు:* ఎవ్వరైతే గెలుస్తారో వారికి వస్తుంది.
*ఒకడు:* దానికి ఆ ఒక్కడూ పరిగెడితే చాలు కదా? అంతమంది ఎందుకు?

-వైనతేయ

www.navyaweekly.com

# నవ్య

సంపుటి: 13 సంచిక: 21
27-7-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజి

# సంతోషమే స్వర్గం

సుఖం లేదు. సంతోషం లేదు. ఒకటే ఆందోళన. గాబరా. ఈ ఇంట్లో ఉండలేకపోతున్నాను. ఒకప్పుడు నగరం నడిబొడ్డున గల ఈ ప్రాంతంలో అపార్ట్‌మెంట్ ఎంతగా కావాలనుకున్నానో, ఇప్పుడు అంతగానూ వద్దనుకుంటున్నాను. మంచి పార్కు ఉందనీ, సూపర్‌మార్కెట్ ఉందనీ, దగ్గరలో కూరగాయల మార్కెట్, మంచి హోటల్, సినిమా హాలు, నాలుగడుగుల దూరంలో బ్యాంకు, అంతే దూరంలో ఆసుపత్రి, ప్రార్థనామందిరం...అన్నీ ఉన్నాయనీ, ప్రశాంతమైన వాతావరణం అనీ ముచ్చటపడి, ఆనాడు కొనుక్కున్న ఈ అపార్ట్‌మెంటంటే ఈనాడు అసహ్యం వేస్తోంది. భయం వేస్తోంది. పాతికేళ్ళక్రితం కార్లూ, బస్సులూ, ఆటోలూ, టూవీలర్లూ పరిమితంగా ఉండేవి. హాయిగా ఉండేది. ఇప్పుడు లెక్కకు మిక్కిలిగా వాహనాలు. పెను వాహనప్రవాహం. ఆగిందో హారన్ మోతలు, కేకలు, కోపాలు, తాపాలు...బాల్కనీలోంచి చూస్తే గుండెలో దడ పుడుతోంది. అది చాలదన్నట్టుగా ప్రార్థనామందిరాల మైకుల్లోంచి పెద్దగా వినవచ్చే భజనలూ, పాటలూ మెదడుని మొద్దుబారించేస్తున్నాయి. దేవుడి మీద భక్తి పోయి, ఆయనతో గొడవ పడాలనిపిస్తోంది.

ఈ ప్రాంతానికి పగలూ రాత్రీ లేదు. ఇక్కడి కార్యాలయాలకి వేళాపాళా లేదు. అయినా ఓ కాయ దొరకదు, ఓ పండు దొరకదు, ఓ కూర దొరకదు. దాంతో చెప్పలేనంత నిరాశ. ఈ నిరాశలో కన్యాశుల్కం చదివినా నవ్వు రావట్లేదు. మహాప్రస్థానం చదివినా మనసు రగలడం లేదు. హాయిహాయిగా అమృతం కురిసిన రాత్రి చదివి ఎన్నాళ్ళయ్యిందో? నాకేమీ పాలుపోవట్లేదు బాబాయ్! ఏం చెయ్యనంటూ బాబాయ్‌కి ఫోన్ చేశాడు మాణిక్యం. నీకు నచ్చిన పుస్తకాలు తీసుకుని, వెంటనే మా ఊరు బయల్దేరి రా అన్నాడు బాబాయ్. అంతే! వచ్చేశాడు మాణిక్యం.

పచ్చగా పొలాలూ, చెట్లూ. పాలనురుగులా జలపాతాలు. కిలోమీటర్ల దూరం నుంచి కాకి అరుపు వినిపించేటంతటి నిశ్శబ్దం. చల్లనిగాలి. వాతావరణం బాగుందనుకున్నాడు మాణిక్యం. మట్టిరోడ్డు మీద నడుస్తూ బాబాయ్‌గారి ఇల్లు తెలుసా? అని ఆ దోవనపోతున్న ట్రాక్టర్ డ్రైవర్ని అడిగాడు. తెలుసన్నాడతను. మాణిక్యాన్ని ట్రాక్టర్ ఎక్కమన్నాడు. ట్రాక్టర్ మీద కూర్చుని దారంట అంది వచ్చిన ప్రతి కాయనీ, ప్రతి పండునీ చేత్తో పట్టుకుని మురిసిపోయాడు మాణిక్యం. పళ్ళతో నిండుగా ఉండి, వంగిన చెట్లకు నమస్కరించాడు. సన్నగా మంత్రపుష్పం వినవస్తోంటే...అదే బాబాయ్ ఇల్లని గ్రహించి ట్రాక్టర్ దిగాడు మాణిక్యం. లోనికి ప్రవేశించాడు. ప్రేమగా పలకరించిన బాబాయ్‌తో ఎన్నాళ్ళు ఉండమంటావు అనడిగాడు. నీ ఇష్టం వచ్చినన్నాళ్ళు అని నవ్వాడు బాబాయ్.



లేవగానే ఓ గ్లాసు గోరువెచ్చని నీరు ఇచ్చేవాడు బాబాయ్. తాగి, కాలకృత్యాలు తీర్చుకోమనేవాడు. తర్వాత ఓ గంటపాటు అలా చెరువు కట్టంటా, తోట్లంటా నడచి రమ్మనేవాడు. అలాగేనంటూ నడచి వచ్చేవాడు మాణిక్యం. వచ్చిన మాణిక్యానికి ఉడికించిన కాయగూరలూ, పండుముక్కలూ బ్రేక్‌ఫాస్ట్‌గా పెట్టేవాడు బాబాయ్. మధ్యాహ్నం వేడివేడిగా ఇంత అన్నం పెట్టి, అంత కూర పెట్టేవాడు. అన్నంలో కూర కాదు, కూరలో అన్నం కలుపుకుని తినమనేవాడు బాబాయ్. తినేవాడు మాణిక్యం. సాయంత్రం మళ్ళీ పళ్ళిచ్చి తినమనేవాడు. రాత్రి కూడా అంతే! పిడికెడు గోధుమరవ్వ ఉడికించి పెట్టి, మళ్ళీ పళ్ళు పెట్టేవాడు. సన్నగా సూక్తాలు వినిపించి నిద్రపుచ్చేవాడు. నెల గడిచింది అలా. ఆనాటికి మాణిక్యానికి బాధంటే తెలియకుండా పోయింది. భయం అన్నది లేకుండా పోయింది. గుండెనిండా ఆనందం, సంతోషమే! దడ అన్నదే గుండెల్లో లేదు. కన్యాశుల్కం చదివి నవ్వుకోసాగాడు. మహాప్రస్థానం చదివి రగలిపోసాగాడు. అమృతం కురిసినరాత్రి చదివి ఆనందించసాగాడు. ఇదెలా సాధ్యం? అడిగాడు మాణిక్యం. ట్రాఫిక్ మోతలూ, పెనుశబ్దాలూ వినరాకపోవడం, కాయగూరలూ, పళ్ళూ ఆరారా తినడంతో సాధ్యం అన్నాడు బాబాయ్. అంతులేని ట్రాఫిక్కే అనారోగ్యానికి మూలం అన్నాడు. కాయగూరలూ, పళ్ళూ తింటేనే ఆందం! ఆనందం అన్నాడు. అనుమానాలు ఉంటే పరిశోధనలూ, అధ్యయనాలూ చదువుకోమన్నాడు.

నవ్య




## గ్రామరాజ్యం! సర్కారు పూజ్యం!

ఎవరో వస్తారని ఏదో చేస్తారని ఎదురు చూస్తే ఎదురుచూపులే తప్ప ఏ పనులూ జరగవు. ఈ సూత్రాన్ని చక్కగా అర్థం చేసుకుంది మధ్యప్రదేశ్‌లోని ఒక గ్రామం. అందుకే ప్రభుత్వం ఏదో చేస్తుందని ఎదురుచూడకుండా ఆ గ్రామస్థులే రోడ్డు వేసుకున్నారు. గ్రామంలో ముఖ్య సమస్యల పరిష్కారంలో ముందుండి అందరినీ నడిపించింది మాత్రం గణేష్ అనే ఒక చిన్న రైతు.

మధ్యప్రదేశ్‌లోని పారడ్‌సింగా గ్రామంలో ఉన్నవన్నీ సమస్యలే. నాగపూర్‌కు 60 కిలోమీటర్ల దూరంలో ఉందీ గ్రామం. సరైన రోడ్లు లేవు. ప్రయాణ సౌకర్యాలు అంతకంటే లేవు. హాస్పిటల్ లేదు. పంచాయతీలకు, ప్రభుత్వ అధికారులకు ఎన్నోసార్లు మొరపెట్టుకున్నా ఫలితం లేదు. తమ గ్రామంపై ప్రభుత్వం శీతకన్ను




వేసిందని గ్రామస్థులు వాపోయారు. వర్షాకాలం వచ్చిందంటే ఇక బయటి ప్రపంచంతో ఆ గ్రామానికి సంబంధమే ఉండదు. పొలాలకు వెళ్ళడానికి కూడా వీలుండదు. పొలాలకు వెళ్ళే దారి బురదమయం కావటంతో చాలా ఇబ్బందులు పడేవారు గ్రామస్థులు. ఈ సమస్యకో పరిష్కారం ఆలోచించాలని తీవ్రంగా ప్రయత్నించాడు గణేష్. ప్రభుత్వాలకు విన్నపాలు చేసుకున్నా లాభం లేకపోయింది. ఇక ఇలా కుదరదనుకుని ఇంటింటికీ తిరిగి విరాళాలు పోగుచేశాడు గణేష్. గ్రామంలోని కొంతమంది రైతుల సహాయంతో స్వయంగా రోడ్డు నిర్మించుకున్నారు. మరిన్ని విరాళాలు, ఇతర మార్గాల ద్వారా పంటపొలాలు, తాగునీటికోసం ఒక డ్యామ్ కూడా నిర్మించుకునే ఆలోచనలో ఉన్నారీ గ్రామస్థులు.

ఇంతకుముందు ఇదే గ్రామంలోని ఒక పొలంలో ప్రధానమంత్రి నరేంద్రమోదీ ఆకారాన్ని ప్రతిబింబించేలా మొలకలు పెంచారు. గ్రామ సమస్యలు వివరిస్తూ ప్రధానమంత్రికి ఒక ఉత్తరం కూడా రాశారు. అప్పట్లో ఆ ఉత్తరం వైరల్‌గా మారి అందరినీ ఆకర్షించింది. సామాజిక కార్యకర్తలు, సంఘాలు ఈ గ్రామస్థులకు సహాయం చేయడానికి ముందుకొచ్చారు. కొంతవరకు మేలు జరిగింది. కానీ ఇంకా గ్రామంలోని సమస్యలు అలానే ఉన్నాయని, ఎవరికోసం ఎదురుచూడకుండా తమ ఊరిని తామే బాగుచేసుకుంటామని చెబుతున్నాడు గణేష్. హ్యాట్సాఫ్ టు హిమ్!

# మెయిల్ బాక్స్

## నోబెల్‌కథలో జాకోబీ పాత్ర చిరస్మరణీయం

నోబెల్ కథ 'లిజ్జీ' లో జాకోబీ పాత్ర చిరస్మరణీయం. బుడుగు, గిరీశం, గణపతి లాంటివన్నీ హాస్యపాత్రలు, విషాదానికొస్తే గుర్తొచ్చేది దేవదాసు పాత్ర. అదేవిధంగా ఈ నోబెల్ కథల్లో రచయిత పాల్‌థామస్‌మాన్ సృష్టించిన జాకోబీ పాత్ర తెలుగు పాఠకుల హృదయాల్లో స్థిరస్థానం పొందడం ఖాయం. అరణి రామాయణంలో రామలక్ష్మణులను గరుత్మంతుడు నాగపాశ విముక్తుల్ని చేయడం బాగుంది.

-బి.ప్రభాస్, గాంధీనగర్ తూ.గో.జిల్లా

## నివ్వెరపరచిన సురభి వార్తలు

రెజీనా ముఖచిత్ర అందం అదిరింది. రోజూ 800 మీటర్లు ఎత్తుకొండల్ని నిచ్చెనల సాయంతో ఎగబాకి వెళ్ళడం, ద్రోణగిరి గ్రామ ప్రజలు ఆంజనేయస్వామిని నమ్మకపోవడం, సురభి వార్తలు నివ్వెరపరిచాయి. కథలు బాగున్నాయి. 'సారంగం' కథ చెప్పిన తీరు వైవిధ్యానికే వైవిధ్యం. ఎమ్మెస్ చెప్పిన వాస్తవాలు ఆయనకున్న గట్స్‌కి నిదర్శనం. కాంచీ ఆర్టివిజమ్ ఆలోచనలకి హేట్సాఫ్.

-తాళాబత్తుల సత్యనారాయణమూర్తి, విశాఖపట్నం-11

## అలరించిన సంచిక

రెజీనా, సురభి చిత్రాలున్న సంచిక అలరించింది. సినీ హాస్య నటుడు కె.కె.శర్మ గురించి బాగా వివరించారు. అసంఖ్యాక చిత్రాలు ఆయనకు ఆస్తి తేకపోయినా, అభిమానుల్ని సంపాదించిపెట్టాయి. ఇలాంటివారి ఇంటర్వ్యూలు ప్రచురించండి.

-పుట్టాసోమన్నచౌదరి, కాకినాడ

## వినూత్నమైన ఫస్ట్ పేజీ కథ

కుక్కకాటుకు చెప్పుదెబ్బ కథ మాదిరిగా కృతఘ్నులైన కొడుకులకు బుద్ధిచెప్పిన తండ్రి, అతడి స్నేహితుడి కథ వినూత్నంగా ఉండి మెప్పించింది. మన మెదడు కంప్యూటర్‌కన్నా శక్తిమంతమైనదని, దాన్ని పూర్తిగా వినియోగించుకుంటే మనం ఎవరికీ తీసిపోమనీ చెప్పిన గేమ్ ఆఫ్ లైఫ్ ఉపయుక్తంగా ఉంది. పిల్లికోసం ఆల్కహాల్ రహిత వైన్, బండరాయి మోస్తూ వాకింగ్‌చేసి బరువు తగ్గిన కాంగ్‌యాన్ విశేషాలు సురభిలో ఆకట్టుకున్నాయి. సెల్ఫీలవల్ల ముఖానికి హాని తెలిసి ఆశ్చర్యపోయాం.

-పి.ఎస్.లక్ష్మి, బృందావనం. తూ.గో.జిల్లా

## వృక్షో రక్షతి రక్షితః

'షిన్‌రిన్-యోకు' ఆహ్లాదాన్నిచ్చే ప్రకృతి నడక ఆశ్చర్యంగాను, నాగరిక మనిషిని ఎంతో దుస్థితికి దగ్గర చేసిందనీ అనిపించింది. ఆధునిక మానవుడు కాంక్రీట్ జంగిల్‌లో పడి గిలగిలలాడుతూ తిరిగి పచ్చటిచెట్లు, నీటిధారలవైపు అబ్బురంగా చూస్తున్నాడు. అందుకే వృక్షోరక్షతి రక్షితః అన్నారు. మానవ సంబంధాలు తెలియని కుపుత్రులకు మొదటిపేజీ సరైన దెబ్బ. చిన్న పిల్లల ఒంటరి జీవితంలో నెట్ సౌలభ్యం వల్ల ఎంత అడల్ట్‌హుడ్ సంతరించుకుంటారో క్రైమ్ కథ ద్వారా వెల్లడైంది.

-ప్రతికంఠం మహేందర్‌రాజు, హన్మకొండ

## మదరిండియా సీరియల్ హృద్యంగా ఉంది

నవ్య వీక్లీ సర్వాంగ సుందరంగా రూపుదిద్దుకుంటూ అభిమాన పాఠకులను అలరిస్తున్నది. కథలు, సీరియల్స్ ఎంతో బావుంటున్నాయి. ముఖ్యంగా మూడువారాల నుండి ప్రచురిత




మవుతున్న 'మదరిండియా' హృద్యంగా ఉంటున్నది. ప్రధానపాత్ర నిగమ ఆవేదన, ఆలోచనా పరంపరలు పాఠకులను ఆలోచింపజేసేవిగా ఉన్నాయి. కంఠంనేని రాధాకృష్ణమూర్తిగారి వ్యక్తిత్వవికాస శీర్షిక గేమ్ ఆఫ్ లైఫ్ యువతరానికి జీవితంపై అభిరుచిని, అనురక్తిని పెంచేవిధంగా ఆరంభమైంది. ఆట అయినా, పోరాటమైనా జీవితమైనా క్రీడాస్ఫూర్తి ఉండటం ఎంతో అవసరం.

మదరిండియా సీరియల్‌లో కొడుకుల నిర్వాకంపై కోర్టుకెక్కిన తల్లి పాత్ర నిగమ సరికొత్త స్ఫూర్తిని నింపుతోంది. తండ్రి ఆశయాలను నెరవేర్చని కొడుకులకు తగిన గుణపాఠం నేర్పేందుకు ఆ తల్లి పోరాటం చేస్తోంది. సీరియల్ అద్భుతంగా ఉంది.

-కె.రఘుపతి, సికింద్రాబాద్-10

-ఎన్.వల్లీపద్మావతి, హైదరాబాద్

## విలువైన సూచనలు

గేమ్ ఆఫ్ లైఫ్‌లో విలువైన సూచనలు చేశారు. ప్రతిమనిషీ విలువైనవాడేననీ, ఎవరి ప్రత్యేకత వారిదేననీ సోదాహరణంగా చెప్పారు. సంకల్పంతోనే విజయం సాధిస్తామనీ, మన సామర్థ్యాన్ని వెలికితీసి సక్రమంగా వినియోగించుకోవాలనీ తెలుసుకున్నాం.

-సరికొండ శ్రీనివాసరాజు, హైదరాబాద్

## కిక్కిచ్చిన కాఫీ

మార్నింగ్ కాఫీలో 'అబద్ధం' భలే కిక్కిచ్చింది. 'మొదటిపేజీ' కుక్క కాటుకు చెప్పుదెబ్బతగిలిన వైనం కొడుకుల నిర్వాకానికి భలే తరుణోపాయంలా ఉంది. చాక్లెట్ పుట్టుపూర్వోత్తరాలు అవగతం చేసుకున్నాం. 'ఆనవాలు' కవితలో సిరికిస్వామినాయుడు గారి శైలి బాగుంది. నిలబడి నీళ్ళు కథాకర్త లక్ష్మీ రాఘవకు అభినందనలు. బాలి, చంద్ర, పినిశెట్టి చిత్రాలు సజీవతను ఉట్టేపడేలా ఆకట్టుకుంటున్నాయి. సరసి కార్టూను కిసుక్కుమనిపించింది. సురభిలో అంశాలన్నీ ఆసక్తి రేకెత్తించేవే. హవేలీ సీరియల్ ఉత్కంఠభరితం.

-నేమానసుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం

# కేక్ కట్ చేయడం ఎందుకు?

మనిషి జీవితంలో ప్రతి సందర్భం దాదాపు కేకుతో పెనవేసుకునే ఉంటుంది. మొదటి పుట్టినరోజుకు కేకు కట్ చేయడం దగ్గర్నుంచీ, వివాహం నిశ్చయం అయినప్పుడు, వివాహం సందర్భంలో, అనంతరం ప్రతి సంవత్సరం జరుపుకునే పెళ్ళి రోజువరకూ చాలా సందర్భాలలో కేకు కటింగ్ అనేది ఉంటూనే ఉంటుంది. అసలు కేకు పేరు చెప్పగానే నోట్లో నీళ్ళూరని వ్యక్తులు ఉండరు అంటే అతిశయోక్తి కాదేమో! నోట్లో వేసుకోగానే కరిగిపోయే కేకుకు అభిమానులు ఎక్కువే! అందరూ అన్ని వేళలా ఇష్టపడే కేక్ కటింగ్ గురించి కొన్ని ఆసక్తికరమైన అంశాలు..

- కేక్ కట్ చేయడం అన్నదానిని చాలా మంది సంప్రదాయంగా భావిస్తారు. ఈ సంప్రదాయంలో కొంత ఆరోగ్య ప్రయోజనం కూడా దాగి ఉంది. దీనిలోని తీపి మూడ్‌ని మార్చడానికి సహాయపడుతుంది. అంతే కాకుండా తీపిలోని ట్రిప్టోఫాన్‌ను గ్రహించి, సెరొటిన్ ఉత్పత్తికి సహాయపడుతుంది.
- ఆత్మీయుల కోసం కేకు తీసుకు రావడం అన్నది వారి మీద మనకున్న ప్రేమనూ, అభిమానాన్నీ తెలియజేస్తుంది.
- పూర్వకాలంలో కొన్ని దేశాలలో కేకులను దేవుళ్ళకు నైవేద్యంగా సమర్పించేవారు. ఆ నైవేద్యాన్ని ముక్కలుగా చేసి ప్రసాదంగా అందరికీ పంచేవారు. ఆ సంప్రదాయం మారి భగవంతుడి ముందు కాకుండా వ్యక్తుల ముందు కట్ చేయడం అన్న సంప్రదాయం వచ్చింది.
- కేకుల సంప్రదాయానికి శ్రీకారం చుట్టింది గ్రీకులు. అప్పట్లో వాళ్ళు తేనెతో తయారు చేసిన కేకులు, బ్రెడ్లను ఉపయోగించేవారు.



- రోమన్లు 50వ సంవత్సరాన్ని హనీ కేకుతో సెలబ్రేట్ చేసుకునే వాళ్ళు.
- కేకు సంప్రదాయాన్ని గ్రీకులు కాదు జర్మన్లు మొదలు పెట్టారని కూడా అంటారు. కాకపోతే ఇందుకు సంబంధించిన ఆధారాలు ఏవీ సరిగ్గా లభ్యం కాలేదు. జర్మన్లు కిండర్ ఫెస్ట్ పేరుతో పిల్లల కోసమే ప్రత్యేకించి కేకులను కట్ చేసేవాళ్ళు.
- చైనా దేశస్థులు చైనీస్ హార్వెస్ట్‌మూన్ ఫెస్టివల్‌ను ప్రతి సంవత్సరం నిర్వహిస్తారు. చందమామను దేవుడిగా భావించి మూన్ ఆకారంలో కేకును తయారుచేసి కట్ చేసి అందరూ పంచుకుంటారు. ఇప్పటికీ ప్రతి సంవత్సరం చైనాలో నిర్వహిస్తున్నారు.
- ఇప్పుడంటే కేకులు రకరకాల షేపుల్లో లభిస్తున్నాయి కానీ, పూర్వకాలంలో కేకంటే గుండ్రంగానే తయారు చేసేవారు.

నవ్య








**హో టల్స్..!**
**అంటే పూటకూళ్ళ ఇళ్ళన్నమాట! సర్వీస్ సెక్టార్‌లో ఇప్పుడు వీటిదే అతిపెద్ద లాభసాటి వ్యాపారం. లక్షలాదిమంది యాత్రికులు, పర్యాటకుల సౌకర్యాలకోసం ఇప్పుడు చిత్రవిచిత్రమైన హోటల్స్ పుట్టుకొచ్చాయి. ఈ అత్యాధునికమైన పూటకూళ్ళఇళ్ళల్లో తమ దగ్గరకు వచ్చిన అతిథులకు ఏ లోటూ లేకుండా మర్యాదలు, సదుపాయాలు చేయడానికి, ఆకర్షించడానికి విచిత్రమైన ఉద్యోగస్థులు కూడా పుట్టుకొచ్చారు. ఆ ఉద్యోగాలేమిటో చదివితే ఆశ్చర్యంతో నోరెళ్ళబెడతారు. బతకడానికి ఏదో ఒకటి చేయాలికదా మరీ? అనుకుంటే పొరపాటే! ఇలాంటి ఉద్యోగాలు కూడా ఉంటాయా! మరీ ఇంత అతిశయమా? అని మీరే విస్తుపోతారు!**

# ఆధునిక హోటల్స్‌లో అపురూపమైన ఉద్యోగాలు!

సదుపాయాలు, సేవలను బట్టే ఏ హోటలైనా ప్రాముఖ్యం సంతరించుకుంటుంది. అందుకే పర్యాటకుల్ని ఆకర్షించేందుకు ఖరీదైన హోటళ్ళన్నీ ఒక దానితో ఒకటి పోటీపడుతుంటాయి! అయితే ఇలా అందించే విభాగాల్లోనే ఆశ్చర్యంగొలిపే సేవలు కూడా ఉన్నాయి.

హోటల్ జాబ్ అనగానే మనకు గుర్తుకు వచ్చే పేర్లు సర్వరు, అటెండరు, క్లీనరు, కుక్, రూమ్‌బోయ్ లేకుంటే రిసెప్షనిస్ట్. ఈ ఉద్యోగాల గురించి మాత్రమే మనకు తెలుసుగానీ హోటల్‌లో అతిథుల నాణేలను పాలిష్ చేయడానికి ఓ ప్రత్యేకమైన ఉద్యోగం ఉంటుందని మీకు తెలుసా? పోనీ గదిలోకి వెళ్లేముందే మీరు పడుకునే పరుపును మరో వ్యక్తి వెళ్లి వెచ్చచేయడం లాంటి ఉద్యోగం ఉంటుందని ఎప్పుడైనా విన్నారా? హోటల్‌లో నిద్ర పట్టనివారికి నిద్రవచ్చే వరకూ గదిలో ఓ స్టోరీ టెల్లర్ కథలు చదువుతాడని మీకు తెలుసా? ఆ హోటల్ యాజమాన్యమే అతనికి నెలవారీ జీతం ఇస్తుందనే విషయం తెలుసా? ఇవే కాదండీ, ఇంకా విచిత్రమైన ఉద్యోగాలున్నాయి. ఆశ్చర్యపరిచే ఆ ఉద్యోగాల గురించి చదివేయండి మరి!!

## పరుపును వెచ్చచేస్తారు

ఇంటికన్నా గుడి పదిలం అని ఎందుకు అన్నారో గానీ, వీటిని మించిన ప్రశాంతత, మనశ్శాంతి, చక్కటి నిద్ర అందించే విషయాన్ని మాత్రం కొన్ని హోటల్స్ ఛాలెంజింగ్‌గా తీసుకుంటున్నాయి. కొత్త ప్రదేశంలో నిద్రపోవాలంటే చాలామందికి నిద్ర పట్టదు. హోటల్లో దిగగానే ప్రశాంతంగా నిదురించాలని అతిథులు కోరుకుంటూ ఉంటారు. ఈ వ్యాపార రహస్యం జీర్ణించుకున్నవారు తమ హోటల్స్‌లో అతిథుల రాకకు ముందే ఏసీ వేసి గదిని చల్లదనంతో నింపేస్తారు. డోర్ తెరిచి లోనికి ప్రవేశించగానే చల్లదనం శరీరాన్ని తాకడంతో ప్రాణం ఎక్కడికో వెళ్ళిపోతుంది. ఇక ఆ హోటల్ మీద ఫస్ట్ ఇంప్రెషన్ పడిపోతుంది. కానీ చల్లదనం పడనివాళ్లకి అలా ఉండడం కష్టమే కదా! పైగా పరుపులన్నీ చల్లదనంతో ఉంటే కొందరు నిద్రపట్టక ఇబ్బంది పడుతుంటారు. అలా ఏసీ ప్రభావంతో చల్లబడిపోయిన పరుపుల్ని కాస్తంత వెచ్చబెట్టుకునేందుకు అతిథి రూమ్ హీటర్‌ను ఉపయోగించాల్సిన అవసరం లేకుండా ప్రత్యేక దుస్తుల్లో ఉన్న సిబ్బందిని రూములకు పంపిస్తారు. ఇలా పరుపులు వెచ్చజేసేందుకు ప్రత్యేకంగా కొంతమంది సిబ్బందిని హోటళ్ళు నియమించుకుంటాయి. లండన్‌లో ఉన్న 'హాలీడే ఇన్ కెన్సింగ్‌టన్ ఫోరమ్' హోటల్‌ను ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు.

## నిద్ర పట్టకపోతే డబ్బు వాపస్

హోటల్‌కొచ్చిన అతిథిని హుందాగా రిసీవ్ చేసుకోవడమే కాదు, అందుకు తగ్గట్టు వంకపెట్టలేని రీతిలో ఆతిథ్యమిచ్చి అబ్బురపరుస్తున్నారు. ఎక్కడికైనా వెళితే కొత్త ప్రాంతం, కొత్త రూమ్. అంతా బెరుకుగా ఉంటుంది. ఓ పట్టాన నిద్రపట్టదు. ఈ సమస్య చాలామందికి ఉంటుంది. మరి ఇలాంటి వారు ఏ హోటల్‌లో దిగినా ఎంజాయ్ చేయలేరు. రాత్రంతా నిద్రలేక ఎర్రబారిన కళ్లతో అలసిసొలసి తెల్లవారిన తర్వాత ఎలాంటి పనులూ చేసుకోలేక పోతారు. మనం ఏరికోరి ఎంచుకుని వెళ్ళిన హోటల్ గదిలో మనకు సరిగ్గా నిద్ర పట్టలేదనుకో! మన డబ్బు వాపస్ ఇస్తే ఎలా ఉంటుంది? కానీ ఆ హోటల్‌వాళ్ళు మాత్రం మీకు అలాంటి చాన్స్



ఇవ్వరుగాక ఇవ్వరు! ఎందుకంటే, వారు మీకు నిద్రపట్టేలా ప్రయత్నం చేస్తారు. అప్పటికీ మీకు నిద్ర రాలేదంటే మీ డబ్బు మీకు వాపస్ ఇస్తారు. కానీ న్యూయార్క్‌లోని బెంజిమిన్ హోటల్‌లో బసచేసినవారికి మాత్రం ఈ సమస్య ఉండదు. నిద్రపట్టడం లేదని చెబితే చాలు ఎంచక్కా చక్కటి చిట్కాలు చెప్పే సిబ్బంది క్షణంలో మీ ముందు వాలిపోతారు. వారికి జీతం ఇచ్చి మరీ ఈ సేవలకు వినియోగించుకుంటున్నారు.

### నాణేలను శుభ్రం చేయడం

హోటల్‌లో హౌస్ కీపింగ్ ఉంటుంది. వాషర్ మెన్ ఉంటారు. రూమ్ బోయ్స్, రూమ్ క్లీనర్స్ ఉంటారు. కానీ అతిథుల నాణేలను శుభ్రం చేయడానికి ప్రత్యేక సిబ్బంది ఉంటారని మీకు తెలియదు కదూ? కొన్ని పెద్ద బ్యాంకుల్లోనూ, మ్యూజియాల్లోనూ, పాత నాణేలను విక్రయించే సంస్థల్లోనూ ఇలాంటి సిబ్బంది ఉంటారని మనకు తెలుసు! మరి, కొన్ని హోటల్స్‌లో నాణేలను శుభ్రం చేసే ఉద్యోగులు ఉండడం విచిత్రమే. అమెరికా శాన్‌ఫ్రాన్సిస్కోలో ఉన్న పాతతరం హోటళ్లలో వెస్టిన్ సెయింట్ ఫ్రాన్సిస్ కూడా ఒకటి. అక్కడ అతిథులకు వారి వద్ద ఉండే నాణేలను ఉచితంగా శుభ్రం చేసే సేవలు అందించే సిబ్బంది ప్రత్యేకంగా ఉంటారు. ఈ సేవల వెనుక పెద్ద కథే ఉందట. 1935 ప్రాంతంలో ఆ హోటల్‌కు వచ్చే మహిళలు ఎక్కువగా నాణేలు ఉపయోగించేవారు. నాణేలకు ఉండే దుమ్ము వల్ల అతిథులు ధరించే తెల్లటి గ్లోవ్స్ నల్లగా మారిపోయేవి. దీన్ని గమనించిన హోటల్ యాజమాన్యం నాణేలను శుభ్రం చేసే సేవలు అందించడం మొదలు పెట్టింది. అప్పటి నుంచి ఆ సంప్రదాయం నేటికీ కొనసాగుతోంది.

### పావురాల్ని తరిమికొట్టే పని

వందల సంఖ్యలో పావురాలు ఒకచోట చేరితే ఆ ప్రాంతాన్ని చిందరవందర చేస్తాయి. నేలంతా పాడు చేస్తాయి. అన్ని పావురాలు ఒకచోట వాలితే చిన్న పిల్లలు ఆ గుంపులోకి వెళ్లి వాటిని భయపెట్టడం అవి ఒక్కసారిగా రెక్కలు టపటపలాడిస్తూ ఎగిరిపోవడం చూస్తుంటాం. అలా పావురాల్ని భయపెట్టి తరిమికొట్టడమే ఉద్యోగమైతే ఎలా ఉంటుంది? కొన్ని హోటల్స్ ముందు అలాంటి ఉద్యోగులే ఉన్నారు మరి! రాజస్థాన్‌లోని జైపూర్ ప్రాచీన కట్టడాలకూ, రాజభవనాలకూ ప్రసిద్ధి. అక్కడ ఉన్న కోర్ట్ ఆఫ్ ది రామ్‌బాగ్ ప్యాలెస్ హోటల్ కూడా ఇలాంటిదే. ఆ భవనం మీద పావురాలు విపరీతంగా గుమిగూడతాయి. దాంతో ఆ హోటల్ పరిసరాలు డర్టీగా మారుతున్నాయి. హోటల్ పరిశుభ్రత కాపాడేందుకు యాజమాన్యం ఆలోచించి ఓ ఇద్దరు ఉద్యోగులను ప్రత్యేకంగా నియమించింది. పావురాలకు ఎలాంటి హాని కలుగకుండా వాటిని హోటల్ ప్రాంగణం నుంచి తరిమికొట్టడమే వీరి పని.

## రొమాన్స్ పెంచేందుకు..

హనీమూన్ ఎంజాయ్ చేయడానికి వచ్చిన అతిథులకు హోటల్ గది ఇంటీరియర్ డెకరేషన్ రొమాంటిక్‌గా ఉంటే ఎంత బాగుంటుందో కదా! నవ దంపతులు కోరుకునేది కూడా అదే. అలాంటి వారి కోరికలను నిజం చేసేలా జార్జియాలోని బార్న్‌స్లే హోటల్ ప్రత్యేక సేవలు అందిస్తోంది. గదిని రొమాంటిక్‌గా మార్చేందుకు ఫెయిరీ గాడ్ మదర్‌లను నియమించింది. హనీమూన్ జంట నిద్రించే బెడ్‌ను పూలతో నింపేస్తారు. గదిని పరిమళభరితం చేసేస్తారు. అతిథులకు కావలసినంత రొమాంటిక్ మూడ్ అందించేందుకు అవసరమైన డిజైన్ అరేంజ్‌మెంట్స్ చేసేది వాళ్ళే. అందుకోసం ఈ ఫెయిరీ గాడ్ మదర్‌లకు చెల్లించే జీతం కూడా ఎక్కువేనట. ఇప్పటికే చాలామంది నవదంపతులు ఈ హోటల్‌కి రావడానికి మక్కువ చూపిస్తున్నారట. మొత్తానికి పోటీని తట్టుకోవడానికి హోటల్ వారు భలే ఉపాయం ఆలోచించారు కదా!



ఎంత విచిత్రమైన పనో కదా!

### నిద్రపుచ్చేందుకు స్టోరీటెల్లర్స్!

హోటల్‌లో దిగిన తర్వాత హోటల్‌రూమ్‌లో నిద్రపట్టకపోతే ఏం చేస్తారు? కొంతమంది అటూ ఇటూ పచార్లు చేస్తుంటారు. మరి కొంతమంది టీవీ చూస్తూ నిద్రపోయేందుకు ప్రయత్నిస్తుంటారు. నిద్రపట్టకపోతే చిన్న పిల్లలకు కథలు చెప్పి, జోలపాటలు పాడి నిద్రపుచ్చడం మనకు పరిపాటే కదా! మరి హోటల్ రూమ్‌కి కూడా వచ్చి, అమ్మలాగా పక్కనే కూర్చుని మనకు నిద్రపట్టే వరకు కథలు చెబితే...? ఆ కథలు వింటూ, ఊ కొడుతూ చక్కగా మనం బజ్జుండిపోవచ్చు కదా! లండన్‌లోని అందాజ్ హోటల్‌లో బసచేస్తే మీకు అలాంటి అదృష్టమే పడుతుంది. నిద్రపట్టకపోతే అటూఇటూ దొర్లుతూ ఇబ్బందులు పడక్కర్లేదు. నిద్రపట్టడం లేదని రిసెప్షన్‌కు ఫోన్ చేస్తే చాలు స్టోరీటెల్లర్‌ని గదికి పంపిస్తారు. వారు చక్కటి కథలు చదువుతూ చెబుతూ అతిథులను నిద్రపుచ్చుతారు. అర్ధరాత్రి మొదలుకుని సూర్యోదయం దాకా ఈ స్టోరీ టెల్లింగ్ సెషన్ కొనసాగించవచ్చు. ఈ సేవలు అందించేందుకు ప్రముఖ రచయితలు కూడా ముందుకు రావడం విశేషం. స్టోరీ టెల్లింగ్ సమయంలో అతిథుల ఒంటిపై దుస్తులతో నిండుగా ఉండాలనే నిబంధన మాత్రం ఉంది. దాన్ని పాటిస్తే చాలు. ఇంకేం ఆ హోటల్‌కి మీరెళితే కథలు చెప్పించుకోండేం!

### డక్ షో హోటల్

హోటల్‌కి వచ్చే అతిథులు మంచి సౌకర్యాలతో పాటు విందు, వినోదాలను కూడా ఆశిస్తారు కదా! దీన్ని క్యాష్ చేసుకుంది ఓ ప్రముఖ హోటల్. మెంఫిజ్‌లోని పీబాడీ హోటల్‌ను దానిలో ప్రముఖంగా చెప్పవచ్చు. వచ్చే అతిథులకు మంచి సౌకర్యంతో పాటు వారు బోర్ ఫీల్ అవకుండా డక్ షో నిర్వహిస్తోంది. దీనికోసం ప్రత్యేకంగా సిబ్బందిని నియమించింది. ప్రతిరోజు 11 గంటల నుంచి సాయంత్రం 5 గంటల దాకా ఈ డక్ షో నిర్వహిస్తారు. ఓ ఫౌంటెన్ వద్ద బాతులు అటూ ఇటూ తిరుగుతూ అతిథులను ఆకట్టుకుని కనువిందు చేస్తాయి.

-సంతోషలక్ష్మి దహగాం

## తాజ్ లేక్ ప్యాలెస్

ఇంతకు ముందు తాజ్ లేక్ ప్యాలెస్‌ను జగ్ నివాస్ అని పిలిచేవారు. ఈ ప్యాలెస్‌లోని 83 రూములు తెల్లటి మార్బుల్ గోడలతో కళకళలాడిపోతూ ఉంటాయి.. ఉదయ్‌పూర్‌లో ఉన్న ఈ హోటల్‌ను జగ్ నివాస్ ద్వీపంలోని పిచోలా లేక్‌లో నిర్మించారు. ఇక్కడకు వచ్చే అతిథులను తీసుకువెళ్ళేందుకు హోటల్‌వారే తమ సొంత బోట్ ఏర్పాటు చేశారు. తమ సొంత బోటులో హోటల్‌కు తీసుకుని వెళతారు. భారతదేశంలోనే అత్యంత రొమాంటిక్ హోటల్‌గా దీనికి పేరు. కానీ ఈ హోటల్‌లో గడపాలంటే మాత్రం ఖరీదు కాస్త ఎక్కువనే చెప్పవచ్చు. ప్రెసిడెన్షియల్ సూట్‌లో రాజలాంఛనాలతో ఒక రాత్రి గడపాలంటే పది లక్షల రూపాయలు ఉండాల్సిందే!



# జస్ట్ లాజిక్

శ్రీధర



**రాత్రి రెండు గంటల సమయంలో ఫోన్ మోగింది. హర్ష నిద్రకళ్లతోనే సెల్ అందుకున్నాడు.**

**ఇండియా నుంచి తండ్రి రఘుపతి మాట్లాడాడు.**

**"పట్టాభి చనిపోయాడ్రా.."**

**"అయ్యో... ఎప్పుడు?" అని దిగ్గున లేచి కూర్చున్నాడు హర్ష.**

"రాత్రి మళ్లీ గుండెపోటు వచ్చింది. ఈసారి బాగా ఎక్కువగా వచ్చింది. మగదక్షత లేదు. తల్లీ, కూతురూ... అక్కడికీ పక్కవాళ్ల సాయంతో ఆస్పత్రికి తీసుకెళ్లారు. కానీ దార్లోనే పోయాట్ట. పొద్దున్నే నాకు తెలిసివచ్చాను. కిందటిసారి ఎటాక్ వచ్చినప్పుడే ఆపరేషన్ చేయాలని చెప్పారు. గవర్నమెంటువాళ్లు ఏదో కొంత ఇస్తారట గానీ, ముందు మన చేతినుంచి పెట్టుకోవాలిట. ఎక్కడో ఫ్రీగా చేస్తారట. వాళ్లకు ఉత్తరం రాశాడట. పిలుపు వస్తుందని కూర్చున్నాడు. ఈ రోజుల్లో రోగాలు రాకూడదు. వస్తే లక్షల్లోనే ఖర్చు. అవసరానికి అక్కరకొస్తుందని దాచుకున్న పది లక్షలూ నీకు ఇచ్చి పంపించాడాయె. ఆ డబ్బు చేతిలో ఉంటే, పరిస్థితి వేరుగా ఉండేది. వాడి భార్యా, కూతుర్ని చూస్తే బాధేస్తోంది. చేతిలో చిల్లిగవ్వలేదు. శవాన్ని గుమ్మంలో పెట్టుకుని కూర్చున్నారు.."

"నేను ఏమన్నా డబ్బు పంపనా?"

"పరాయి దేశంలో ఉండి చదువుకుంటున్నావు. లక్షల్లో ఖర్చు. పడరాని పాట్లు పడుతున్నావు. నువ్వేం పంపిస్తావు? నేనే ఏదో ఏర్పాటు చేస్తాలే.." అని రఘుపతి ఫోన్ పెట్టేశాడు.

హర్షకు నిద్రమత్తు వదిలింది. ఆయన చావుకు తను కారణమా? అవును.. కాదు...

పెను తుఫాను ముందు అల్లకల్లోల సంద్రంలా ఉంది అతడి మనసు. ఇంట్లో ఉక్కపోతగా ఉంది. ఊపిరాడనట్లుగా ఉంది. గుండె నిండా అలజడి.

తలుపు తీసుకుని బయటకు వచ్చాడు. నిర్జీవంగా నడుస్తున్నాడు. నింగీ, నేలతోసహా సమస్త లోకాలూ సుషుప్తావస్థలో ఉన్నాయి. తనే నిశాచరుడిలా ఒక చెట్టు దగ్గర ఆగాడు. ఎదురు వీధిలో నుంచి రివ్వున చలి గాలి వీస్తోంది. ఫుట్‌పాత్ మీద కూలబడ్డాడు. వీధి దీపం కాంతి అతని మొహం మీద పడుతోంది. కళ్లు మూసుకున్నాడు, తల పట్టుకున్నాడు.

పట్టాభి తనతండ్రికి స్నేహితుడు. ఏదో చిన్న గవర్నమెంటు ఉద్యోగం చేసి రిటైరయ్యాడు. అమాంబాపతు అన్నీ కలిసి పదిలక్షలు దాకా వచ్చాయి. బ్యాంకులో వేసుకుని కూర్చున్నాడు. ఒక్కతే కూతురు. ఆ అమ్మాయి పెళ్ళి కోసం ఆ డబ్బు దాచిపెట్టాడు. కానీ ఆ పిల్ల ఇంకా చదువుకుంటోంది. పెళ్ళికి ఇంకా నాలుగైదు ఏళ్ళ వ్యవధి ఉంది.

తనను అమెరికా పంపి చదివించేందుకు డబ్బు లేదని తండ్రి బాధ పడుతోంటే, ఆ పది లక్షలూ బ్యాంకు నుంచి తీసి ఇచ్చాడు. ఈ విషయం పట్టాభి భార్యకు, కూతురికీ కూడా తెలియనివ్వలేదు. నాలుగైదు ఏళ్ళలో తను ఉద్యోగం చేసి సంపాదించి, ఆయన రుణం తీర్చుకోవాలి.

ఇదీ సంగతి.

అయితే అనుకోకుండా ఈమధ్య ఒకసారి ఆయనకు హార్ట్ ఎటాక్ వచ్చింది. పది రోజులు ఆస్పత్రిలో ఉంచారు. ఆపరేషన్ చేయాలన్నారు. అలాంటి సమయంలోనూ ఆయన భార్యకు అసలు విషయం చెప్పలేదు. ఫిక్సడ్ డిపాజిట్ కాగితం ఎక్కడోపెట్టి మర్చిపోయినట్లు, అది పోయినట్లు నాటకం ఆడాడు.

చివరకు ప్రాణం పోతున్నప్పుడూ ఆ డబ్బు తనకు ఇచ్చినట్లు ఆయన భార్యకు చెప్పలేదు. ఆ కాగితం ఎక్కడో చిత్తుకాగితాల్లో కలిసిపోయి

# నవ్యవీక్లి- నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కథ

ఉంటుందనే ఆమె అనుకుంటోంది.

అసలు విషయం తెలిసిన వాళ్లు ఇప్పుడు ఇద్దరే మిగిలారు. తనూ, తన తండ్రి. ఇది ఆరని చిచ్చు. జన్మ అంతా దహించివేస్తూనే ఉంటుంది. ఒక మనిషి చావుకు తాను కారణమైనా, ఆ విషయం పెదవివిప్పి చెప్పని అతని గొప్ప వ్యక్తిత్వం ముందు నిలబడగలమా? ఆయన రుణం తీర్చుకోగలమా?

హర్ష ఆలోచనల్లోనుంచి తేరుకునే లోపలే చుట్టుపక్కలవాళ్లు ఎవరో తనను గమనించి ఫోన్ చేసినట్లున్నారు, పోలీసు వెహికల్ వచ్చి ఆగింది.

ఇద్దరు ఆజానుబాహువుల్లాంటి పోలీసులు, చేతిలో పిస్టల్స్‌తో హర్ష దగ్గరకొచ్చారు.

"హూ ఆర్...యు?" అని అడిగారు.

తను ఇక్కడే యూనివర్సిటీలో చదువుకుంటున్నాననీ, రెండు వీధుల వెనక ఉంటాననీ చెప్పాడు హర్ష.

"ఇప్పుడు ఇక్కడ ఎందుకు ఉన్నావ్?" అని అడిగారు.

"ఇండియానుంచి ఇప్పుడే నాకు ఫోన్‌కాల్ వచ్చింది. చెడువార్త విన్నాను. మనసు బాగో లేదు. ఇలా వచ్చాను' అన్నాడు హర్ష.

వాళ్లు అతని సెల్‌ఫోన్ తీసుకుని చూశారు. ఇల్లు చూపించమన్నారు. ఇంటి దగ్గరకు తీసుకొచ్చి బెల్ నొక్కారు.

తలుపు తీసిన అపర్ణ పోలీసులను చూసి అవాక్కయింది. హర్షను చూపించి, ఇతను తెలుసా అని అడిగారు.

తామిద్దరం హైదరాబాద్ నుంచి వచ్చామని, ఇక్కడ ఎం.ఎస్. చదువుతున్నామని, అపార్ట్‌మెంట్‌లో తామిద్దరం ఉంటున్నామనీ చెప్పింది అపర్ణ. పాస్‌పోర్ట్‌లు చూపించాక వెళ్లిపోయారు.

"ఏమైంది హర్షా?" అని అడిగింది అపర్ణ.

జరిగినదంతా చెప్పాడు హర్ష.

"నన్ను లేపలేదేం?" అని అడిగింది.

మళ్లీ ఇద్దరూ ఎవరి గదుల్లోకి వాళ్లు వెళ్లి పడుకున్నారు.

హర్ష నిద్ర లేచేసరికి ఉదయం తొమ్మిది గంటలు అయింది. అపర్ణ హైదరాబాద్ నుంచి ఫోన్ చేసిన బామ్మతో మాట్లాడుతోంది.

"మాకిప్పుడు తొమ్మిదైంది బామ్మా. టిఫిన్ అంటే బర్గర్‌లో ఆకులు అలములు, కందమూలాదులు పెట్టుకుని తినాలి.."

"ఆకులు అలములు తినాల్సిన ఖర్మ నీకేమిటే? ఇక్కడ కోట్లకు పడగలెత్తిన వాళ్లు... దిక్కుమాలిన చదువు.. చదివినంతవరకూ చాల్లే, ఇంటికొచ్చెయ్.. నిక్షేపంలాంటి సంబంధాలొస్తున్నాయి. మూడు ముళ్ళూ వేయించుకుని, కాలుమీద కాలేసుకుని, వంటవాళ్లచేత పిండివంటలు చేయించుకుని తినక... ఆకులు తినాల్సిన ఖర్మేమిటే నీకు? ఆ దరిద్రపు అమెరికాలో ఇడ్లీ, వడలు, పూరీలు, దోశలూ దొరకవా?" అని ముసలామె దులిపేస్తోంది.

"అలాగలాగే.. మరీ మూడుముళ్లు ఏం ఖర్మే? ఓ ముప్పయి ముళ్లు అయినా వేయించుకోవద్దూ హోదాకు తగ్గట్టు" అని అపర్ణ ఫోన్ సంభాషణ ముగించింది.

హర్షతో చెప్పింది "ఏంటి నీ మొహం అలా ఉంది?"

"నాది అదే మొహం... కొత్తదేం తెచ్చుకోలేదు."

"పాతదేగానీ... ఇప్పుడే శ్మశానంలో శవాన్ని తగలేసి వచ్చినట్టు చింతాక్రాంతుడవై ఉంటేనూ.."

"అదే... అక్కడ శవాన్ని తగలేశారో లేదోనని.."

"శవం గదా.. ఎలా ఉంచుకుంటారు? ఇవాళ నీ మూడ్ బాగోలేదు... ఎక్కడన్నా బయటతిరిగివద్దాం.. కాస్త మూడ్ మారుతుంది. స్నానం చేసిరా.." అన్నది అపర్ణ. తన రూంలోకి వెళ్లిపోయింది.

స్నానాలయ్యాక ఇద్దరూ కాఫీలు తాగుతున్నారు. "ఎక్కడికెళ్దాం?" అని అడిగింది.

"ప్రేమకు పార్కింగ్ ప్లేస్ పార్క్..."

"ఆ, ఎదవ పార్క్... తోలు మొహం వాళ్లూ.."

"పోనీ ప్లాస్టిక్ మొహాలు ఎక్కడుంటాయో, **కిసలయాలు,** కిలకిల నవ్వులూ ఎక్కడ మనకోసం విరబూస్తాయో.. ఆ తీరానికి పోదాం పద.." అన్నాడు హర్ష.

అతన్ని మంచి మూడ్‌లోకి రప్పింటానికి ప్రయత్నిస్తోంది.

"మాల్‌కి వెళ్దామా? నువ్వు మంచి డ్రెస్ కొనుక్కో..."

"నాకు ఎదురుగా ఒక కామధేనువు ఉంది. అడగకుండానే అన్నాలు వడ్డిస్తుంది. చెప్పకముందే చొక్కాలు కొనిపెడుతుంది. కాలేజీ ఫీజులు కట్టేస్తుంది. కార్లో ఊరంతా తిప్పుతుంది" అన్నాడు హర్ష.

"అదంతా నిజమేగాని, ఇదంతా ఊరికే చెయ్యటం లేదు. నువ్వు ఏదో ఒక కొత్త విషయం కనిపెట్టాలి. ఐ.ఓ.టి. - ఇంటర్నెట్ ఆఫ్ థింగ్స్‌లోపెట్టి దాన్ని ప్రపంచవ్యాప్తంగా అమ్మించి, నేను బిల్ గేట్స్‌ను మించిపోవాలి. అదీ మన కండిషన్... తినేసి, తొంగోటం కాదు... కొత్త ఇన్వెన్షన్... ఇన్నొవేటివ్ కనిపెట్టాలి. అందుకని మేపుతున్నాను నిన్ను.."

"నేను విమానం కనిపెడదాం అనుకున్నాను. షిప్ కనిపెడదాం అనుకున్నాను. కనీసం నేలమీద నడిచే రైలు కనిపెడదామనుకున్నా.

కానీ నా కన్నాముందే తొందరపడి అన్నీ కనిపెట్టేశారు. ఏం చెయ్యను చెప్పు. నాకు ఒక్కటే కనిపిస్తోంది. పెళ్లి కాకుండానే పిల్లల్నికనే టెక్నాలజీ డెవలప్ చేద్దామనుకుంటున్నాను" అన్నాడు హర్ష.

"అడగకుండానే చెంప పగలగొట్టే టెక్నాలజీ ఆల్రెడీ డెవలప్ చేసి పెట్టారు. నీ కోసం పద.. పోదాం" అన్నది అపర్ణ లేచి నిలబడి.

"నిజంగానే అపర్ణా, లోకకల్యాణం కోసం ఏదో ఒకటి చేసి తీరుతాను. ఇదే నా శపథం. నేను గనుక నిత్యాగ్ని హోత్రుడనైతే, ఏకపత్నీవ్రతుడనైతే."

"ముందు నీ కల్యాణం సంగతి చూసుకో హర్షా.... ఉట్టికి ఎక్కలేనమ్మ స్వర్గానికి ఏం ఎక్కుతుంది?" అన్నది అపర్ణ డోర్ లాక్ చేస్తూ.

సాయంత్రం నాలుగుగంటల సమయం. ఆవేళ వాతావరణం అత్యంత ఆహ్లాదకరంగా ఉంది.

గోల్డెన్ గేట్ దగ్గర కారు పార్క్ చేసింది అపర్ణ. ఇద్దరూ సైడ్‌వాక్‌లో నడుచుకుంటూ టవర్ దాకా వెళ్లారు. బ్రిడ్జి కింద సముద్రహోరు.





హృదయం అతని హృదయంతో గుసగుసలా డింది. అప్రయత్నంగా అపర్ణ చెయ్యి అతని వీపును చుట్టేసింది. మనసుతోపాటు మనిషీ మరింత చేరువయ్యింది.

అరగంట తరువాత ఇద్దరూ ఒకరుగా కలిసి నడుస్తూ మౌనంగా మోయలేని హాయి మోస్తూ... సుందర సుమధుర భావావేశంలో తడుస్తూ.. బయల్దేరిన చోటుకి వచ్చారు.

జీవితంలో ఎనలేని ఆనందాన్ని కలిగించే వన్నీ చిన్నిచిన్ని అనుభవాలూ, అనుభూతులే.

పిల్లల్లా బిక్కచచ్చి పడిఉంటే, మనిషికి వికాస మేది? మగపిల్లవాడు పలక చేతబట్టిన నాడె శృంగార పలుకులు పలుకుచుండు, అన్న నానుడి నాకు తెలియనిది కాదు..." అనీ అంటుంది.

ఎప్పుడైనా గీతదాటి ఒక మాట మాట్లాడాల్సి వస్తే 'విత్ యువర్ పర్మిషన్' అంటాడు. అతను చెప్పాక 'నేను పర్మిషన్ ఇవ్వలేదు నీకు' అని నవ్వుతుంది. 'అయితే నేను నీకు చెప్పలేదు... నువ్వు వినలేదు.." అంటాడు.

నెల రోజుల తరువాత హర్ష తండ్రి రఘుపతి అరగంటసేపు మాట్లాడాడు. స్నేహితుడు

## శ్రుతి మెగా మాయ

మెగా హీరోలు శ్రుతి మాయలో పడ్డారని టాలీవుడ్ జనాలు అంటున్నారు. పవన్‌తో మరో సారి జతకట్టబోతున్న శ్రుతి బన్నీతో కూడా రెండోసారి చేయబోతోందట! బన్నీ ఇప్పటి వరకూ మెయిన్ హీరోయిన్‌తో రెండోసారి సినిమా చేసింది లేదని వారు చెబుతున్నారు. మొదటి సారి బన్నీ శ్రుతితో రెండోసారి జతకట్టబోతున్నాడన్నది తాజా సమాచారం! దక్షిణాదిన సక్సెస్‌ఫుల్ హీరోయిన్లు తక్కువగా ఉండడంతో ఇప్పుడు చాలామంది హీరోల కళ్ళు శ్రుతి మీదే ఉన్నాయి. ఎంతమంది ఎంత ఆశ చూపినా తండ్రి సినిమా తరువాతే తన సినిమా అంటోంది శ్రుతి. మొత్తానికి రానున్న రోజుల్లో శ్రుతి వరుసపెట్టి తెలుగు సినిమాలు చేసే అవకాశం ఉంది అనేది మాత్రం నిజం అంటున్నారు.

బ్రిడ్జి మీద పరుగులు పెడుతున్న కార్ల జోరు.. వేగంగా వీస్తున్న గాలి.. కొంచెం చలి.. కొంచెం ఎండవేడి..

దూరంగా అగ్గిపెట్టెల్లా కనిపిస్తున్న భవనాలను చూస్తున్నారు. సముద్ర హోరుగాలికి అపర్ణ జుట్టు చెదిరి మొహం అంతా కప్పేసింది. బంగారు కిరణాలు నీరెండలో ఆమె నగుమోము నిండార విరిసిన పున్నమి జాబిలిలా ఉంది.

"ఇక్కడ నాకు రెండు అద్భుతాలు కనిపిస్తున్నాయి. ఒకటి సముద్రంమీద మానవ నిర్మితమైన సేతువు.. రెండు.. అటు సూర్యుడు. ఇటు చంద్రుడు ఇద్దర్నీ ఒకేసారి చూడటం.." అన్నాడు హర్ష.

"చంద్రుడెక్కడ?" అని ఇంతలేసి కళ్లతో చూసింది.

"ఇదుగో, ఇక్కడే... కమ్ముకున్న నల్లని మబ్బుల్లాంటి కేశాల మాటున, మేఘయవనికల చాటున నిండు జాబిల్లి.." అంటూ ఆమె మొహం మీద కమ్ముకున్న జుట్టును తొలగించి, నుదుటిమీద అతిసుతారంగా పెదవులతో చుంబించాడు. పున్నమి నాటి కడలి కెరటంలా ఉప్పొంగిన అపర్ణ

మర్నాటి నుంచీ చదువులో మునిగిపోయారు. క్లాసుకు సంబంధించిన విషయాలతోనే ఇద్దరూ అలసిపోయేవారు.

అపర్ణ వంట చేస్తుంది. అతను డిష్‌వాషర్‌లో గిన్నెలు వేస్తాడు. అతను కూరలు తరిగిస్తాడు. ఆమె ఉడకబెట్టి కూర తయారు చేస్తుంది. ఒక పూట అపర్ణ అన్నం వండుతుంది. సాయంత్రం అతను ఎలక్ట్రిక్ కుక్కర్‌లో పెట్టేస్తాడు.

ల్యాప్‌టాప్‌లోకి చూస్తూ ఆమె ఏదో అడుగుతుంది. అతను తన ల్యాప్‌టాప్ మీదనుంచి దృష్టి మళ్లించకుండానే సమాధానం చెబుతాడు.

వారం రోజులపాటు ఇద్దరి మొహాల్లోనూ అధ్యయనం. జ్ఞానతృష్ణ... తెలియని విషయాల చిక్కుముడులు నెమ్మదినెమ్మదిగా విడదీసే దీక్షా తత్పరత కనిపిస్తుంటుంది.

నిండు యవ్వనంలో ఉన్న ఒక స్త్రీ, పురుషుడు అతి సమీపంగా ఉన్నామనీ, ఏకాంతంగా ఉన్నామనీ తెలియనట్లే, ఆ ధ్యాస లేనట్లుగానే ఉంటారు.

ఆదివారం ఆటవిడుపు. ఆవేళ రోజంతా సరసోక్తులు, చతురతలకు అంతు ఉండదు. భార్యాభర్తలు కూడా అంత సంతోషంగా ఉండరేమో... ఇద్దరూ ఎవరి గదుల్లో వాళ్లు పడుకుంటారు. కానీ తెల్లవార్లూ పడకగది తలుపులు తెరిచే ఉంచుతారు.

మొదట్లో కొత్తలో అపర్ణ కొంచెం సంశయించింది. క్షణక్షణముల్ 'మగవారి' చిత్తముల్.. అని.

"ఓ మానినీ, నీ మానమున ఆ అనుమానము మానుము. కల్పవృక్షం కొమ్మలునరికి కట్టెలు అమ్ముకునేంత అజ్ఞానిని కాను. నన్ను నమ్ము." అన్నాడు.

ఒక్కోసారి ఏదైనా ఒకమాట జారినా, అపర్ణ నవ్వి ఊరుకుంటుంది.

"జీవితమంతా క్లాస్‌రూంలో కూర్చునే

పట్టాభి చావుకు తామే కారణం అన్న సంశయం ఆయన్ని పట్టి పీడిస్తోంది. తండ్రితో మాట్లాడిన రోజు హర్ష ఏదో తప్పు చేసిన వాడిలా కుంగిపోతాడు.

"అసలేం జరిగిందీ చెప్పు" అడిగింది అపర్ణ.

"పట్టాభి, మా నాన్న చిన్నప్పటి నుంచీ స్నేహితులు. పట్టాభికి చదువుమీద ఏ మాత్రం ఆసక్తి లేదు. ముందు బెంచీలో కూర్చునే మా నాన్నను వెనకబెంచీకి లాగాడు. నెమ్మదిగా స్కూలు ఎగ్గొట్టి సినిమాలకు, షికార్లకు తిప్పటం మొదలుపెట్టాడు. కూసేగాడిద వచ్చి మేసే గాడిదను చెడగొట్టింది.

**తన తండ్రి స్నేహితుడు ఇచ్చిన డబ్బుతో అమెరికా వెళ్ళి చదువుకుంటున్నాడతను. అంతలోనే ఆ స్నేహితుడు హార్ట్ ఎటాక్‌తో మరణించాడు. అంతపెద్ద మొత్తం స్నేహితుడి కొడుక్కి ఇచ్చినట్టు భార్యకు కూడా చెప్పలేదు. దీంతో ఆ ఎన్నారై విద్యార్థి, అతని తండ్రి చిక్కుల్లో పడ్డారు. అందులోంచి బైటపడే ప్రయత్నంలో వారికి లాజిక్ ప్రశ్నలు ఎదురవుతున్నాయి! జీవితాల్ని విడదీసే స్థాయిలో ఉంటాయి ఆ ప్రశ్నలు. ఇంతకూ ఏమిటవి?**

అప్పట్లో వాళ్లకు జీవితంపట్ల సరైన అవగాహన లేదు. స్కూల్ ఫైనల్ పరీక్ష ఎన్నిసార్లు రాసినా గట్టెక్కలేకపోయారు. సినిమాల్లో వేషాలు వెయ్యాలని ఇంట్లో చెప్పకుండా మద్రాసు పారిపోయారు.

"మూడుపదుల వయసులో కళ్లు తెరిచాడు. మా నాన్న. ఏవో రెండు ముక్కలు నేర్చుకుని

గుళ్లో పూజారిగా మారాడు. పట్టాభికి ఆ వెసులు బాటు లేదు. ప్రింటింగ్ ప్రెస్‌లో చిన్న ఉద్యోగం సంపాదించాడు. రిటైరయ్యే నాటికి పదిలక్షలు చేతికి వచ్చాయి. అవి ఫిక్స్‌డ్‌లో వేసుకున్నాడు. నన్ను అమెరికా పంపించి చదివించలేక పోతు న్నానని మా నాన్న బాధపడేవాడు. తన మూలంగా మా నాన్న చదువు చెడిపోయిందన్న న్యూనతా భావం పట్టాభికి ఉండేది.

'మనకు చదువు విలువ తెలియక చెడి పోయాం. మీవాడు చదువుతానంటున్నాడు. మంచి ర్యాంకులు తెచ్చుకున్నాడు. వాడినన్నా చదవనీ' అని, తన దగ్గరున్న డబ్బు ఇచ్చి మాకు సాయం చేశాడు.

"పట్టాభికి రెండుసార్లు హార్ట్ ఎటాక్ వచ్చింది. చికిత్స చేయించుకుంటే కొంతకాలం బతికిఉండేవాడు. తన దగ్గర డబ్బులేక పోవడం వల్ల ఇలా జరిగింది. లాజిక్ ప్రకారం చూస్తే ఆయన చావుకు మేమే కారణమా? అనే ఫీలింగ్ మమ్మల్ని తొలిచేస్తోంది" అన్నాడు హర్ష.

"ఇదెలా ఉందంటే, కారు యాక్సిడెంట్‌లో ఎవరో చనిపోయారనుకో. కారులో ప్రయాణం చేయక పోతే, చనిపోయేవాళ్లు కాదుగదా అనిపిస్తుంది. అది మనకు మనం సమాధానపరుచుకునే ప్రయత్నం. చావు మన చేతుల్లో లేదు. దాన్ని ఆపటం ఎవరి తరమూ కాదు. ఎంత డబ్బున్నా సరే. ఆ కుటుం బానికి అన్యాయం జరిగింది. నాకు చెబితే నేను సర్దుబాటు చేసేదాన్ని కదా హర్షా..."

"అడగాలనుకుని, అడగలేక మానేశాను. అప్పుడప్పుడే పరిచయం అయ్యావు. నేనో బ్రిలి యంట్‌నన్న అభిప్రాయంతో ఉన్నావు. నేను నిరు పేదనని చెప్పుకోవటానికి అహం అడ్డం వచ్చింది. అప్పుడింత చనువులేదు గదా.." అన్నాడు హర్ష.

"అయిందేదో అయిపోయింది. నేను మా ఇంటినుంచి డబ్బు తెప్పించి, మీ నాన్నగారి బ్యాంక్ ఖాతాలో వేస్తాను. ఆ డబ్బు ఆ ఫ్యామిలీకి ఇచ్చేస్తే సరిపోతుంది గదా.." అన్నది.

"అవును... లాజిక్ ప్రకారం సరిపోతుంది" అన్నాడు హర్ష.

మర్నాడు హర్ష తండ్రికి ఫోన్‌చేసి తమ ఆలో చన గురించి చెప్పాడు. మరో వారం తర్వాత తండ్రి దగ్గర నుంచి సమాధానం వచ్చింది.

"పట్టాభిభార్య పైకి అలా కన్పించదుగానీ, చాలా తెలివిగలది. నేను డబ్బు సర్దుబాటు చేస్తా నంటే ఆమె ఏమందో తెల్సా? - ఇవ్వటానికి, తీసు కోవటానికీ కూడా యోగ్యత, అర్హత ఉండాలి. మా కులం కాదు. మాకూ మీకూ బంధుత్వం లేదు. మీకు భార్య లేదు. నాకు భర్త లేడు. ఇలాంటి సమయంలో మీరు పది లక్షలు కాదు. పది రూపాయలు ఇచ్చినా లోకం మెచ్చుతుందా? డబ్బుతో వచ్చే ఈ అక్రమ సంబంధంవల్ల, పోనీ అపవాదువల్ల, రేపు నా పిల్లకు పెళ్లి అవుతుందా? పెద్దవారు, మీరు ఈ మాత్రం ఆలోచించలేదా?- అని అడిగిందిరా.." అన్నాడు రఘుపతి.

"ఆమె చెప్పిన దానిలో లాజిక్ ఉంది నాన్నా.." అన్నాడు హర్ష.

మళ్లీ మొదలైంది దిగులు. హర్ష విషయ మంతా అపర్ణకు చెప్పాడు.

"ఓస్.. ఇంతేగదా.. ఒక అన్న చెల్లెలికి అవసరమైనప్పుడు డబ్బు ఇవ్వకూడదా? సంసారం చితికిపోయినప్పుడు చెల్లెలు అన్న దగ్గరనుంచి సాయం అందుకోగూడదా? లోకం మాత్రం ఏమంటుంది? అన్నాచెల్లెలు మధ్య అక్రమ సంబంధాలు అంటగడుతుందా?" అని నిలదీసింది అపర్ణ.

"ఇందులోనూ లాజిక్ ఉంది.." అన్నాడు హర్ష.

షరామామూలే. హర్ష తండ్రిని సమాధాన పరిచాడు. రఘుపతి మళ్లీ పట్టాభి భార్యతో ముచ్చటించాడు.

పదిరోజుల తర్వాత రఘుపతి కొడుకుకి పరి స్థితి వివరించాడు.

"ఆమె చాలా ఘటికురాలురా.... బంధుత్వాలు రెండు విధాలుగా కలుస్తాయి. ఒకటి 'పుట్టుకతో వచ్చేవి' రెండు 'వివాహంతో వచ్చేవి'. మీరు నన్ను నిజంగా చెల్లెలుగా భావించేట్లయితే, మీ అబ్బాయికి, మా అమ్మాయిని ఇచ్చి వివాహం చెయ్యండి. అప్పుడు మిమ్మల్ని అన్నయ్యగా ఆహ్వానించి, మా ఇంట్లో పీటవేసి మీకు అన్నం పెడతాను అన్నదిరా.. నాకు ఏం సమాధానం చెప్పాలో తోచలేదు" అన్నాడు రఘుపతి.

"ఆమె చెప్పిన దానిలోనూ లాజిక్ ఉంది నాన్నా.." అన్నాడు హర్ష.

హర్ష, అపర్ణతో డిస్కస్ చేశాడు.

"ఆవిడ ఆశకు అంతులేకుండా ఉంది. వాళ్ల కులం వేరు. మన కులం వేరు. పోనీగదా అని జాలిపడితే, అసలుకే మోసం తెచ్చేట్లుంది. కులాంతర వివాహం చేసుకోవాల్సిన పరిస్థితి లేదని 'చెప్పమను' అన్నది అపర్ణ.

మళ్లీ షరా మామూలే. నెల రోజుల తర్వాత రఘుపతి ఫోన్ చేశాడు.

అపర్ణ మాట్లాడింది. "చెప్పండి మామయ్య గారూ.. హర్ష ఫోన్ చేస్తున్నాడు. నిన్న ఏకాదశి గదా... ఇద్దరం ఉపవాసం ఉన్నాం.. అందుకని పెందరాళే వడ్డించాను. స్పీకర్ ఆన్ చేశాను. హర్ష కూడా వింటున్నాడు, చెప్పండి.." అన్నది.

"నేను పట్టాభి భార్యతో నువ్వు చెప్పి నట్లు కులాంతరం ఎలా కుదురుతుందని అడిగాను. అందుకు ఆమె ఏమన్నదంటే - అమెరికావెళ్లి, అక్కడి పౌరసత్వం తీసుకుని అమెరికన్ సిటిజన్‌గా మారుతున్న వాళ్లకు, దేశాన్నీ, దేశ మాతను మర్చిపోయి, మరోదేశ పౌరులుగా మారుతున్నప్పుడు, అక్కడ ఉంటూ ఇక్కడి కులాల గురించి పట్టింపు ఎందుకూ అని అడిగింది. బాగా చదువుకున్న దానిలా ఉంది. మనుస్మృతిలోని శ్లోకం తీసి చూపిం చింది.

'స్త్రీయో రత్నాస్తథా విద్యా - ధర్మం శౌచం సుభాషితం - వివిధానిచ శిల్పాని - సమాదే యాని సర్వతః' అంటే తరుణి, రత్నము, విద్య ధర్మము, సదాచారము, మంచి మాట, సుందర శిల్పములు - ఇవి ఎక్కడి నుంచి అయిననూ

## పెళ్ళా? అప్పుడేనా!

దెబ్బ మీద దెబ్బ పడుతూ అబ్బా అనిపిస్తున్నా కాజల్ సినిమాల మీద ఆశలు వదులుకోవడం లేదు. తెలుగులో రెండు భారీ సినిమాలు, బాలీవుడ్‌లో మరో సినిమా ఫ్లాప్ అయినా, పెళ్ళికి కాజల్ సుముఖంగా లేదు. కొంత కాలం కిందట కాజల్ పెళ్లి చేసుకోబోతోందన్న వార్తలు బాగా వినిపించాయి. అయితే అవన్నీ ఒట్టిదేననీ, ఇప్పుడప్పుడే పెళ్ళి చేసుకునే ఉద్దేశం లేదంటూ స్పష్టం చేసింది. కాజల్ ప్రస్తుతం కోలీవుడ్‌లో ఓ సినిమా చేస్తోంది. ఈ సినిమా అటూ ఇటూ అయితే తప్ప కాజల్ పెళ్ళి చేసుకోదేమో అంటున్నారు సినీ జనాలు.



స్వీకరించవచ్చును అని అర్థం. నాకేం సమాధానం చెప్పాలో తెలియలేదు తల్లీ... ఏదో చేతనైన సాయం చేద్దామన్న సదుద్దేశంతో వెళ్తే ఎక్కడిదాకా తీసుకొచ్చిందో చూడు" అన్నాడు రఘుపతి.

"వదిలెయ్యండి మామయ్యగారూ, పుణ్యానికి పోతే పాపం ఎదురయ్యిందంటే ఇదే మరి.. ఇంక ఈ విషయం మర్చిపొండి" అని చెప్పింది అపర్ణ.

ఇంకో రెండు నెలలు గడిచాయి.

ఎన్నిసార్లు ఎంత నచ్చచెప్పినా రఘుపతి మామూలు మనిషి కాలేకపోతున్నాడు.

"ఆమె చెప్పిన దానిలోనూ లాజిక్ ఉందిరా.. మరో దేశంవెళ్లి అక్కడ డబ్బు సంపాదించుకుంటూ, అక్కడి పౌరులుగా మారుతున్నప్పుడు ఇక్కడి పద్ధతులు, ధర్మాలు ఎలా వర్తిస్తాయి? దేశ ధర్మములు, కుల ధర్మములు, జాతి ధర్మములు, వయో .ధర్మములు, గుణ ధర్మములు, శరీర ధర్మములు, కాల ధర్మములు, ఆపద్ధర్మములు అంటూ ఎన్నో ధర్మాలున్నాయి. ఏ దేశంలో ఏది ఆచారమో అదే అక్కడ అనుసరించదగింది. దానినే దేశాచారం అంటారని భృగుమహర్షి చెప్పాడు" అని రఘుపతి ఏవేవో చెప్పుకుంటూ వస్తున్నాడు.




చివరకు ఆయనకు మతిస్థిమితం లేదేమో, అన్న అనుమానాలు కలుగుతున్నాయి. చితి, చింత ఈ రెండూ మనిషిని దహించివేస్తాయి. మొదటిది శరీరాన్ని విడిచిపెట్టాక, చివరిసారి ఒకసారి మాత్రమే దహిస్తుంది. రెండోది అలా కాదు. బతికి ఉన్నంతకాలం - నిత్యం దహించి వేస్తూనే ఉంటుంది. ఈ వేదనే, మనోవేదన. దీనికి మందు లేదు.

ఒకరోజు రాత్రి అపర్ణకు మెలకువవచ్చి చూస్తే, హర్ష సిట్ అవుట్‌లో చీకట్లో కూర్చుని ఉన్నాడు. అపర్ణ కూడా కుర్చీ తెచ్చుకుని పక్కన కూర్చుంది. హర్ష దేనికో బాధ పడుతున్నాడని అర్థమైంది. తలమీద చెయ్యివేసి ప్రేమగా నిమిరింది.

"అపర్ణా, నేనంటే నీకు ఎందుకింత ప్రేమ, దయ, జాలి.."

అపర్ణ నిట్టూర్చింది. "జీవితంలో ఎప్పుడు, ఎవరు, ఎవరికి, ఎక్కడ తారసపడతారో, ప్రేమానుబంధంతో పెనవేసుకుపోతారో ఎలా తెలుస్తుంది?"

"ఇంత అపారమైన ఆదరణ, కరుణ నాపైన ఎందుకు చూపిస్తున్నావు?"

"దీనికి నీవు ఏ పేరుపెట్టి పిలిచినా అభ్యంతరం లేదు. నా దగ్గర పదితరాలు కూర్చుని తిన్నా తరగనంత డబ్బు ఉంది గనుక, నీకు పెట్టగలుగుతున్నాను. ఎంత ఉన్నా కూడా నేను ఎంతవరకు అనుభవిస్తానో, నా చేతులతో ఇతరులకు ఎంత ఇస్తానో అది మాత్రమే నాది. మిగతాది నాది కానట్లే... మనకాళ్ల కింద ఉన్న భూమిలో బొగ్గు ఉంది. కానీ నువ్వు దాన్ని అనుభవించలేనప్పుడు, అది నీ కాళ్ళ కిందనే ఉన్నా, అది నీది కానట్లే. నువ్వు అనుభవించలేకపోతున్నావు గనుక ధనం, సంపద విషయంలోనూ ఇదే సూత్రం వర్తిస్తుంది".

"నిజమే గానీ, నువ్వు ఇవ్వదల్చుకుంటే ఇంకా చాలామంది, కోట్లమంది ఉన్నారు గదా, నాకే ఎందుకిస్తున్నావు అపర్ణా?" అని అడిగాడు అమాయకంగా.

"నీలో నాకు కాసేపు ఒక గొప్పమేధావి కనిపిస్తాడు. కాసేపు ఏమీ తెలియని ఒక పసివాడు కనిపిస్తాడు. వర్షం సముద్రంలోనూ కురుస్తుంది. బీటలువారిన భూమి మీదా కురుస్తుంది. సముద్రపు నీటిలో నీరు కలిసిపోతుంది అంతే. బీటలు వారిన భూమిమీద పడిన వర్షం వల్ల ఒక విత్తనం మొలకెత్తుతుంది. ఏదో ఒక రోజున అది మహా వృక్షమవుతుంది. ఎందరికో చల్లని నీడనిస్తుంది. అందమైన పుష్పాలను, తియ్యని ఫలాలను ఇస్తుంది. ఏమో, రేపు నువ్వు ఏ శాస్త్రవేత్తవు కాబోతున్నావో? రెండేళ్ళపాటు నీకు నీడనిచ్చి, పాదుచేసి, నీరుపోసి ఎదగనిచ్చాను. ఒక ఔషధమొక్క ఎండిపోకుండా కాపాడాను. ఆ ఔషధం రేపు ఎన్ని ప్రాణాలు కాపాడుతుందో, ఏం చెప్పగలం?" అన్నది అపర్ణ.

చాలాసేపు మౌనం వాళ్ల మధ్య నిండు గర్భిణిలా ఉండిపోయింది.

హర్ష నెమ్మదిగా అన్నాడు. "నాకు ఊహ తెలియకముందే తల్లి చనిపోయింది. ఆమె ఎలా ఉంటుందో కూడా తెలియదు. తోడబుట్టిన వాళ్ళూ లేరు. తండ్రి ఉన్నా, ఆయన లోకం వేరు. తెల్లవారుజామున అయిదింటికి లేచి గుళ్ళోకి వెళ్తే రాత్రి పదింటిదాకా ఆయనకు దేవుడి సేవ చెయ్యటమే సరిపోయేది. ఇన్నేళ్ల జీవితంలో ప్రేమగా పలకరించిన వాళ్ళు లేరు. ఇవాళ నువ్వు ప్రేమగా నా తల నిమురుతుంటే, నీలో ఒక తల్లినీ, చెల్లినీ, చెలియనీ, స్నేహితురాలినీ, ఆప్తురాలినీ, పరమాత్ముడినీ చూస్తున్నాను" అంటూ హర్ష ఆమె ఒడిలో తలపెట్టుకుని వెక్కివెక్కి ఏడ్చాడు.

అపర్ణ తన ఒడిలో పడుకున్న ఒక పసివాడిని తల నిమురుతూ లాలనగా ఓదార్చింది.

నాలుగు రోజులు తర్వాత మళ్ళీ అదేచోట ఆమెతో అన్నాడు. "నేను అమెరికా బయల్దేరే ముందు, ఆయన రుణం తప్పకుండా తీర్చుకుంటానని పట్టాభికి మాట ఇచ్చాను. ఆ రుణం మరో విధంగా తీర్చమంటోంది ఆయన భార్య. ఏం చెయ్యను?" అని అడిగాడు.

చాలా గంటలసేపు, రోజులపాటు, నెలల తరబడి చర్చలు, వాదోపవాదాలు జరిగాయి. అపర్ణ అలసిపోయింది.

హర్ష పట్టాభి కూతుర్ని చేసుకోవటమే సబబని నిర్ధారించుకున్నారు.

అపర్ణకు మరో సంబంధం ఖాయం అయింది. ఇండియా వచ్చింది. అంగరంగ వైభవంగా ఆమె వివాహం జరిగింది.

ఆ మర్నాడు అపర్ణ రఘుపతిని వెతుక్కుంటూ వెళ్ళింది. ఆయన ఆశీర్వదించాడు.

పట్టాభి కూతురుని పిలిపించమని కోరింది. గంట తరువాత ఆ అమ్మాయి వచ్చింది బురఖాలో. రెండు రోజుల కిందట ఆ అమ్మాయి తన క్లాస్‌మేట్ అయిన ఒక ముస్లింని ప్రేమ వివాహం చేసుకుంది.

మర్నాడు అపర్ణ హర్షతో మాట్లాడింది. "ఇదంతా ఎందుకిలా జరిగిందో తెలియదు. గొప్పవాళ్ళ జీవితాల్లో ఎన్ని చీకటి కోణాలో! భవిష్యత్తులో ఏ ప్రభలెత్తే మహోజ్వల వైభవానికి చిహ్నమో ఇది. నీలో ఒక అబ్దుల్ కలాంని, ఒక అటల్ బిహారీ వాజ్‌పాయ్‌ని చూస్తున్నాను. నువ్వు ఎవరెస్ట్ శిఖరం అంత ఎత్తుకి ఎదిగినప్పుడు, రెండేళ్ళపాటు నీతో కలిసి మెలిసి తిరిగిన స్నేహితురాలిని గుర్తుంచుకుంటావు కదూ...."

ఇక్కడ ఆమెకు, ఎడమ చెంపమీద అక్కడ అతనికి కుడి చెంపమీద కన్నీరు కారుతోంది. ఇందులోని 'జస్ట్‌లాజిక్' ఏమిటంటే - ఇద్దరి బాధా ఒకటే మరి.

ప్రైమ్ హాస్పిటల్స్
హైదరాబాద్, 040-4959 4959



డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 98495 63360

# మోకాలు మార్పిడితో కొత్త జీవితం

## అందుబాటులోకి అత్యాధునిక చికిత్సా విధానాలు

ప్రస్తుతం వయస్సు పైబడిన వారిలో ఎక్కువగా కనిపిస్తున్న మోకాళ్ళ నొప్పులు. నొప్పి ఎక్కువైతే రోజువారి పనులు చేసుకోవడంలో ఎంతో ఇబ్బంది పడుతుంటారు. వీరిలో కొంతమందికి మందులు, ఫిజియోథెరఫీ వంటి ప్రక్రియలతో ఉపశమనం కలుగుతుంటే, మరికొందరికి మోకాలి మార్పిడి శస్త్రచికిత్స అవసరమవుతుంది. ఇటువంటి వారికి మోకాలిమార్పిడి శస్త్రచికిత్స ఒక వరం లాంటిదని చెప్పవచ్చు. ప్రస్తుతం మోకాలు కీలు మార్పిడి శస్త్రచికిత్సల్లో అత్యాధునిక మార్పులు చోటు చేసుకుంటున్నాయి. ఎప్పటికప్పుడు పాత పద్ధతులకు స్వస్తి పలుకుతూ ఆధునిక విధానాలు అందుబాటులోకి వస్తున్నాయి.

### ఎందుకీ మోకాళ్ళ నొప్పులు...?

సాధారణంగా రెండు ఎముకల చివరన మోకాలి చిప్ప వెనుక కార్టిలేజ్ పొర ఉంటుంది. ఈ కార్టిలేజ్‌పొర కొబ్బరికాయలోని కొబ్బరిపొరలా మెత్తగా ఉంటుంది. అలాగే ఎముకలు దగ్గరగా ఉంచడంలో లిగమెంట్ అనే తాడు లాంటి పదార్థం సైతం కీలకంగా ఉంటుంది. తొడను, కాలి ఎముకలను దగ్గరగా కలిపి ఉంచేందుకు, జాయింట్ జారిపోకుండా ఉండేందుకు ఈ పొర తోడ్పడుతుంది. మోకాలి ఎముకల మధ్యన ఉండే కార్టిలేజ్ అరిగి పోతే ఆ ఎముకల మధ్య దూరం తగ్గి అవి రాసుకుంటాయి. దాంతో రెండు ఎముకలు ఒరుసుకుపోయి నొప్పివస్తుంది.

### మోకాలి మార్పిడి ఎవరికి అవసరం...?

కీలులోని రెండు ఎముకల మధ్య రాపిడి తగ్గించే కార్టిలేజ్ దెబ్బతిన్నపుడు కీళ్ళ నొప్పులు ప్రారంభమవుతాయి. ఈ కార్టిలేజ్‌లో ఎంత నష్టం జరిగిందనే దాని మీద ఆధారపడి చికిత్స ఉంటుంది. ప్రాథమిక దశలో మందులతో పాటు వైద్యులు ఫిజియోథెరఫీ సూచిస్తున్నారు. కార్టిలేజ్ కొద్దిగా అరిగిన వారికి నొప్పి నివారణ మందులతో పాటు ఇంట్లో చేసుకునే విధంగా పలు రకాల వ్యాయామాలు సూచిస్తారు. మందులు, ఫిజియోథెరఫీ వంటి ప్రక్రియ వల్ల నొప్పి నుండి ఉపశమనం కలుగని సందర్భాలలో మోకాలి మార్పిడి శస్త్రచికిత్స అవసరమవుతుంది.

- రోజువారి పనులు చేసుకోలేకపోతున్నవారికి
- నొప్పి నివారణ మాత్రలు వారానికి రెండు కంటే ఎక్కువ వాడాల్సి వస్తున్నా
- నొప్పి నివారణ మందులు, ఇతర చికిత్సలు పనిచేయనప్పుడు
- విశ్రాంతి సమయంలో కూడా నొప్పి ఎక్కువగా ఉన్న సందర్భాలలో మోకాలిమార్పిడి శస్త్రచికిత్స చేయించుకోవాల్సి వస్తుంది.

### మోకాలు మార్పిడిలో అత్యాధునిక విధానాలు

మోకాళ్ళు పూర్తిగా అరిగిపోయినపుడు చేసేది మోకాలు కీలు మార్పిడి శస్త్రచికిత్స. మోకాలు మార్పిడి శస్త్రచికిత్స పై ఎన్నో అపోహలు, మరెన్నో భయాలు ఉన్నాయి. ఈ సర్జరీ చాలా నొప్పి కలిగించే ప్రక్రియ అని, ఆపరేషన్ తర్వాత కూడా చాలా రోజుల పాటు విశ్రాంతి అవసరమని చాలా మంది భావిస్తుంటారు. కానీ మోకాలు మార్పిడి శస్త్రచికిత్సలో అందిస్తున్న అత్యాధునిక ప్రక్రియలతో నొప్పి భాద లేకుండానే ఆపరేషన్ నిర్వహిస్తున్నారు. మిగతా సర్జరీలతో పోల్చితే మోకాలు మార్పిడి సర్జరీలలో 98 నుండి 99 శాతం సక్సెస్ రేటు నమోదవుతుంది.

### ఆపరేషన్ సమయంలో ఏం చేస్తారు..?

తొడ ఎముక కింది భాగం, కాలు పై భాగం మధ్యలో ఉండే కార్టిలేజ్ అరిగిపోవడం వల్ల మోకాళ్ల మధ్య రాపిడి ఎక్కువై నొప్పి మొదలవుతుంది. ఆపరేషన్‌లో భాగంలో అరిగిన ఎముక స్థానంలో కృత్రిమ మెటల్‌ను అమర్చుతారు. రెండు వైపులా మెటల్ వేసిన తర్వాత అరిగిన కార్డిలేజ్ స్థానంలో కప్ లాంటి ప్లాస్టిక్ వాషర్‌ను అమర్చుతారు. శస్త్ర చికిత్స తర్వాత నొప్పి పూర్తిగా తగ్గిపోయి మామూలుగా నడవగలుగుతారు. ఎలాంటి నొప్పి, బాధ లేకుండా రోజువారీ కార్యకలాపాలు చేసుకోగలుగుతారు.

### అపోహలు వీడండి..!

మోకాలు మార్పిడి శస్త్రచికిత్స తర్వాత జీవితం ఎలా ఉంటుందో అని చాలా మందిలో ఎన్నో అపోహలు, మరెన్నో భయాలు ఉన్నాయి. మోకాలు మార్పిడి చేయించుకుంటే నెలల తరబడి విశ్రాంతి అవసరమని, విధులను నిర్వహించలేమని, ఎక్కువకాలం ఇతరులపై ఆధారపడాల్సి వస్తుందని అపోహ పడుతుంటారు. కానీ అవన్నీ అపోహలు మాత్రమే. మోకాలు మార్పిడి చేయించుకున్న తర్వాత అందరిలాగే సాధారణ జీవితం గడపవచ్చు. అయితే ఆపరేషన్ జరిగిన తర్వాత కొన్ని రోజుల పాటు మాత్రం వైద్యుల సలహాలు, సూచనలు పాటిస్తూ జీవనశైలిలో మార్పులు చేసుకుంటూ సరైన జాగ్రత్తలు పాటించాలి. కొన్ని సందర్భాలలో చాలా అరుదుగా ఆపరేషన్ సమయంలో ఇన్‌ఫెక్షన్ సోకే అవకాశం ఉంటుంది. ఇలాంటి సందర్భాలలో మళ్లీ ఆపరేషన్ నిర్వహించాల్సి ఉంటుంది. ఇలాంటి పరిస్థితి ఒక శాతం మంది రోగులలో మాత్రమే తలెత్తుతుంది.

### విశ్రాంతి ఎంత అవసరం..?

ఆపరేషన్ తరువాత రెండుమూడు నెలలు పడుకునే ఉండాలి అనేది అపోహ మాత్రమే. అత్యాధునిక విధానాలలో ఆపరేషన్ నిర్వహించడం ద్వారా సర్జరీ అయిన రోజునే రోగిని నడిపిస్తారు.

### వ్యాయామం చేయొచ్చా?

మోకాలు మార్పిడి సర్జరీ తర్వాత వాకింగ్, సైక్లింగ్, స్విమ్మింగ్ వంటి వ్యాయామాలు చేయవచ్చు. మోకాలు పై అధిక ఒత్తిడిని కలిగించే వ్యాయామాలకు కొన్ని నెలలపాటు దూరంగా ఉండాలి. ఆపరేషన్ జరిగిన తర్వాత వైద్యులు సూచించిన విశ్రాంతి సమయం పూర్తయిన తర్వాత యోగా కూడా చేయవచ్చు.

# కొత్త సీరియల్ ప్రారంభం



**దుమ్ముతెరలు రేపుతూ దూసుకువచ్చింది ఆ జీపుకారు. సడన్‌బ్రేకుతో చింతచెట్టు దగ్గర ఆగింది. ఎగిరి కిందికి దూకారు అందులో ఉన్న నలుగురు పర్సనాలిటీలు. పెద్ద పెద్ద అడుగులతో చెట్టుకు ఆరుఅంగల దూరంలో ఉన్న చిల్లరకొట్టు దగ్గరకు పోయారు.**

**చెన్నకేశవులు నడిపే కొట్టు అది. చార్మినార్ సిగరెట్టు పాకెట్ల దగ్గర్నించి సిరిసిపాలెం చింతపండుదాకా ఎటువంటి సరుకు కావాలన్నా కచ్చితంగా దొరికే దుకాణం.**

**'ఏంది బాబులూ. ఏం కావాలె?' విసురుగా వచ్చిన ఆ పర్సనాలిటీలను చూసీచూడగానే వినయంగా, వినమ్రంగా మర్యాదగా అడిగాడు అతను.**

**'ఆరడుగుల ఎత్తుంటాడు. గడ్డం పెరిగి ఉంటుంది. ఒంటి మీది చొక్కా మాసిపోయి, మరకలు పడి ఉంటుంది. మోకాళ్ళ దగ్గర చిరిగిపోయిన ప్యాంటు, ఇటుగా ఏమైనా వచ్చాడా?' అని అడిగింది ఒక పర్సనాలిటీ.**

ఆశ్చర్యపడలేదు చెన్నకేశవులు. ఆళ్ళగడ్డ బిడ్డడు అతను. అయినదానికి కానిదానికి అనవసరంగా ఆత్రుతపడే ఘటం కాదు.

'మా ఊళ్లో వాళ్ళల్లో మూడొంతుల మంది ఆరు అడుగుల ఎత్తే ఉంటారు. పది పదిహేనుమంది ఈ మధ్యన గడ్డాలు కూడా పెంచుతున్నారు. చినిగిపోయిన ప్యాంట్లు మరకలు పడిన చొక్కాలు వేసుకు తిరిగే రకాలు మాత్రం కాదు' నిబ్బరంగా అన్నాడు.

'ఓరోరి... చతుర్లు వద్దు. నిజంగానే చెప్పు. అట్టాంటోడు ఇటుగానే వచ్చాడు.. నీకుగాని ఏమైనా కంట పడినాడా?' కొంచెం అసహనంగానే అడిగింది రెండో పర్సనాలిటీ.

ఆ రోజు ఉదయం తమ ఊళ్ళోనుంచి వచ్చి తన దుకాణం తెరిచిన క్షణం నుంచీ అప్పటివరకూ అటుగా వచ్చి పోయిన జనాలందరినీ ఒకసారి గట్టిగా గుర్తు చేసుకున్నాడు చెన్నకేశవులు.

'లేదు. అసువంటి వాళ్ళెవరూ ఇటుగా రాలేదు.' పూర్తి నమ్మకంతో చెప్పాడు.

'నువ్వు మాకు ఒక చిన్నసాయం చేసి పెట్టాలి. చేసి పెడతావా?' ఉన్నట్లుండి అడిగింది మూడవ పర్సనాలిటీ.

'ఎసుమంటి సాయం?' కనులు చిట్లించి అనుమానంగా చూస్తూ అడిగాడు చెన్నకేశవులు.

'భయపడాల్సిన అవసరం లేదబ్బా.. కొట్లాటలకి రమ్మని పిలవటం లేదు.. మాట సాయం..' అన్నాడు.

'ఎసుమంటి మాట?' మరింత అనుమానంగా అడిగాడు చెన్నకేశవులు.

'ఆడుగాని, అసువంటివాడుగాని ఇటుగా వస్తే ఒక చిన్న ఫోను కొట్టు. అంతే.. అంతకుమించి ఏమీ చేయవలసిన అవసరం లేదు.' అంటూ తన షర్టు జేబులో నుంచి చిన్న మందపాటి కాయితం ముక్క తీసి ముందుకు జాచాడు నాలుగో పర్సనాలిటీ.

పది అంకెలు వేసి ఉన్నాయి దానిమీద. మొదటి మూడు అంకెల్నీ చూడగానే ఆ నెంబరు ఏ ఫోన్ కంపెనీదో కనిపెట్టేశాడు చెన్నకేశవులు.

'ఈ చుట్టుపక్కల ఈ నెంబర్లకు సిగ్నల్సు సరిగ్గా అందవు. మా ఓళ్ళు ఎవరూ ఈ నెంబర్లు వాడుకోరు' కనులు చిట్లిస్తూ చెప్పాడు.

'మరేమీ పరవాలేదబ్బా. ఒకసారి కాకపోతే రెండుసార్లు చెయ్యి.. ఆడు కనిపించాడని ఒక్కమాట ఈ నెంబరుకు చెబితే చాలు..' అంటూ వెనక్కితిరిగి తమ జీపుకారు దగ్గరకు బయలుదేరాడు మొదటి పర్సనాలిటీ.

'సిగరెట్లుగాని, బీడీలుగాని ఏమీ వద్దా? కూల్డ్రింకులు మంచి కూల్‌గా ఉన్నాయ్...' అన్నాడు చెన్నకేశవులు.

'ఏమీ వద్దబ్బా. ఆడు కనిపించేదాకా అసలు తిండి కూడా తినేటట్టులేదు మా పని..' వెనక్కి తిరిగి కూడా, చూడకుండా చెప్పి వెహికల్‌లో కూర్చున్నారు వాళ్ళు నలుగురు.

ఎంత హఠాత్తుగా వచ్చిందో అంతే హఠాత్తుగా కది

# వెట్టై
## (ది వారియర్)

-మధుబాబు



లిందది. దుమ్ముతెరలు రేపుతూ ముందుకు దూసుకుపోయింది.

'పావుగంటపాటు పోలీసులమాదిరి పెద్దపెద్ద ప్రశ్నలు వేశారు. నేను వాళ్ళకి ఏదో బాకీ ఉన్నట్టు ఫోన్ చెయ్యమని చిన్నచీటి చేతుల్లో పెట్టారు. ఒక్క బీడీకట్ట కూడా తీసుకోలేదు. కనీసం పిప్పర్‌మెంట్ బిళ్ళ కూడా ఖరీదు చేయలేదు. నేను మాత్రం ఈళ్ళు చెప్పినట్టు చేయాలట' కచ్చగా తనలో తను అనుకుంటూ చేతిలో ఉన్న కాయితాన్ని చింపి, ఉండగా చుట్టి రోడ్డు మీదికి విసిరేశాడు చెన్నకేశవులు.

గట్టిగా వీస్తున్నది గాలి. రోడ్డుమీద పడలేదు కాయితపు ఉండ. రెక్కలు వచ్చినట్టు తేలుతూపోయి, చింతచెట్టుకు అవతలివైపు పొదలమీద పడింది.

'ఏంట్రోయ్ చెన్నకేశవులూ.. ఏంటో రుసరుస లాడుతున్నావ్. ఏంటి కథ?' అంటూ ఒక కంఠం వినిపించే సరికి, తలతిప్పి పక్కకు చూశాడు చెన్నకేశవులు.

వాళ్ళ ఊరి ప్రెసిడెంటు.. పొడుగ్గా లావుగా ఉన్న పొగచుట్ట నొకదాన్ని నోటిలో పెట్టుకొని, అగ్గిపెట్టె కోసం లాల్చీ జేబులు తడుముకుంటూ కనిపించాడు.

'అయ్యా... చూసుకోలేదు. ఆ ఎదవలెవరో జీపు కారులో ఎవడినో వెతుక్కుంటూ వచ్చి నా బుర్ర తినేసి పోయారు. ఆ గొడవలోపడి తమర్ని గమనించుకోలేకపోయినా..' అంటూ గబగబా ఒక అగ్గిపెట్టె అందించాడు.

'రోజులు పాడైపోయినయ్‌రా చెన్నకేశవులూ. ఎవణ్ణి చూడు.. ఏదో ఒక గొడవ.. తన్నులాటలు.. తగాదాలే! జీవితాలై పోయినయ్... విసుగొచ్చేస్తోంది' పొగచుట్ట వెలిగించి, అగ్గిపెట్టె తిరిగి అతనికి ఇచ్చేస్తూ తన అభిప్రాయం వెల్లడించాడు ప్రెసిడెంటు.

'అయ్యా... ఊళ్లో నాగమ్మతల్లి పూజలు పెట్టుకుని తమరు ఇటుగా వచ్చారేంటి?' తన దుకాణంలో తను కూర్చునే కుర్చీని దుకాణం వెలుపలికితెస్తూ అడిగాడు చెన్న కేశవులు.

'అమ్మాయి వస్తోందిరా.. నాగమ్మతల్లి పూజప్పుడు ఇంటి ఆడబిడ్డ లేకపోతే ఎట్లా?' కుర్చీలో కూర్చుంటూ తమ ఊళ్ళో నుంచి రోడ్డుమీదికి వచ్చిన కారణం చెప్పాడు ప్రెసిడెంటు.

ఎడమచేతికి ఉన్న వాచివంక చూసుకున్నాడు చెన్నకేశవులు. 'ఇప్పటికే గంట లేటు. ఈపాటికే వచ్చేసి ఉండాలి మూడు గంటల బస్సు..' అంటూ దుకాణంలో ఉన్న ఐసు బాక్సు తెరిచి, ఒక కూల్ డ్రింకు బాటిల్ తెచ్చి ఆ పెద్ద మనిషికి అందించాడు.

'ఇంతకీ ఆ జీపుకారులో వచ్చింది ఎవరు?' బాటిల్‌ని అందుకుంటూ అడిగాడు ప్రెసిడెంటు.

'మన ఇలాకా ఓళ్ళు కాదయ్యా... బళ్ళారికి దగ్గరగానో, కొంచెం అవతలగానో ఉంటారు.. ఆళ్ళు ఇచ్చిన నెంబరు అటు పక్కదే. మనదికాదు' అన్నాడు చెన్నకేశవులు.

'ఏది అది? ఒకసారి చూపించు..' ఖాళీ అయిన బాటిల్ కింద పెడుతూ చేతిని జాచాడు ప్రెసిడెంటు.

ఇరకాటంలో పడ్డాడు చెన్నకేశవులు. నోరుతెరిచి అడిగిన తర్వాత వెంటనే ఇవ్వకపోతే ఏమైనా అనుకోవచ్చు. గంగిగోవు మాదిరి ఉండే ప్రెసిడెంట్‌లో

విపరీతమైన చిరాకు దాక్కుని ఉంటుంది.

'రోడ్డుమీదికి విసిరేశానయ్యా... ఉండండి.. చూసొస్తా..' అంటూ గబగబా చింతచెట్టు దగ్గరికి పోయాడు చెన్నకేశవులు. చించి ఉండచేసి విసిరేసిన ఆ ఫోనునెంబరు కాయితం గాలికి ఎగురుకుంటూ అవతలగా ఉన్న పొదలమీద పడటాన్ని చూసి ఉండడంవల్ల, తడుముకోకుండా తను అటే పోయాడు.

సన్నటి సందు ఉంది ఆ పొదల మధ్య. ఆ సందులోకి అడుగుపెట్టీ పెట్టగానే కరెంటుషాకు కొట్టినట్లయింది అతనికి.

వెల్లకిలా పడిపోయి ఉన్నాడు ఒక మనిషి. మాసిపోయిన గడ్డం, మచ్చలుపడిన షర్టు, మోకాళ్ళ వద్ద చిరిగిపోయిన ప్యాంటు.

గుబగుబలాడుతున్న గుండెల్ని చిక్కబట్టుకుని, నెమ్మదిగా ముందుకు వంగి, ఆ మనిషి చేతిమీద చెయ్యివేశాడు చెన్నకేశవులు.

చల్లగా తగులుతుందనీ, ఆ మనిషి ఊపిరి ఆగిపోయి అప్పటికి చాలాసేపై ఉంటుందనీ అనుకుంటున్న అతని అంచనా తప్పని వెంటనే తేలిపోయింది.

వెచ్చగా ఉంది చెయ్యి. ఒట్టిగా కాదు. నూట రెండో, నూట మూడో జ్వరం వచ్చినట్టు మంటలు మండిపోతోంది.

వచ్చినవాడు వచ్చినట్టే వెనక్కి తిరిగి దుకాణం దగ్గరకు పరిగెత్తాలని, తను విసిరేసిన ఫోను నెంబరు కాయితాన్ని వెతికి, దానిమీద నెంబర్‌కి వెంటనే ఫోను చెయ్యాలనీ వెనువెంటనే కోరికలు కలిగాయి అతనికి.

'బస్సు... బస్సు వస్తోంది చెన్నకేశవులూ బస్సు..' కూర్చున్న కుర్చీలోంచి పైకిలేస్తూ ప్రెసిడెంట్ పెద్ద కంఠంతో పిలిచేసరికి తను డైలమాలోనుంచి బయటపడ్డాడు.

తెలివితప్పి పడిపోయినట్లు చలనం లేకుండా పడిఉన్నాడు ఆ మనిషి. అప్పటికప్పుడు ఎక్కడికీ పోలేడు. బస్సు దిగి కస్టమర్స్ ఎవరైనా దుకాణం



**పది లక్షల భూగోళాలు పట్టేంత పెద్దది సూర్యగోళం!**

దగ్గరకు వస్తే, తన నోటి ముందు కూడు నాశనం అయిపోతుంది.

నెంబరు వేసి ఉన్న కాయితాన్ని వెతికే ఆలోచన మనస్సులోంచి తుడిచేసుకుని వెనక్కి వెళ్ళిపోయాడు అతను.

'ఏంట్రా ఆ స్పీడు.. ఎందుకు అంత వేగం?' రాకెట్ మాదిరి దూసుకొస్తున్న బస్సుని గమనిస్తూ ఆశ్చర్యంగా కామెంట్ చేశాడు ప్రెసిడెంట్.

నిజమే అనిపించింది చెన్నకేశవులుకి. ఎగుడు దిగుళ్ళు, ఎత్తుపల్లాలతో నిండి ఉంది ఆ రోడ్డు. ఎప్పుడో మూడు సంవత్సరాల క్రితం వేసిన రోడ్డు. పోయినేడు పడిన రెండే రెండు వర్షాలకి తారు కొట్టుకుపోయింది. గులకరాళ్ళు లేచిపోయి, పెద్ద పెద్ద గుంటలు ప్రత్యక్షం అయ్యాయి.

'ఆడు ఆ డ్రైవర్ మన ఊరి అల్లుడే.. మనోళ్ళు ఎవరైనా బస్సులో ఉంటే మహా గీర చూపిస్తాడు. ఎందుకైనా మంచిది వీలు చూసుకుని ఒకసారి

**బస్సు దూసుకొచ్చి మర్రిచెట్టును ఢీకొట్టి పక్కనున్న గోతిలో పడిపోయింది. అంతలోనే వెనుక నుండి మంటలు చెలరేగాయి. పొదల్లో అపస్మారకంగా పడి ఉన్న ఆ యువకుడు ఆర్తనాదాలు విని కళ్ళు తెరిచాడు. సర్వశక్తులూ కూడగట్టుకున్నాడు. సాహసం చేసి మొనగాడి విరా అనిపించుకున్నాడు. కానీ అంతకుముందు అక్కడ జరిగిందేమిటి? అతనికోసం ఆరాటపడుతున్న ఓ ఇద్దరు వ్యక్తులు ఎలాంటి రహస్యం దాచి పెట్టారు? వాళ్ళెందుకలా చేశారు?**

మీరు మాట్లాడండయ్యా. జోరు వద్దని చెప్పండి' అంటూ మాట మధ్యలోనే మింగేశాడు చెన్నకేశవులు.

వేగంగా వస్తున్న బస్సు ఒక గోతిలో పడి రబ్బర్ బంతి మాదిరి ఒక్కసారిగా పైకి లేచింది.

'అయ్యయ్యో... అయ్యయ్యో..' అని అరిచాడు అప్పుడే ఊళ్ళో నుంచి రోడ్డు మీదికి వచ్చిన పౌరుడు ఒకతను.

అతను అరుస్తూ ఉండగానే షార్ప్‌గా పక్కకు తిరిగి, రోడ్డు పక్కకు దూసుకుపోయింది బస్సు. ఊడలు దిగిన మర్రి చెట్టు ఒకటి ఉంది అక్కడ. దబీమని శబ్దం చేసింది దాన్ని ఢీకొట్టిన బస్సు.

అక్కడితో ఆగలేదు అది. దబ్బున పక్కకు వంగి, మర్రి చెట్టు వెనకున్న పెద్ద గోతిలోకి పడిపోయింది.

'చంపేశాడురా... అందర్నీ అప్పనంగా చంపి పారేశాడు. వాడిని బతకనీయకూడదు. ఆ మర్రి చెట్టుకి ఉరి తీసి చంపాలి' కరకరలాడుతున్న కంఠంతో ఎనౌన్స్ చేస్తూ, అటుకేసి పరిగెత్తాడు ప్రెసిడెంటు.

ఆయనతోపాటు అప్పుడే వచ్చిన పౌరుడు - అతని వెనకే చెన్నకేశవులు ఇద్దరూ ఉరుకులు పెట్టారు.

అరుపులు, ఆర్తనాదాలు, ఏడుపులు, పెడబొబ్బలతో హోరెత్తి పోతున్నది మర్రిచెట్టు వెనుక వాతావరణం.

మందంగా ఉన్న అద్దాలను దబీదబీమని పగలగొట్టే ప్రయత్నాలు చేస్తున్నారు లోపల ఉన్న ప్యాసింజర్లు కొందరు.

'చూస్తారేంటిరా? రాళ్ళు తీసుకోండి. పైకిఎక్కి పగలగొట్టేయండి' జీరపడిన కంఠంతో అరుస్తూ, చుట్టూ చూశాడు ప్రెసిడెంటు వాళ్ళ కోసం.

వెల్లకిలాపడిపోయిన పశువు కాళ్ళని ఆకాశంలోకి ఎత్తినట్లు కనిపిస్తున్నాయి బస్సు టైర్లు. గిర్రు గిర్రున తిరుగుతూనే ఉన్నాయి ముందున్నవి.

బర్రె తలంత లావుగా ఉన్న కొండరాయి కనిపించింది చెన్నకేశవులుకి. గట్టిగా పట్టుకుని, వెనుక భాగంలోకి పోయాడు.

అద్దం చాలా పెద్దది ఉంటుంది అక్కడ. రెండే రెండు దెబ్బలు పడితే పుటుక్కున పగిలి ఊరుకుంటుంది. లోపల గిలగిలా కొట్టుకుంటున్న జనం గబగబా బయటికి వచ్చేయొచ్చు.

గుండెలనిండా గాలి పీల్చుకుని పట్టుకొచ్చిన కొండరాయిని పైకి ఎత్తాడు అతను. అద్దం మీదికి విసరబోతుండగా - ఫెడీల్మని శబ్దం చేస్తూ పగిలిపోయింది అద్దం.

'రండి.. రండి. బయటికి వచ్చేయండి. వచ్చేయండి' తాను పట్టుకున్న రాయిని కిందికి వదిలేసి బిగ్గరగా అరిచాడు అతను.

లోపల ఉన్నవాళ్ళు ఎవరూ బయటికి రాలేదు. బుస్సుమని వికృత ధ్వనులు చేస్తూ దూసుకు వచ్చాయి ఎర్రటి మంటలు.

మొఖం మాడిపోయినంత పనయ్యేసరికి- తనకు తెలియకుండానే వెనక్కి దూకాడు చెన్నకేశవులు.

'ఏంట్రా? ఏంటా మంటలు?' భయంగా అడిగాడు ప్రెసిడెంటు.

'ఎదవ నా బిడ్డలు ఎవరో పెట్రోలు క్యాన్లు వెంటబెట్టుకు వచ్చినట్లున్నారు. పగిలిపోయినట్లున్నాయ్ అవి' మంటలతో పాటు సుడులు తిరుగుతూ బయటికి వస్తున్న పొగల్ని చూస్తూ అన్నాడు చెన్నకేశవులు.

బస్సు వెనుక భాగాన్ని మంటలు పూర్తిగా కమ్మేశాయి. పగిలిపోయిన అద్దం వెనుక నుంచి బయటికి దూకాలని ప్రయత్నిస్తే తప్పకుండా ఆ మంటల్లో చిక్కుకుని మాడి మసి అయిపోతారు.

తారాపథానికి చేరుకున్నాయి బస్సులో నుంచి వినవస్తున్న అరుపులు. కాళ్ళు చేతులు ఆడటం మానేశాయి చెన్నకేశవులుకి.

'ముందుకు పోవాలిరా.. ముందున్న అద్దం..' అంటూ తాను గోతిలోకి దిగబోయి, కాళ్ళు జారటంతో బోర్లా పడిపోయాడు ప్రెసిడెంట్.

'అయ్యయ్యో... మీరు పడిపోయారేంటయ్యా? లేవండి బాబూ... లేచి నిలబడండి' ఆందోళనగా అంటూ ఆయన చేతుల్ని పట్టుకున్నాడు చెన్నకేశవులు.

అతని కనుచివర్ల నుంచి కనిపించింది ఒక కదలిక. ఎందుకో తెలియకుండానే ఝల్లుమంది ఒళ్ళు.

ఓపికనంతా కూడగట్టుకుని తూలుకుంటూ వస్తున్నాడు చింతచెట్టు దగ్గర పొదల్లో అతనికి కనిపించిన మనిషి.

బస్సు వెనక నుంచి దూసుకువస్తున్న మంటల్ని చూశాడు కాబోలు. అటు రాలేదు. మర్రిచెట్టుకు అవతలివైపు నుంచి ఎగిరి బస్సు మీదికి దూకాడు. దూకిన వెంటనే పాదాలతో కిటికీ అద్దాలని దబీదబీమని తన్నాడు.

పుటుక్కు పుట్టుక్కుమంటూ పగిలిపోయినయ్ అవి.

'పక్కకు తప్పుకోండి. అద్దం ముక్కలు కళ్ళలో పడితే కళ్ళు పోతాయ్' అంటూ ముందుకువంగి విండోకి అడ్డంగా బస్సు ఆ చివర నుంచి ఈ చివర దాకా బిగించి ఉండే ఇనుపగొట్టాన్ని పట్టుకుని బలంగా పైకి లాగాడు.

బస్సు పడిపోయిన అదటుకు అది బలహీన పడిపోయినట్లయింది కాబోలు - తేలికగానే ఊడి పైకి లేచిపోయింది.

'రండి... వచ్చేయండి రండి' అని హెచ్చరిస్తూ ముందుకు వంగి లోపలికి చేతుల్ని జాచాడు అతను.

కిందపడిపోయిన ప్రెసిడెంటును వదిలేసి తాను కూడా ఉడత మాదిరి బస్సుమీదికి పాకాడు చెన్న కేశవులు.

అప్పటికే అరడజను మందిని బయటికి లాగే శాడు ఆ మనిషి. భయంతో వణికిపోతున్నారు ఆ ప్యాసింజర్లు.

'దించేయ్... కిందికి దించేయ్..' అంటూ అద్దాలు పగలగొట్టి తాను ఏర్పాటు చేసిన ఖాళీలోంచి బస్సులోకి జారాడు ఆ మనిషి.

'మంటలు... బస్సు తగలబడి పోతోంది. దిగ బోకు' ఆందోళనగా అరుస్తూ అతన్ని ఆపటానికి చెన్నకేశవులు చేసిన ప్రయత్నం ఎందుకూ పనికి రాకుండా పోయింది.

లోపలికి జారిన వెంటనే లబోదిబోమని అరు స్తున్న ఒక ఆడమనిషి నడుము పట్టుకుని కిటి కీలో నుంచి బయటికి ఎత్తాడు ఆ మనిషి. మరో పదిసెకన్ల తరువాత నలుగురు పిల్లల్ని, ఇరవై సెకన్ల తరువాత ఇంకో ఎనిమిదిమంది మగవాళ్ళని చెన్నకేశవులకి అందించాడు.

ఊళ్ళో నుంచి రోడ్డుమీదికి వచ్చిన తమ గ్రామ స్థుడి సహాయంతో అందరినీ పైకిలాగి, బస్సు కిందికి నెట్టివేయగలిగాడు చెన్నకేశవులు. తాను కూడా లోపలికి దిగాలని అనుకుంటుండగా, దబ్‌మని శబ్దం చేస్తూ పగిలిపోయింది బస్సు ముందుండే పెద్ద అద్దం.

'వెళ్ళండి. బయటికి వెళ్ళిపొండి.' అని అరుస్తూ లోపలే ఉండిపోయిన అందరినీ ఆ ఖాళీలనుంచి అవతలికి నెట్టేశాడు ఆ మనిషి. మర్రిచెట్టును డీ కొట్టిన వెంటనే ముందుకు వంగిపోయింది స్టీరింగు చక్రం. దానికీ సీటుకీ మధ్య చిక్కుకుపోయి కళ్ళు తేలవేసి ఉన్నాడు డ్రైవరు. ఎంతో ప్రయత్నం మీద అతన్ని ఇవతలకి లాగి చేతుల్లో మోసుకుంటూ బయటికి తీసుకొచ్చాడు ఆ మనిషి.

మొహాలు పగిలినయ్ చాలామందికి. చేతులు గాయపడినయ్ కొంతమందికి. నెత్తురుతో మలిన పడిపోయి ఉన్నాయ్ మరికొంతమంది మొహాలు.

'వచ్చేశారు... అందరూ బయటికి వచ్చేశారు. లోపల ఇంకెవరైనా ఉన్నారా?' ఆందోళనగా అడు గుతూ తను కూడా బస్సుమీదికి ఎక్కబోయిన ప్రెసిడెంటును అతి బలవంతంగా ఆపి, దూరంగా లాక్కుపోయాడు చెన్నకేశవులు.

వెనుక భాగంలో ఉన్న మంటలన్నీ బస్సును పూర్తిగా ఆక్రమించుకోవటమే అందుకు కారణం.

చూస్తూచూస్తూ ఉండగానే సర్వనాశనం అయి పోయింది అది.

•••

'ఓరోరి... నువ్వు నిజంగా మొనగాడివే అబ్బయ్యా.. నూట మూడు జొరంతో ఉండి కూడా నలభై మందిని బస్సులో నుంచి బయటికి లాగినవ్ చూడు. అదీ మొనగాడి తనమంటే.. నాకు నచ్చావ్ అబ్బయ్యా. బాగా నచ్చేసినవ్..' చీకట్లు దట్టం అవు తున్న సమయంలో రమణాచారి ఇంటి దగ్గరకు వచ్చి, ఇంటి పక్కన ఉండే పాకలో చిరుచాపమీద పడుకుని ఉన్న మనిషిని పలకరించాడు ప్రెసిడెంటు.

ఒంట్లో ఉన్న ఓపికనంతా కూడగట్టుకుని చాపమీద లేచి కూర్చున్నాడు ఆ మనిషి. ఆళ్ళంద రికీ ఇంకా తలరాతలు తిన్నగా ఉన్నట్లున్నయ్. అందుకే బతికి బయటపడ్డారు. నేను చేసింది ఏమీలేదు. ఆ చిల్లరకొట్టు మనిషి...' అంటూ పక్కకు చూశాడు.

తన పెళ్ళాంతో చెప్పి, పెద్ద కంచుచెంబు నిండా వేడి వేడి పాలు పోయించుకుని అప్పుడే ఆ పాక లోకి వస్తున్నాడు చెన్నకేశవులు.

'మా ఊరు మొత్తానికి ఈ రమణాచార్లుగారే దేవుడు. కాలు నొచ్చినా, కన్నునొచ్చినా మమ్మల్ని ఆదుకునే మహానుభావుడు.. తిండి సరిగ్గా లేక పోవడంవల్ల నీకు జ్వరం వచ్చిందని, వేరే రోగం ఏదీ లేదని నాకు చెప్పాడు. ఇదిగో అబ్బయ్యా.. పటికబెల్లం వేసి కాచి ఇచ్చింది మా అమ్మి... తాగేసి పండుకో. తెల్లారేసరికి తగ్గిపోతుందట..' చాపమీద కూర్చుని ఉన్న మనిషిని చూసి సంతోషంగా చెప్పి, కంచు చెంబు అతనికి అందించాడు.

కృతజ్ఞతాపూర్వకంగా చూసి ఆ చెంబు తీసుకు న్నాడు ఆ మనిషి. పెదవులకు ఆనించుకుని గట గటా తాగేశాడు ఒక్క నిమిషంలో.

'ఆచార్లుగారు చెప్పింది నిజమే.ఆకలిమీద ఉన్నాడు. నీ ఇంటికి తీసుకుపోయి దండిగా తినబెట్టు. ఎంత యితే అంత నేను ఇచ్చేస్తాను' చిన్నకంఠంతో చెన్న కేశవులు చెవిలో ఊదాడు ప్రెసిడెంటు.

'అమ్మాయిగారు ఎలా ఉన్నారు? తలమీద దెబ్బ తగ్గిపోయిందా?' ఆయన్ని అడిగాడు చెన్నకేశవులు.

తగలబడిపోయిన బస్సులో డ్రైవర్ వెనకాల ఉన్న సీట్లోనే కూర్చుంది ఆయన కుమార్తె. మర్రి చెట్టును డీ కొట్టినప్పుడు - తలకు దెబ్బతగిలి కళ్ళు తేలేసింది. చేతులమీద మోసుకుంటూ బయటికి తీసుకువచ్చాడు చాపమీద కూర్చున్న మనిషి.

'ఇంకొక్క క్షణం ఆలస్యం అయ్యుంటే బస్సుతో పాటు తాను కూడా తగలబడిపోయి ఉండేది. సంతోషంగా జరిగిపోవాల్సిన నాగమ్మతల్లి పూజ ఏడుపులు మొత్తుకోళ్ళతో ముగిసిపోయి ఉండేది. అంతా ఈ అబ్బయ్య చేసిన సాయం. ఈ జన్మలో మర్చిపోలేం..' అన్నాడు ప్రెసిడెంటు.

'మీ సింగడు లగెత్తుకుంటూ వస్తున్నాడు. మీ కోసమే అయ్యుంటుంది. అటు చూడండయ్యా..' అన్నాడు చెన్నకేశవులు.

ప్రెసిడెంటు గారింట్లో నమ్మకంగా పనిచేసే మనిషి ఆ సింగన్న... చరాచరా వచ్చి పాకముందు నిలబడ్డాడు.

'ఏందిరా సింగన్నా? ఏందీ హడావుడి' లాల్చీ జేబులోంచి పొగాకు ఉండతీసి, చుట్ట చుట్టటానికి సిద్ధం అవుతూ అడిగాడు ప్రెసిడెంటు.

'తగలబడిపోయిన బస్సు దగ్గరికి పోలీసులు

## నవ్యవీక్లి-నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కవిత




### సముద్రంలో రాత్రి

కాంతి స్తంభాన్నెక్కి
తన చుట్టూ తానే తిరుగుతుంది
సముద్రంలో మూడు మునకలేసి
తేలిపోయిన పడవలకు దారి చూపుతుంది.

ఖాళీ అయిపోయిన ప్రదేశాల్లోకి
జారిపోయిన చూపులన్నీ
వెలుగును చూడగానే
రేయింబవళ్ళ నవ్వడిలోంచి వికసిస్తై.

చెలరేగిన తుపాను
సుడిగుండాల్లోంచి
అలల కలల ఊగిసలాటల మధ్య
ఎక్కడెక్కడికో చేరిపోయే వేళల్లో
మంచి సమయంలాగా
సుతారంగా తీరంలోకి విసిరేస్తుంది.

లోపలికి నీరు దూరి
కొట్టుకుపోతున్న పడవను నేను
నన్ను వెతుక్కుంటూ
అన్నివైపులా తిరుగుతున్న
దీపం నువ్వు

తీరంలో అలలు
కసరత్తు చేస్తూనే ఉన్నై
దీపం తిరుగుతుంటుంది
కొండెక్కుతున్న
మినుకు మినుకు వెలుగులకు
కాస్తంత ఊపిరి పోస్తుంది.

అర్ధరాత్రి సముద్రమ్మధ్యలో
చేపలు వలలో పడడమే వేరు



కలలు తూలివచ్చి
మనస్సు బుట్టలో పడుతున్నై.
ఎటూ కదల్లేని తీరం
దాన్నే చుట్టూరా చూస్తూ
సూర్యోదయం కోసం పడిగాపులు కాస్తుంది

**-ర్యాలి ప్రసాద్, సెల్: 94945 53425**

వచ్చారయ్యా. మీ కోసం కబురెట్టారు' చెప్పాడు సింగన్న.

ఎందుకో చటుక్కున తలతిప్పి చాపమీది మనిషి వైపు చూశాడు చెన్నకేశవులు.

బస్సులో ఉన్న ప్రయాణికుల్ని రక్షించిన మనిషి అతను. మీసం మీద చెయ్యివేసి నిలుచోవాల్సిన హీరో.

ఒంట్లో ఉన్న జ్వరం మరింతగా పెరిగిపోయి నట్లు ఒక్కసారిగా కాంతి తగ్గిపోయింది అతని మొహంలో. అప్పటికప్పుడు చాపమీది నుంచి లేచి దూరంగా పరిగెత్తుతాడేమో అనిపించేటంత అల జడి అతనిలో అగుపించింది.

జరిగిందేదో జరిగిపోయింది. రోడ్డుమీద గోతుల్ని సరిగ్గా చూసుకోకపోవడంవల్ల ఈ గోల మొదల యింది. దెబ్బలు తగలటమే తప్ప ఎవరికీ ఏమీ ప్రమాదం లేదు. డ్రైవర్ కూడా తేరుకున్నాడు. ఇంకా ఈళ్ళు రావటం దేనికి? నోటికొచ్చింది కాయి తాలమీద రాసుకుని వచ్చిన దారినే వెళ్ళి పొమ్మ నండి. ఊళ్ళోకితెస్తే తిండిదండగ..' తనకు తెలియ కుండానే ప్రెసిడెంటుగారికి సలహా ఇచ్చాడు చెన్నకేశవులు.

'అంతేనంటావా?' చుట్ట వెలిగించుకుంటూ అన్నాడు ప్రెసిడెంటు.

'అంతేనయ్యా. అంతగా కావాలంటే ఆ డ్రైవర్ని,




కండక్టర్ని ఎంటబెట్టుకుని పొండి... శుభమా అంటూ మనం పూజలు చేసుకుంటున్నప్పుడు ఆళ్ళు ఊళ్ళోకి రావటం అనవసరం' తడుముకోకుండా చెప్పాడు చెన్నకేశవులు.

మాటలు ప్రెసిడెంటుకే చెప్పాడు అతను. చూపులు మాత్రం చాపమీద ఉన్న మనిషివైపే ఉన్నాయి.

సగానికి సగం తగ్గిపోయింది ఆ మనిషి మొహంలోని అలజడి. పెద్ద ప్రమాదం తప్పిపో యినట్లు మొహంమీద ప్రత్యక్షం అయిన చెమట తుడుచుకున్నాడు.

'రండి దొరగారూ... ఆలస్యం అయితే అక్కడ ఆళ్ళు గోల గోల చేసేత్తరు' అనుమానంగా సింగన్న హెచ్చరించడంతో చుట్టపొగ గుప్పుగుప్పున బయ టికి వదులుతూ వీధిలోకి పోయాడు ప్రెసిడెంటు.

'రమణాచార్లుగారికి చెప్పి వస్తా.. నిన్ను మా ఇంటికి తీసుకుపోతా. కదలకుండా పడుకో..' చాప మీది మనిషికి చెప్పి తాను కూడా పాకలోనుంచి బయటికి వచ్చాడు చెన్నకేశవులు.

వెంటనే ఆలస్యం అనేది లేకుండా ఇంటిముందే కనిపించాడు అతనికి ఆ వైద్యశిఖామణి.

'ఆ అబ్బయ్యని నేను మా ఇంటికి తీసుకు..' అంటూ మొదలుపెట్టబోయిన చెన్నకేశవుల్ని మధ్య లోనే ఆపేశాడాయన.

'అందరూ వింటూ ఉండగా అధిక ప్రసంగం బాగో దని సరైన తిండిలేక అతనికి జ్వరం వచ్చిందని చెప్పాను. అది నిజం కాదు' చిన్నకంఠంతో అన్నాడు.

'నిజమేంటి సామి?' ఆశ్చర్యంగా అడిగాడు చెన్నకేశవులు.

'దెబ్బలున్నాయ్.. వీపునిండా పెద్దపెద్ద గాయాలు ఉన్నాయ్. వెదురుచువ్వతో ఇష్టం వచ్చినట్లు ఎవరో బాదిబాది వదిలారు. ఒళ్ళంతా వాతలు తేలిపోయి ఉంది. గాయాలు చీముపట్టి జ్వరం వచ్చింది' నిజం ఏమిటో బయట పెట్టాడు వైద్యుడు.

ఏం మాట్లాడాలో, ఆ మాటల్ని ఎలా అర్థం చేసుకోవాలో అర్థం తెలియక తల బరుక్కున్నాడు చెన్నకేశవులు.

ఛట్‌మంటు అతని కళ్ళముందు మెదిలారు జీపుకారులో వచ్చి తమకు ఫోన్ చెయ్యమని చెప్పిన ఆగంతకులు.

'వాళ్ళపనే అయ్యుంటుందా అది? వాతలు తేలేటట్టు కొట్టింది వాళ్ళే అయ్యుంటారా?"

'ఏంటి చెన్నకేశవులూ? ఏంటి ఆలోచిస్తున్నావ్?'

రమణాచార్లుగారు పలుకరించేసరికి మటుమాయమై పోయాయి అతని ఆలోచనలు.

'అయ్యగారూ... ఆ దెబ్బల మూలకంగా అతనికి ప్రమాదం ఏదయినా...' అని అనబోతుండగా మరో సారి మధ్యలోనే అడ్డుకున్నాడు వైద్యుడు.

'అబ్బెబ్బే... అటువంటిదేమీలేదు. ఏదైనా ఉండి ఉంటే అతను అసలులేచి నిలబడగలిగి ఉండేవాడు కాదు. బస్సు దగ్గరికి వచ్చేలోపలే రోడ్డుమీద విరగ దీసుకు పడిపోయి ఉండేవాడు' అన్నాడు.

పొదల్లో తాను చూసినప్పుడు ఆ మనిషి తెలివి లేకుండా పడిపోయిఉన్న పరిస్థితి మళ్ళీ కనుల ముందు మెదిలింది చెన్నకేశవులకి.

ఈసారి ఒక్కక్షణం కూడా ఆగలేకపోయాడు. జీపుకారు వచ్చి తన దుకాణం దగ్గర ఆగినక్షణం నుంచీ మొదలుపెట్టి జరిగినదంతా వైద్యుడికి చెప్పేశాడు.

'ఆ దొంగ నా బిడ్డలు ఇతని కోసమే వెతుకు తున్నారు. వివరం తెలిస్తే తప్పకుండా ఇక్కడికి వచ్చేస్తారు.." అని కూడా చెప్పాడు.

సీరియస్‌గా పది క్షణాలపాటు ఆలోచించి తల ఊపాడు వైద్యుడు. 'ఇవాల్టికి ఇక్కడే ఉంచేయ్. జ్వరం తగ్గటానికి, గాయాలు నెమ్మదించటానికి సూదిమందు ఎక్కిస్తాను. రేపు సాయంత్రానికల్లా బాగా తేరుకుంటాడు. విషయంచెప్పి ఊరు దాటిం చేద్దాం. ఎంతలేదన్నా నలభై మందిని కాపాడిన వాడు. సాయంచేయటం మనకి చాలామంచిది.' చిన్నగా చెప్పాడు.

నచ్చాయి చెన్నకేశవులకి ఆ మాటలు. 'మా అమ్మికి చెప్పి తినటానికి తిండి తీసుకువస్తాను' అంటూ వీధిలోకి బయలు దేరాడు.

'ముక్కలు చెక్కలు వద్దు. జ్వరం ఉంది కదా.. తేలిగ్గా అరిగేవి తీసుకో' పెద్దగా అరిచి చెప్పాడు వైద్యుడు.

పాకలో చాపమీద కూర్చున్న మనిషి మహా తాపత్రయ పడిపోతున్నాడు వారిద్దరి మాటల్ని చెవిన వేసుకోవటానికి. వైద్యుడు ఆఖర్లో అరిచిన అరుపు ఒక్కటే అర్థం అయింది అతనికి.

'నువ్వు ఇక్కడ ఉండగా నీకు వచ్చేబాధ ఏదీ ఉండదు. నెమ్మదిగా ఉండు. నేను నాగమ్మతల్లి గుడి దగ్గరికి పోయొస్తా' పాక దగ్గరికి పోయి అన్యాప దేశంగా అతనికి ధైర్యం చెప్పాడు రమణాచార్లు.

భుజాలమీది ఉత్తరీయం సరిచేసుకుంటూ వీధి లోకి వెళ్ళిపోయాడు. పదేపది నిమిషాలపాటు కదలకుండా చాపమీదనే ఉండిపోయాడు ఆ మనిషి. పదినిమిషాల తరువాత, నెమ్మదిగా లేచాడు. కళ్ళు గిర్రున తిరిగినట్లున్నాయ్. దగ్గర్లోఉన్న ఒక గుంజ పట్టుకుని, బ్యాలెన్స్ నిలుపుకున్నాడు. అడుగులో అడుగు వేసుకుంటూ తాను కూడా వీధిలోకి బయలుదేరాడు.

అక్కడికి చాలా దగ్గర్లోనే ఉన్నట్లుంది వైద్యుడు చెప్పిన నాగమ్మగుడి. ఊరి జనమంతా అక్కడే గుమికూడి ఉన్నట్టు... గాలి వాలున తెరలు తెరలుగా వినవచ్చింది సందడి.

మైకులుపెట్టారు అక్కడ. భక్తిరసాన్ని విరజిమ్మే పాట ఒకటి ఆ సందడితోపాటు వినిపిస్తోంది.

గుండెలనిండా ఊపిరి పీల్చుకున్నాడు ఆ మనిషి. మొహంమీదికి పడుతున్న దుబ్బుజుట్టు వెనక్కి నెట్టుకుంటూ పక్కకి తిరిగి ఊరి బయటికి తీసుకుపోయే దారి వైపు బయలుదేరాడు.

పాతికఅడుగుల దూరం మాత్రమే పోయాడు అతను. ఉన్నట్లుండి అతని దారికి అడ్డంగా ప్రత్యక్షం అయింది ఒక ఆడమనిషి.

ముప్పయి అయిదు, నలభై సంవత్సరాల మధ్యలో ఉంటుంది వయస్సు. గుండ్రటి మొహం. పెద్దపెద్ద కళ్ళు. పెద్ద తలకట్టు.

ఎక్కడివాడక్కడ ఆగిపోయి ఊపిరి బిగపట్టే శాడు ఆ మనిషి.

వీధిదీపం వెలుగుపడి మిలమిల మెరిసిపోతు న్నది ఆ తల కట్టు. నడుముల్ని దాటి మరో మూరెడు కింది వరకూ కనిపిస్తోంది.

'వెళ్ళిపోతున్నావా? అందరూ గుడిదగ్గరికి పోయి దండాలు పెట్టుకుంటుంటే నువ్వు మాత్రం దొంగ లాగా పారిపోతున్నావా?' నడుము మీద చేతులు వేసుకుని అత్యంత గంభీరంగా అడిగింది ఆమె.

గొంతు ఎండుకు పోయినంత పని అయ్యింది ఆ మనిషికి. తగ్గిపోతోంది అనుకుంటున్న జ్వరం తిరిగి పెరిగిపోతున్న అనుభూతి కలిగింది.

'నువ్వు.. నువ్వు ఎవరివి?' తడబడకుండా ఉండటానికి ప్రయత్నం చేస్తూ అడిగాడు. కిలకిలా నవ్వింది ఆమె.

**(ఇంకావుంది)**

# సురభి

## సముద్రంలో శివాలయం

దేశంలో ఒక్కొక్క ఆలయానికి ఒక్కొక్క ప్రత్యేకత ఉంది. ఎన్నో వింతలు, విడ్డూరాలు దర్శనమిస్తాయి మన దేశ ఆలయాల్లో! అలాంటిదే ఈ గుడి కూడా!

గుజరాత్, భావనగర్‌కు కిలోమీటర్ దూరంలో ఉన్న అరేబియా సముద్రంలో పరమేశ్వరుని దేవాలయం ఉంది. దాని ప్రత్యేకత ఏమిటంటారా? పొద్దున్నే మనం అక్కడికి వెళ్దామనుకోండి, అప్పటికి అక్కడ గుడి కనిపించదు. అక్కడ ఆలయం ఉందనడానికి సూచికగా ఓ ధ్వజస్తంభం మాత్రమే కనిపిస్తుంటుంది. తరువాత మెల్లిగా మధ్యాహ్నం ఒంటిగంట నుంచి సముద్రం వెనక్కి వెళ్తూ ఉంటుంది. దాంతో ఆలయం పూర్తిగా కనిపిస్తూ వెళ్ళడానికి మార్గం దొరుకుతుంది. ఇక భక్తులు అక్కడికి నడుచుకుంటూ వెళ్ళి పూజలు చేస్తారు. ఇలా రాత్రి పది గంటల వరకూ మీరు అక్కడే కాలం గడపొచ్చు. ఇక ఆ సమయం దాటితే మాత్రం అక్కడి నుంచి వెనక్కి వచ్చేయాల్సిందే! ఎందుకంటే మళ్ళీ సముద్రం ముందుకు వచ్చి ఆలయాన్ని నీటముంచుతుంది. దాంతో అది మర్నాడు మధ్యాహ్నం వరకు కనిపించదన్నమాట! అదీ అక్కడి విశేషం. ధ్వజస్తంభం ఎత్తు దాదాపు 20 మీటర్లు. అంటే దాదాపు ఆ ఎత్తువరకు నీళ్లు వచ్చేస్తాయి. కొన్ని వందల ఏళ్ళుగా ఇక్కడ ఇలాగే జరుగుతోందట. ఈ పరమేశ్వర ఆలయాన్ని పాండవులు నిర్మించారన్నది స్థలపురాణ గాథ! పౌర్ణమి రాత్రి పోటు సమయంలో పదిగంటల వేళ సముద్రం బాగా ముందుకు వచ్చేయడం, మెల్లిగా ఆలయాన్ని తనలో గర్భంలో దాచేసుకునే దృశ్యం అక్కడి యాత్రికులకు ఎంతో కనువిందు చేస్తుంది. అదండీ సంగతి!



## స్టోరీ రిపీటైంది!

సినిమాల్లో హీరోకో, హీరోయిన్‌కో యాక్సిడెంట్ అయితే గతమంతా మరిచిపోతారు. మరో యాక్సిడెంట్ కాగానే అంతా గుర్తుకొస్తుంది. కేవలం సినిమాల్లోనే ఈ విధంగా జరుగుతుందనుకుంటే పొరబాటే! ఎందుకంటే నిజజీవితంలో కూడా ఇలాంటి సంఘటనలు జరుగుతున్నాయి.

మేరీయాన్ ఫ్రాంకో అనే మహిళకు 1993లో యాక్సిడెంట్ అయింది. ఆ సమయంలో ఆమె వెన్నుపూసకు దెబ్బతగిలి కంటిచూపు పోయింది. 20 ఏళ్ళుగా ఆమెకు కంటి చూపు లేదు. మంచానికే పరిమితమైంది. యాక్సిడెంట్ కారణంగా ఒంట్లో సత్తువ కోల్పోయింది. కానీ ఓ అద్భుతం జరగడంతో ఆమెకు తిరిగి కంటిచూపు వచ్చింది. ఇక రేపోమాపో అనుకుంటున్న 70 ఏళ్ళ వయసులో మళ్ళీ కంటి చూపు రావడంతో ఆమె ఉబ్బితబ్బిబ్బైపోతోంది.

అసలేం జరిగిందంటే, ఒకసారి మంచం మీద నుంచి దిగి నడుస్తుంటే కాలికి ఏదో అడ్డుతగిలి వెల్లకిలా పడిపోయింది మేరియాన్ ఫ్రాంకో. తల వెనుక బలమైన దెబ్బ తగిలింది. తరువాత హాస్పిటల్‌కి తీసుకెళ్ళారు. మూడు గంటలపాటు సర్జరీ జరిగింది. స్పృహలోకి వచ్చే సరికి ఆమెకు అన్నీ కనిపించడం మొదలయింది. ఈ విషయం డాక్టర్లకు కూడా నమ్మబుద్ధి కావడం లేదట. "మెదడుతో లింక్ ఉండే కళ్ళకు ఈ దెబ్బతో తిరిగి రక్తప్రసరణ ఆరంభమై చూపు వచ్చిందేమో" అంటున్నారట డాక్టర్లు. సినిమా కథ రిపీటైంది కదూ!

## బుడగలు పేల్చే బుల్లి కుక్క!

అరనిమిషంలో వంద బుడగలు పగలగొట్టడం సాధ్యమా? కానీ ఓ బుల్లి కుక్కగారు అలవోకగా ఆ పని పూర్తిచేసి గిన్నిస్ బుక్‌లోకి ఎక్కేశారు. జాక్‌రస్సెల్ జాతికి చెందిన ఆ బుల్లి శునకం పేరు ట్వింకీ. అమెరికా కాలిఫోర్నియా శిక్షకురాలు డోరీ సిట్టెర్లీ పర్యవేక్షణలో ట్వింకీ ఈ శిక్షణ పొందింది. కేవలం 39 సెకన్లలో వంద బుడగలు పగలగొట్టి, అంతకు ముందు ఉన్న గిన్నిస్‌రికార్డును తిరగరాసింది ట్వింకీ. సెకనుకు 2.5 బుడగలు పగలగొట్టి అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తింది. గిన్నిస్ రికార్డు సాధించింది. భలే భలే శునకం!



## నీటిమీద పెయింటింగ్స్!

కాగితంపై పెయింటింగ్ వేయటం, ఇసుకతో కళాఖండాలు సృష్టించడం తెలుసు. కానీ గారిప్ మాత్రం ఈ సంప్రదాయ పద్ధతులన్నింటికీ భిన్నంగా నీటిపై పెయింటింగ్ వేస్తున్నాడు. అదెలా సాధ్యం? అని ఆశ్చర్యంగా ఉంది కదూ! కానీ ఇది నిజం.

టర్కీ గారిప్‌కి చెందిన మిమర్ సినన్ విశ్వవిద్యాలయంలో ఫైన్ ఆర్ట్స్ డిగ్రీ పూర్తిచేశాడు గారిప్. హీబ్రూ టెక్నాలజీ ఉపయోగించి నీటి ఉపరితలంమీద కళ్ళు చెదిరే చిత్రాలు ఆవిష్కరిస్తున్నాడు. ఒక బౌల్‌లో ఉన్న నీటిపై తేలియాడేలా బ్లాక్‌డై, ఆయిల్స్, రంగులను కలిపి తయారుచేసి, చిన్నపాటి చువ్వ వంటి పరికరంతో నీటిపై వాన్‌గోగ్ చిత్రాన్ని ఆవిష్కరించాడు. అనంతరం తేలియాడుతున్న కళాఖండం ముద్రను కాగితంమీదకు ఎక్కించాడు. ఇక ఆ తర్వాత దాన్ని వీడియోగా మలిచాడు. ఈ వీడియోను ఇప్పటికే రెండుకోట్ల అరవైలక్షల మంది పైగా వీక్షించారు. ప్రపంచవ్యాప్తంగా హీబ్రూ చిత్రకారులు ఏర్పాటు చేసిన ఎన్నో ప్రదర్శనల్లో గారిప్ కళాఖండాలను ప్రదర్శనకు ఉంచారు.



-నర్మద వాసిరెడ్డి



# గేమ్ ఆఫ్ లైఫ్

-కంఠంనేని రాధాకృష్ణమూర్తి 4

**ప్రతి మనిషికీ జీవితం సుఖదుఃఖాల సమ్మిళితంగా ఉంటుంది. జీవితంలో ఎత్తులు, పల్లాలు, శిఖరారోహణలు, లోయలోకి పల్టీలు కొట్టటం, ఎదురుదెబ్బలు తగలటం సహజం.**

**ఒక వ్యక్తిగా మిమ్మల్ని మీరు తీర్చిదిద్దుకోవాలన్నా, కోరుకున్న విధంగా మీ జీవితం ఉండాలన్నా మొదట మీ గురించి మీరు తెలుసుకోవాలి. మీ ఆలోచనలు, మీ దృక్పథం ఎలా ఉన్నాయో ఆకళింపు చేసుకోవాలి. అర్థం చేసుకోవాలి.**

## మీ రిమోట్ మీ చేతిలోనే ఉండాలి!

ఓపెన్‌మైండ్‌లో ఉన్నప్పుడు మాత్రమే మీ గురించి మీకు స్పష్టమైన అవగాహన వస్తుంది. ఓపెన్‌మైండ్ అంటే మనోద్వారాలను తెరిచి ఉంచటం. ఏ బడాయిలు, గొప్పలు, అబద్ధాలు, మిమ్మల్ని మీరు వంచించుకోవటాలు లేకుండా మీలోని తప్పును తప్పుగా, లోపాన్ని లోపంగా అంగీకరిస్తూ మీరేమిటో తెలుసుకోవటం.

అట్లాగే ఇతరుల్లోఉన్న మంచి, తెలివితేటలు, ఎదుటి వారి సామర్థ్యం అంగీకరించటం, మానసికంగా మీరు అవతలివాళ్ళను అంగీకరించటం ఓపెన్‌మైండ్.

ఇంతకుముందే చెప్పినట్లుగా ఆలోచనలు, అనుభూతుల నుంచి దృక్పథం ఏర్పడుతుంది. దృక్పథం లోపలి ఆలోచనలు అనుభూతులకు దర్పణం పడుతుంది.

మీరు చేయబోయే లేక చేసే పనులకు ప్రేరణగా, డ్రైవింగ్ ఫోర్స్‌గా పని చేస్తుంది.

దృక్పథం మన జీవితాన్ని నడుపుతుంది. జీవితాంతం మనతో ఉంటూ మనవెంట నీడలా నడిచే నేస్తాలు మనలోని దృక్పథాలు.

దృక్పథాలు మన జీవితాన్ని ఉన్నతశిఖరాన నిలబెట్టవచ్చు. అధఃపాతాళానికీ నెట్టవచ్చు. ఫలితం ఏ రీతిగా ఉంటుందనేది మనం ఏర్పరచుకునే దృక్పథం మీద ఆధారపడి ఉంటుంది.

అమెరికాలోని టెలిమెట్రిక్స్ ఇంటర్నేషనల్ అనే సంస్థ ప్రపంచవ్యాప్తంగా 16,000 మంది మీద జరిపిన సర్వేలో సక్సెస్ సాధించిన వాళ్లందరిలోనూ కొన్ని కామన్ లక్షణాలున్నట్లు గుర్తించింది. అవి.

- ఇతరుల అభిప్రాయాలు, సమర్థత గుర్తించటం, గౌరవించటం.
- ఇతరుల సలహాలు స్వీకరించటానికి వెనుకాడకపోవటం.
- ఇతరులు చెప్పేవాటిని వివరంగా, సాకల్యంగా వినటం, ఆలకించటం.
- ప్రతిదానికీ సానుకూలంగా స్పందించటం. ఇది దృక్పథానికి సంబంధించింది.

### మీ చేతిలోని పనే!

దృక్పథాన్ని సరైనమార్గంలో ఉంచటం, అదుపులో ఉంచటం మీకు సంబంధించిన మీ చేతిలోని పని!

వాతావరణ మార్పులు, సమాజ ఆర్థిక స్థితిగతులు, జాబ్ మార్కెట్, ఆ తాలూకు ఒడిదుడుకులు, ప్రకృతి వైపరీత్యాలులాంటివి మన చేతిలో లేని పని. వాటిమీద వ్యక్తిగతంగా మనకి ఏ అదుపూ ఉండదు. వాటికి అనుగుణంగా మనల్ని మనం సర్దుబాటు చేసుకోవటం మాత్రమే మనం చేయగలిగే పని. కాని దృక్పథం మాట అలా కాదు. మీరు, మీ ఉద్యోగం, మీ కుటుంబ సభ్యులు మీ స్నేహితులు లాంటి మీ వ్యక్తిగత జీవితానికి సంబంధించి ఎలా ప్రవర్తించాలో, ఎలాంటి చర్యలు చేబట్టాలనేది మాత్రమే మీ చేతిలో పని. మీ బాధ్యత. అందుకు సంబంధించిన మీ ప్రవర్తనను నిర్దేశించేది మీలోని మీ దృక్పథం.

(మీ అనుభూతులు + మీ ఆలోచనలు) x మీ దృక్పథం= మీ ప్రవర్తన లేక మీరు తీసుకునే చర్యలు (Actions).

దృక్పథాన్ని ఏర్పరచటంలో ఆలోచనలు, అనుభూతులు మాత్రమే కాకుండా మీ గతానుభవాలు, మీ చుట్టూ ఉండేవాళ్ళ ప్రవర్తన కూడా ప్రభావాన్ని చూపుతాయనేది సహజం. కాని మీ అనుమతి లేకుండా మీ ఆలోచనలు, అనుభూతుల్ని బయటివాళ్ళెవరూ నడపలేరు.

దృక్పథానికి సంబంధించిన మీ రిమోట్ కంట్రోల్ మీ చేతిలోనే ఉంటుంది. మరెవరి చేతిలోనూ ఉండదు. అయితే ఆ రిమోట్ కంట్రోల్‌ని సక్రమంగా పనిచేయించటానికి ప్రయత్నించాల్సింది మాత్రం మనమే. అందుకు కొంత సాధన అవసరం.

జీవితాన్ని కంట్రోల్‌లో ఉంచుకోవాలంటే దృక్పథాన్ని కంట్రోల్‌లో ఉంచుకోవాలి. ఆ తాలూకు రిమోట్ కంట్రోల్‌ని చాకచక్యంగా, నైపుణ్యంగా వినియోగించుకోవాలి.

ఇల్లు, ఉద్యోగం, లేక ఉద్యోగం కోసం వెతుకులాట, వృత్తి, వ్యాపారంలాంటి జీవితానికి సంబంధించిన అన్ని రంగాల్లో సానుకూల ఫలితాలు






పొందాలంటే సానుకూల దృక్పథం మీ మనస్సును ఏలుతుండాలి.

మీ ఆలోచనలు, అనుభూతులు మీరు తీసుకునే చర్యల (మీ ప్రవర్తన)కు ఇంధనంగా ఉపకరించే శక్తి - ఎనర్జీ - మీలోని దృక్పథం.

దృక్పథంలో ఈ కింది అంశాలు కలగలసి ఉంటాయి:

### ఎక్స్‌పెక్టేషన్స్ (ఆశించే తీరు)

ఒక విషయంలో మనం గాని, అవతలి వాళ్ళు గాని ఎలా ప్రవర్తిస్తారు? ఎలా ప్రవర్తించాలి? అనే ఫలితం మీద మనం ఊహించే తీరు, ఆశించే తీరే మన ఎక్స్‌పెక్టేషన్!

ఎక్స్‌పెక్టేషన్స్ అంటే మనం కోరుకునే ఫలితాలు ఫలానా విషయంలో ఇలా జరగవచ్చు. లేక అలా జరగాలి మనం ఆశించే ఫలితాలు.

ఉదాహరణకు తమ పిల్లలు డాక్టరో కలెక్టరో కావాలని తల్లిదండ్రులు ఆశించవచ్చు. అవి పిల్లల మీద వాళ్ళు పెట్టుకున్న ఎక్స్‌పెక్టేషన్స్!

ఎక్స్‌పెక్టేషన్స్‌కి అనుగుణంగా మనం సాధించే ఫలితాలు మనం పొందే సంతృప్తి, సంతోషాల స్థాయిని నిర్దేశిస్తాయి.

అంచనాలు ఎంత పైస్థాయిలో ఉంటే అంత ఎక్కువగా మనం సవాళ్ళను (ఛాలెంజెస్‌ని) ఎదుర్కోవాల్సి వస్తుంది. అంత ఎక్కువగా కష్టపడాల్సి వస్తుంది.

### పర్సెప్షన్ (గ్రహించే తీరు)

జ్ఞానేంద్రియాల ద్వారా లోపలికి ప్రవేశించే సమాచారాన్ని మనం గ్రహించే తీరు, అర్థం చేసుకునే తీరే మన పర్సెప్షన్.

ఒక సంఘటనను అక్కడ ఉండే నలుగురు వ్యక్తులు నాలుగు రకాలుగా అర్థం చేసుకోవచ్చు. అది వారివారి గ్రహింపు శక్తిని బట్టి, వాళ్ళవాళ్ళ దృక్పథాన్ని బట్టి ఉంటుంది.

పర్సెప్షన్ అనేది సైకాలజీలో చాలా సుదీర్ఘమైన సబ్జెక్ట్. అంత లోతుకు పోకుండా దృక్పథానికి సంబంధించి మాత్రమే తీసుకున్నప్పుడు ఒక విషయాన్ని మనం అర్థం చేసుకుంటున్న తీరే పర్సెప్షన్! వాస్తవం వేరుగా ఉండవచ్చు. మనం అర్థం చేసుకుంటున్నది. అందుకు భిన్నం కావచ్చు అది మన దృక్పథాన్నిబట్టి, సందర్భాన్ని బట్టి మన మూడ్‌ని బట్టి కూడా ఉంటుంది.

ఒక విషయాన్ని మనం గ్రహించే తీరు (పర్సెప్షన్)ని బట్టి ఆ సిట్యుయేషన్‌కి సంబంధించిన మన ఆలోచనలు, అనుభూతులు ఉంటాయి. వాటికి అనుగుణంగా మన దృక్పథం ఉంటుంది.

దృక్పథాన్ని బట్టి పర్సెప్షన్, పర్సెప్షన్‌ని బట్టి దృక్పథాలు సందర్భానికనుగుణంగా తమ తమ ఇష్టాయిష్టాల కనుగుణంగా మారిపోతూ ఉంటాయి.

### ఆలోచనలు

మన ఆలోచనలు మన 'మనోస్థితి' - స్టేట్ ఆఫ్ మైండ్‌ని ప్రతిబింబిస్తాయి. సంతోషంగా ఉండే మనుషులలో సంతోషకరమైన ఆలోచనలు కదులుతుంటాయి. అదేరకంగా విచారంగా, క్రోధంగా ఉండే మనుషులలో నెగెటివ్ ఆలోచనలు కదులుతుంటాయి.

మనకు ఒక దృక్పథం ఏర్పడటానికి ఆలోచనలే దోహదం చేస్తాయి. దృక్పథానికి ప్రేరణ అందించేవి ఆలోచనలే.

### అనుభూతులు

అనుభూతులు మన ఆలోచనలను సజీవంగా ఉంచుతాయి. మరిన్ని ఆలోచనలను ప్రోత్సహిస్తాయి. ఆలోచనలు, అనుభూతులు లేకుండా దృక్పథమంటూ ఏర్పడదు.

### చేతలు

ఒక సందర్భానికి - సిట్యుయేషన్‌కి మనం శారీరకంగా స్పందించటం మన ప్రవర్తన - శారీరకంగా మనం తీసుకునే చర్య (యాక్షన్) అవుతుంది. 'ప్రతిస్పందన' ఇది.

ఒక సందర్భానికి శారీరకంగా మీరు స్పందించే విధానం మీ ప్రవర్తన. మీ ప్రవర్తన మీలోని దృక్పథానికి అద్దం పడుతుంది.

### దృక్పథం ఎక్కడి నుంచి వస్తుంది?

మనం పుట్టినప్పటినుంచి ఏడు సంవత్సరాల లోపు దృక్పథం రూపు దిద్దుకుంటుందని అంటారు మనస్తత్వ వేత్తలు.

ప్రారంభంలో పిల్లలు మంచి దృక్పథంతోనే జీవితాన్ని మొదలెడతారు. కాకపోతే తర్వాత్వాత ఏర్పడే అనుభవాలు, చుట్టూ ఉండే మనుషుల ప్రభావంతో క్రమేపీ వాళ్ళలోని దృక్పథం కలుషితం కావటం మొదలెడుతుంది.

> **జీవితాన్ని మన అదుపులో ఉంచుకోవాలంటే దృక్పథాన్ని కంట్రోల్‌లో ఉంచుకోవాలి. ఆ తాలూకు రిమోట్‌ని చాకచక్యంగా, నైపుణ్యంగా వినియోగించుకోవాలి. మనం పుట్టాక ఏడేళ్ళలోపు మనకో దృక్పథం ఏర్పడుతుంది. కానీ మన పరిసరాలు దాన్ని కలుషితం చేస్తాయి. సందర్భాన్ని బట్టి దృక్పథాలు మారుతూంటాయి. మరి వాటిని కాపాడుకోవాలంటే మనమేం చెయ్యాలి?**

చిన్నపిల్లలను గమనించండి. ఎప్పుడూ సంతోషంతో కిలకిలలాడుతుంటారు. తెలుసుకోవాలి, నేర్చుకోవాలనే తపనతో ఉక్కిరిబిక్కిరవుతూ సదా రవరవలాడుతుంటారు. కనిపించిన ప్రతి మొహం వేపు నవ్వుతూ ఆనందంగా చూస్తుంటారు. నన్ను అంగీకరించు, అక్కున చేర్చుకో అన్నట్లుంటాయి. వాళ్ల వాలకాలు, కులం, మతం, ప్రాంతం, రంగు జాతిలాంటి భేదభావాలేమీ ఉండవు వాళ్ళకు. అందరిపట్లా అన్నిటి పట్లా క్యూరియాసిటీ ప్రదర్శిస్తారు.

మనుగడ కోసం చుట్టూ మనుషులందరి అవసరమూ ఉంటుందనే జాగరూక భావన వాళ్ళలో ప్రతిఫలిస్తోందా అనిపిస్తుంది.

### తర్వాతేమవుతుంది?

చుట్టూ ఉండే పరిస్థితులు, పరిసరాలు వాళ్ళ మనస్సుల మీద ముద్రలు వేయటం ప్రారంభిస్తాయి. తల్లిదండ్రులు, కుటుంబ సభ్యులు, జతగాళ్ళు, టీచర్లు మొదలైన వారు తమ మాటలు, చేతలద్వారా తమకు తెలియకుండానే పిల్లల మనసుల్ని కలుషితం చేస్తారు. పైగా రోజూ ఇంట్లో కనిపించే టీవీ ప్రోగ్రాములు. ఈ మొత్తంగా కలిసి పిల్లల మనసుల్ని కలుషితం చేస్తాయి.

క్రమేపీ వాళ్ళలోని దృక్పథాలు కూడా మలినం కావటం మొదలెడతాయి. బాల్యంలో ఏర్పడే దృక్పథాలలోని చెడును మార్చటం అంత తేలిక కాదు. అంత మాత్రాన మార్చుకోలేమని కాదు.

అతివేగంగా మార్పు చెందుతున్న ఆధునిక సమాజంలో బ్రతుకుతున్నాం మనం. ఆయా మార్పులకు అనుగుణంగా సర్దుబాటు కాకపోతే మనుగడ సాగించలేం.

నిన్నటి పద్ధతి ఇవాళ్టికి పనికి రాదు. ఇవాళ్టి పద్ధతి రేపటికి పనికిరాదు. ఆ సంగతి తెలుసుకుని కాలానుగుణంగా మనమూ మారుతున్నాం.

దృక్పథాల విషయంలో కూడా ఇది అన్వయిస్తుంది. నిన్నటి దృక్పథం ఇవాళ పనికిరాదు. ఇవాళ్టి దృక్పథం రేపటికి పనికిరాదు. అవసరానుగుణంగా ఎప్పటికప్పుడు దృక్పథాల్ని మార్చుకుంటూ బ్రతకాలి.

దృక్పథాలనేవి శాశ్వతం కావు. సందర్భానికి అనుగుణంగా మారుతుంటాయి. మూడ్స్‌కి అనుగుణంగా మారుతుంటాయి. ఫలానా సందర్భాన్ని బట్టి ఫలానా దృక్పథాన్ని ప్రదర్శిస్తుంటాం. ఉదాహరణకు: మీరు ఎంత సానుకూల దృక్పథం (పాజిటివ్ యాటిట్యూడ్) గల వ్యక్తి అయినా మీకు నచ్చని లేక మీరు నమ్మని వ్యక్తి విషయానికి వచ్చేసరికి మీరు ఒక సిట్యుయేషన్‌ని అతనికి నెగెటివ్‌గా అన్వయించి నెగెటివ్ దృక్పథం ప్రదర్శించవచ్చు.

అలాగే జనరల్‌గా మీరు నెగెటివ్ దృక్పథం కలిగిఉన్న వాళ్ళయినా ఒకానొక సందర్భంలో మీకు ఇష్టమైన వ్యక్తి విషయంలో పాజిటివ్ దృక్పథం ప్రదర్శించవచ్చు.

మొత్తంగా చూసినప్పుడు మనుషులలో మూడు రకాల దృక్పథాలు కనిపిస్తాయి.

*(ఇంకావుంది)*

# తిరిగిరాద తనే వసంతం...

-సి.జయపాల్‌రెడ్డి

**"నిన్న రాత్రి నారాయణరావు మళ్ళీ ఫోన్ చేశాడురా... మన మండలంలోనే కొత్తపేటలో అమ్మాయి ఉందట. పెళ్ళి చూపులకు వెళతారా అని అడిగాడు. ఏం చెప్పమంటావురా" బ్యాంకుకు వెళ్ళేందుకు సిద్ధమవుతున్న కొడుకు చంద్రప్రకాశ్‌ను అడిగాడు తండ్రి ఈశ్వరరావు.**

**"ఆలోచిద్దాంలే నాన్నా" నిరాసక్తంగా అన్నాడు చంద్రం.**

"ఇప్పుడుకూడా అలాగే అంటే ఎలారా? సంవత్సరీకం తర్వాత చూద్దామన్నావు. ఇప్పుడు అది కూడా అయింది. మా కోడల్ని మేం కూడా మరచిపోలేక పోతున్నాం. కానీ పోయినవాళ్ళకోసం బాధపడుతూ కూర్చోలేం కదరా? బాబు కోసమైనా నువ్వు మళ్ళీ పెళ్లి చేసుకోవాలిరా" బాధగా అంది చంద్రం తల్లి సుభద్ర.

"సర్లేమ్మా... నాన్నా ఆ వివరాలేంటో కనుక్కో. సాయంత్రం మాట్లాడదాం" అని బ్యాంకుకు బయలుదేరాడు చంద్రం.

"ఆ పెళ్ళేదో తొందరగా అయిపోతే మేము వెంటనే ఊరికి వెళ్ళిపోతాం రా.. వ్యవసాయం అంతా అస్తవ్యస్తంగా తయారైంది." గేటు వరకు వచ్చి మరీ అన్నాడు ఈశ్వర్రావు.

అలాగేలే అంటూ కారు స్టార్ట్‌చేసి వెళ్ళిపోయాడు చంద్రం.

ఓ జాతీయబ్యాంకులో అధికారిగా పని చేస్తున్న చంద్రప్రకాశ్ భార్య సుజాత రోడ్డు ప్రమాదంలో మరణించి ఏడాదిదాటింది. వాళ్ళకు ఓ బాబు, ఇప్పుడు పదేళ్ళు. భార్యపోయిన నెలరోజులనుండే తల్లిదండ్రులు, బంధువులు మళ్ళీ పెళ్ళి చేసుకోమని ఒత్తిడి చేస్తున్నారు. ఏడాది గడవకముందే పెళ్ళి చేసుకుంటే ఏం బాగుంటుందని చెబుతూ ఏడాది గడిపాడు.

ఇప్పుడు ఏం చెప్పాలో చంద్రానికి తోచటం లేదు. భార్య చనిపోయిననాటినుండి తల్లిదండ్రులు చంద్రం తోటే ఉంటున్నారు. పెళ్ళి చేసుకోవాలని ఓ వైపున్నా, చేసుకుంటే బాబు పరిస్థితి ఎలా ఉంటుందోనని ఆలోచనతో సతమతమవుతున్నాడు. అయితే తల్లిదండ్రులు మాత్రం తనతో ఎంతకాలం ఉంటారు? వాళ్ళు వెళ్ళిపోతే బాబు పరిస్థితి ఏమిటి? ఇప్పుడు ఏదో ఒక నిర్ణయం తీసుకోవాల్సిన సమయంవచ్చిందని అనుకున్నాడు చంద్రం. బ్యాంక్‌లో పనిచేస్తూనే ఈ విషయం గురించి ఆలోచిస్తున్నాడు. సాయంత్రం ఇంటికి వెళ్ళగానే తల్లిదండ్రులకు తన నిర్ణయం చెప్పాలనుకున్నాడు. సాయంత్రం బ్యాంక్ నుండి ఇంటికి వచ్చి రిలాక్సయ్యాడు. టీ తాగుతూ "నాన్నా, పొద్దున నేను ఆఫీసుకు వెళ్ళే ముందు ఏదో అన్నారుగా, ఆ

వివరాలేంటో కనుక్కోండి" అని చెప్పాడు చంద్రం.

"కనుక్కున్నానురా, మన మండలంలోనే కొత్తపేట ఊరు వాళ్ళది. అమ్మాయి తండ్రి రైతు. పంట దెబ్బతిని ఆత్మహత్య చేసుకొని ఏడాది దాటిందట. అమ్మాయి డిగ్రీ ఫైనల్ ఇయర్‌లో ఉండగానే తండ్రి చనిపోవటంతో చదువు ఆపేసిందట. ఆర్థిక ఇబ్బందులవల్ల అమ్మాయికి మంచి సంబంధం వచ్చే పరిస్థితి లేనందువల్ల రెండో సంబంధానికి ఒప్పుకుందట. అమ్మాయికి ఇరవైఏళ్ళు. అప్పులకు పోగా ఉన్న రెండెకరాలే వాళ్ళ జీవనాధారం. ఇంకా కొన్ని అప్పులున్నాయట. ప్రభుత్వం ప్రకటించిన సాయం అందగానే ఆ అప్పులు కూడా తీర్చేస్తుందట. అమ్మాయి పెళ్ళి అయిపోతే ఉన్న పొలంతో ఏదోవిధంగా బతుకు వెళ్ళదీస్తానని, ఎలాగయినా అమ్మాయికి సంబంధం చూడమని అమ్మాయితల్లి నారాయణ రావును కాళ్ళావేళ్ళా పడిందట. నువ్వు సరే అంటే మనం వచ్చే ఆదివారం వెళ్ళి చూడవచ్చు" అని వివరంగా చెప్పాడు ఈశ్వర్రావు.

"మరీ ఇరవైఏళ్ళా... బాగా చిన్న వయసు అయిపోతుందేమో! నాకు ఇప్పుడు ముప్పై ఎనిమిది..." అంటూ అనుమానం వెలిబుచ్చాడు చంద్రం. "మరీ ముప్పైఏళ్ళు దాటినవాళ్ళు పెళ్ళి చేసుకోకుండా ఎందుకు ఉంటార్రా! చోద్యం కాకపోతే" కొంచెం కోపంగా అంది సుభద్ర.

"సరేలే... అయితే వచ్చే ఆదివారం చూస్తామని చెప్పండి" నిరాసక్తంగా అన్నాడు చంద్రం.

•••

ఆదివారం ఉదయమే చంద్రం, ఈశ్వర్రావు, నారాయణ రావు మరొకరితో కలిసి అమ్మాయిని చూడటానికి కొత్తపేటకు బయలుదేరారు. దారి పొడుగునా పంట పొలాలు చాలా ఆహ్లాదంగా కనిపిస్తున్నాయి. కానీ దీనివెనుక ఉన్న రైతుల జీవితాలు విషాదంగా ఉన్నాయి. ఎంతోమంది రైతులు అప్పులపాలై ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఈ పరిస్థితులు ఎప్పుడు మారతాయోనని అనుకున్నాడు చంద్రం. అమ్మాయివాళ్ళ ఇంటికి వెళ్ళేసరికి పదకొండున్నర అయింది. అమ్మాయితల్లి విమల అతిథులను ఇంట్లోకి ఆహ్వానించింది. పాతకాలం పెంకుటిల్లు, ఇంటిముందు పశువుల కొట్టం, ఆ పక్కనే గడ్డివాము. ఇతర వ్యవసాయ పనిముట్లు కనిపిస్తున్నాయి. ఒకప్పుడు బాగా బతికిన కుటుంబం అని ఇంటిని చూస్తే తెలుస్తోంది. పెళ్ళి చూపులు కావటంతో ఇరుగుపొరుగు మహిళలు కూడా వచ్చినట్లున్నారు. మంచినీళ్ళు, బిస్కట్లు పంపించింది విమల. ఈశ్వర్రావు విమలను అన్ని వివరాలు అడిగి సమాచారం రాబట్టాడు. తనకున్న సాధక బాధకాలు విమల చెప్పుకొచ్చింది. భర్త పోవటంతో ఒంటిమీద పూర్తిగా శ్రద్ధ పోయినట్లుంది విమలకు. తైల సంస్కారం లేని జుట్టు, పాతకాటన్ చీర కట్టుకోవటంతో వయసుకంటే పెద్దదానిలా కనిపిస్తోంది. కూతురుపెళ్లి ఎలాగోలాగ అయిపోతే తన జీవితం ఏదోవిధంగా జరిగిపోతుందనే భావం విమల మాటల్లో ద్యోతకమైంది. అదీఇదీ మాట్లాడిన తర్వాత అమ్మాయి ట్రేలో టీ తీసుకొచ్చి అందరికీ ఇచ్చింది. తర్వాత అక్కడే చాపపై కూర్చుంది. పేరేమిటని అడిగితే కావ్యశ్రీ అని చెప్పింది. సరైనపోషణ లేకపోవటంతో పదిహేను పదహారు ఏళ్ళ అమ్మాయిలాగా కనిపిస్తోందని అనుకున్నాడు చంద్రం.



విమలను ఎక్కడో చూసినట్లు అనిపించింది చంద్రానికి. అదే విషయం విమలను అడిగాడు.



అట్లాంటిక్, హిందూ, పసిఫిక్ మహాసముద్రాల గర్భంలో 35 వేల మైళ్ళ పొడవున ఆల్ప్స్ కంటే అతి ఎత్తైన పర్వతశ్రేణులు విస్తరించి ఉన్నాయి.

"అవునండీ, రైతు రుణమాఫీ విషయంలో మా ఆయన చనిపోయినతర్వాత మీ బ్యాంకుకు వచ్చానండీ. మళ్ళీ రావాల్సిన పనికూడా ఉందండీ. కానీ ఈలోగానే మీరు ఈ విధంగా రావటం.. అంతా కలగా ఉందండీ" అని అంది విమల. ఏ సంగతీ తర్వాత ఫోన్‌చేసి చెబుతామని చెప్పి బయలుదేరారు. విమల ఫోన్‌నెంబరు తీసుకున్నాడు ఈశ్వర్రావు.

•••

ఆ రాత్రి చంద్రం తన గదిలో పడుకుని ఉదయం తాము వెళ్ళి వచ్చిన విషయం గురించే ఆలోచిస్తున్నాడు. అప్పటి నుండి విమల, కావ్య ముఖాలు వాళ్ళ దైన్యస్థితి పదేపదే గుర్తుకొస్తున్నాయి. భర్త చనిపోతే ఆ కుటుంబంలో స్త్రీల పరిస్థితి ఇంత అధ్వానంగా ఉంటుందా? భర్త ఉంటే కూతురుపెళ్ళి ఎంత ఘనంగా చేసేవాడో, రెండో పెళ్ళివాడికి ఇచ్చే అవసరం ఉండేది కాదు. ప్రతిరోజు ఆత్మహత్యలు చేసుకుంటున్న రైతుల కుటుంబాల్లో ఇట్లాగే ఉంటుందేమో.

ఎంత ఆలోచించినా కావ్యను భార్యగా మనసు అంగీకరించటం లేదు. ఆమె ముఖం గుర్తుకొచ్చినప్పుడల్లా బాధ అనిపిస్తోంది. జాలి కలుగుతోంది. ముప్పైఏళ్ళు దాటినవాళ్ళు దొరకరని అమ్మ చెప్పింది కదా! మరి ఎలా? అంటే నేను కూడా మా అమ్మలాగా ఒకే దిశలో ఆలోచిస్తున్నానా... అనుకుంటూనే నిద్రలోకి జారుకున్నాడు చంద్రం.

•••

పెళ్ళిచూపులు చూసి వచ్చిన రెండోరోజే విమల రుణమాఫీ విషయమై బ్యాంకుకు వచ్చింది. పన్నెండున్నర కావస్తోంది. చంద్రం చాలా బిజీగా ఉన్నాడు. విమలను చూడగానే చిరునవ్వుతో నమస్కరించి ఎదురుగా ఉన్న సీట్లో కూర్చోమన్నాడు. మొన్నటికంటే ఇప్పుడు కాస్త మంచిగా తయారైంది. ముఖం తేటగా ఉంది. తల చక్కగా దువ్వుకుంది. ఎట్లాగైనా కూతురు పెళ్ళి అవుతుందనే నమ్మకం కలగటంతో కావచ్చు కొద్దిగా ముఖంలో సంతోషం కనిపిస్తోంది. అరగంటలో అందర్నీ పంపించిన తర్వాత విమల

చేతిలో ఉన్న కాగితాలను తీసుకుని పరిశీలించాడు. ఆధార్‌కార్డు ప్రకారం విమల తనకన్నా కొన్నినెలలు మాత్రమే పెద్దది. అరగంటసేపు రుణమాఫీ విషయం పరిశీలించి అన్నీ తాను చూసుకుంటానని చెప్పాడు.

"మిమ్మల్ని మా ఇంటికి తీసుకెళితే బాగుండును. కానీ సాయంత్రం ఆరుగంటలదాకా బ్యాంకులో పని ఉంటుంది. అందుకని పక్కనే మంచి హోటల్ ఉంది. అక్కడికెళ్ళి భోజనం చేద్దాం పదండి" అని ఆహ్వానించాడు. "అయ్యో నేను ఉదయం భోజనం చేసి వచ్చానండీ" అంది విమల కంగారుగా.

"ఫర్వాలేదులెండి" అని పక్కనేఉన్న కొలీగ్‌కు చెప్పి బయటకు దారితీశాడు చంద్రం.

విమల మొహమాటపడుతూ చంద్రాన్ని వెంబడించింది. ఫర్లాంగు దూరంలో ఉన్న హోటల్‌కు బయలుదేరాడు. నడుస్తున్నంతసేపు, భోజనం చేస్తున్నంతసేపు విమల గురించి చాలా సమాచారం సేకరించాడు. విమలకు ఇంటర్మీడియట్ అవగానే పెళ్ళి చేశారనీ, బాగా చదువుకోవాలనే కోరిక ఉండేదని, ఆటపాటల్లో చురుకుగా ఉండేదని తెలుసుకున్నాడు. కాలేజీరోజుల గురించి చెబుతున్నప్పుడు విమల మొహంలో వెలుగు గమనించాడు చంద్రం. ఇంతమంచి సంస్కారం ఉన్న మహిళకు ఎలాంటి పరిస్థితులు వచ్చాయో అని చంద్రం బాధపడ్డాడు.

•••

నిజానికి చంద్రం భార్య సుజాత పోయిన పదిరోజుల తర్వాత కర్మకాండల అనంతరం జీవితం సాధారణ స్థితిలోకి వచ్చింది. తల్లి తండ్రులు ఉండటంతో ఇల్లు బాగానే గడుస్తోంది. కానీ శరీరవాంఛలు రగిలినప్పుడు మాత్రం చాలా అవస్థలు పడాల్సి వస్తోంది. సుజాతను తను ఎంతో ప్రేమించాడు. అందువల్ల శరీరం కోరుకున్నప్పటికీ సమాజం కోసం, ఏడాదిపాటు ఆగాడు. ఈ ఏడాదిపాటు వాంఛ తట్టుకోవడం చాలా కష్టమైపోయింది. ఒక్కోసారి ఏదైతే అది కానీ పెళ్ళి చేసుకోవాలని ఆవేశపడి పోయేవాడు. మళ్ళీ సమాజం గుర్తుకొచ్చి ఆగిపోయేవాడు. ఆకలి, దప్పిక ఎట్లానో శారీరక వాంఛ కూడా అలాంటిదే. దాన్ని ఆపడం చాలాకష్టం. ఈ కారణం చేతనే కొంతమంది తప్పటడుగులు వేస్తున్నారు. చాలామంది సమాజానికి భయపడి అణిచి వేసుకుంటున్నారు.

కోరికలు అణుచుకోవడం ఎంతకష్టమో తాను ఏడాదిగా అనుభవిస్తున్నాడు. అయితే తనకు ఒక అవకాశం ఉంది. ఆశ ఉంది. ఆ ఆశ తీరుతుంది. మరి ఏ అవకాశం లేని, ఆశ ఉన్నా తీరని, భర్త చనిపోయిన లేదా విడాకులు తీసుకున్న మహిళల పరిస్థితి ఏమిటి? ఒక్కసారి ఒళ్ళు ఝల్లుమంది. ఎంత పాపం, ఈ కనిపించని క్రూరత్వం, సమాజహింస గురించి ఎవరూ మాట్లాడరు? కోరిక మగాడికైనా, ఆడదానికైనా ఒక్కటే కదా? మరి ఎందుకు మహిళలపట్ల వివక్ష? మగాడు ఏ వయసులో ఉన్నా రెండో పెళ్ళికి కూడా మళ్ళీ పెళ్ళి కాని అమ్మాయిలనే చూస్తాడు. కాని వితంతువులు, విడాకులు తీసుకున్నవారి గురించి ఆలోచించరు.

మా అమ్మ అందుకే అంది కాబోలు. ముప్పై ఏళ్ళు దాటినవాళ్ళు ఎక్కడ దొరుకుతారని. కానీ ఇంత చదువుకున్న నేను కూడా అలాగే ఆలోచించాను కదా! దారుణం, అన్యాయం అని గింజుకున్నాడు చంద్రం. గతరాత్రి ఆలోచనలకు కొనసాగింపుగా ఆలోచించిన చంద్రానికి ఒక పరిష్కారం దొరికింది. మనస్సులో ఒక వెలుగు వెలిగినట్లైంది.

•••

ఓ రెండు రోజుల తరువాత బ్యాంకుకు వెళ్ళగానే విమలకు ఫోన్ చేశాడు. రుణమాఫీ విషయం మాట్లాడేది ఉందని, ఒంటిగంటకు రమ్మని చెప్పాడు చంద్రం. అలాగే వచ్చింది విమల. ఈసారి మరికొంచెం మెరుగ్గా కనపడుతోంది. ఒకటిన్నర తరువాత బయటికి దారి తీశాడు. భోజనం చేశాను మీరెళ్ళిరండి ఇక్కడే ఉంటా అని విమల అంది. కాఫీ తాగుదాం రండి అని అంటూ ఒక ముఖ్యవిషయం మాట్లాడాలని చెప్పటంతో బయలుదేరింది విమల. ఇద్దరికీ కాఫీ ఆర్డరిచ్చాడు చంద్రం.

"ఒక ముఖ్యమైన విషయం మీకు చెబుతాను మీరు షాక్ తినకూడదు, కంగారు పడకూడదు" అని చంద్రం అనడంతో కాఫీ తాగుతున్న విమల బెదురుగా, భయంగా చంద్రంకేసి చూసింది.

"దీంట్లో భయపడాల్సింది ఏమీలేదు. నేను చెప్పేది ఆలోచించి నిర్ణయం తీసుకోండి. మీరు మళ్ళీ ఎందుకు పెళ్ళి చేసుకోకూడదు" అని ఆగాడు చంద్రం.

**భార్య మరణిస్తే భర్త వెంటనే రెండో పెళ్ళికి సిద్ధమవుతాడు. కానీ భర్త చనిపోయిన స్త్రీకి, అందునా పిల్లలు ఉన్న స్త్రీకి అలాంటి ఆలోచనే రాదు. భర్తపోయిన తర్వాత ఆ స్త్రీ తన కోరికలనూ అణచి వేసుకోవాల్సిందేనా? ఈ విషయం గురించే చంద్రం సీరియస్‌గా ఆలోచిస్తున్నాడు. ఇలా ఆలోచిస్తున్నందుకు అతడు తననో సంఘ సంస్కర్తగా భావించుకోలేదు. కానీ అతడు అదే విషయం ఆలోచిస్తున్నాడు. ఎందుకు?**




## ఆశావాది

ఊహించని విచిత్ర మలుపులో
ఒంటరిగా నిలబడ్డప్పుడు
గతం నీడలా వెంటబడి
కలవర పరుస్తున్నప్పుడు
మరచిపోవాలనుకున్న జ్ఞాపకాలు
మనస్సులో మరింత స్థిరపడి
చికాకు పెడుతున్నప్పుడు
నువ్వు పంచిన ప్రేమను మరచి
నువ్వు లేనట్లే మనుష్యులు ప్రవర్తిస్తున్నప్పుడు
నిద్రపట్టక నిమిషాలు లెక్కపెట్టుకుంటూ
రాత్రిళ్ళు గడుపుతున్నప్పుడు
ఆత్మీయుల కలహాల్లో ఏ వైపూ చేరలేక
నిస్సహాయంగా చూస్తున్నప్పుడు
అందరూ కావాలని కోరుకునే నా మనస్తత్వాన్ని
అర్థం చేసుకోలేక నిందిస్తున్నప్పుడు
గతాన్ని మరచి ఏదో సాధించాలని చేసిన
ప్రయత్నాలన్నీ విఫలమైనప్పుడు
ఒక చల్లని చిరునవ్వు, తియ్యనిమాట
వెన్నుతట్టే ప్రోత్సాహం కరువైనప్పుడు
నీ కోసం నేనున్నానంటూ చెయ్యి పట్టుకుని
నడిపించే ఆత్మీయత లోపించినప్పుడు
ఏం చెయ్యాలని ప్రశ్నించుకుంటే నాలో ఇంకా
చచ్చిపోని ఆశావాది ముందుకువచ్చి అంటుంది:
ప్రతి రాత్రికి సూర్యోదయం ఉంటుందనీ
సుఖ దుఃఖాలు ఒకే నాణేనికి రెండు వైపులనీ
మండుటెండల తర్వాత తొలకరి జల్లులు పడతాయనీ
వసంతం వచ్చి మోడువారిన చెట్లు చిగురిస్తాయనీ
నీకంటే అభాగ్యులైన వారెంతోమంది లోకంలో ఉన్నారనీ



నీకు నీవే ప్రేరణగా,
నిన్ను నీవే ప్రోత్సహించుకుంటూ
మున్ముందుకు సాగిపొమ్మని
మున్ముందుకు సాగిపొమ్మని

-శాంతిశ్రీ బెనర్జీ

దిగ్భ్రాంతిగా చూసింది విమల. ఏసీలో ఉన్నా ఆమెకు చిరు చెమటలు పట్టేశాయి.

"మగాళ్ళు రెండోపెళ్ళి చేసుకున్నప్పుడు ఆడవాళ్ళు మళ్ళీ ఎందుకు పెళ్ళి చేసుకోకూడదు. మీ వయస్సు నా వయస్సు ఇంచుమించుగా ఒకటే. నేను మళ్ళీ పెళ్ళికి సిద్ధపడినప్పుడు మీరెందుకు పెళ్ళి చేసుకోకూడదు. కోరికలు ఎవర్కైనా ఒకటే కదా. నిజానికి ఈ వయసులోనే స్త్రీలు సంసార సుఖం ఆనందించేది. కాదంటరా చెప్పండి. మీ భర్త స్థానంలో మరొకరిని ఊహించుకోవడం కష్టమే. కానీ జీవితం ఎవరికోసం ఆగదు. ఉన్న జీవితాన్ని ఎందుకు ఆనందంగా గడపకూడదు. అప్పులున్నాయని ఆత్మహత్యలు చేసుకుంటే భార్యాపిల్లలు ఎలా బతుకుతారని ఒక్కరుకూడా ఆలోచించటం లేదు. డబ్బులేనివాళ్ళు కూలీనాలీ చేసుకుని ఎంతమంది హాయిగా బతకటంలేదు. ఆస్తులుపోగానే జీవితం అయిపోతుందా?" అంటూ విమల ముఖంలోకి చూశాడు.

"ఈ సమాజంలో ఆడదానికి మళ్ళీ పెళ్ళంటేనే సాధ్యం కాదు. అందునా పిల్లలుంటే ఇంకా అసాధ్యం. అనుకున్నంత సులభం కాదు. పెళ్ళి చేసుకోవాలని ఉన్నా ఎవరు చేస్తారు? ఎవరు చేసుకుంటారు?" గంభీరంగా అంది విమల. ఆమె ముఖంలో దుఃఖ ఛాయలు కనిపిస్తున్నాయి.

విమల నుండి ఈ సమాధానమే ఆశించాడు. అందుకని తన పథకం ఫలించవచ్చని సంబరపడ్డాడు చంద్రం.

"విమలగారూ ఇక సూటిగా విషయానికొస్తాను, నేను మీ ఇంటికి వచ్చివెళ్ళిన దగ్గరనుండీ ఇదే విషయం ఆలోచిస్తున్నాను. చాలామంది వయసుండి కూడా మళ్ళీ పెళ్ళి లేకుండా మగ్గిపోతున్నారు. మగాళ్ళు మాత్రం రెండోపెళ్ళికి కూడా పెళ్ళికాని అమ్మాయిలనే చేసుకుంటున్నారు. మొత్తం సమాజం దృష్టి కూడా అలాగే ఉంది. నేను ఈ సమాజాన్ని ఉద్ధరించలేనుగానీ నా మట్టుకు నేను ముందడుగు వేయాలనుకుంటున్నాను. మీరు ఒప్పుకుంటే మిమ్మల్ని పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాను".

ఊహించని పరిణామానికి పిడుగుపడినట్లుగా ఉలిక్కిపడింది విమల. అదే పనిగా చంద్రాన్ని చూస్తూ ఉండిపోయింది.

"మీకు ఇది షాకింగ్‌గానే ఉండవచ్చు. కానీ ఆవేశంతో కాకుండా, బాగా ఆలోచించే ఈ నిర్ణయం తీసుకున్నాను. కావ్య నాకు కూతురు లాగే కనిపిస్తోంది కానీ మరోలా ఊహించుకోలేకపోతున్నాను. మనంపెళ్ళి చేసుకుంటే కావ్యను బాగా చదివిద్దాం. అప్పుడు మనకు ఓ కూతురు, ఓ కొడుకు ఉంటారు. మళ్ళీ పిల్లల గురించి ఆలోచన లేదు. ఇద్దరు పిల్లలు చాలు మనకు. ఇల్లుంది, కారుంది, ఇంకా బోలెడు సర్వీసుంది. కావ్యకు మంచి సంబంధం చూసి పెళ్ళి చేద్దాం. ఈ సమాజం గురించిగానీ, నా తల్లిదండ్రుల గురించిగానీ ఆలోచించేదేమీ లేదు. కావ్యతో చర్చించి ఒక నిర్ణయం తీసుకోండి" అంటూ స్థిరంగా చెప్పాడు చంద్రం.

విమల కళ్ళు నీటి కుండలయ్యాయి. ఏం మాట్లాడలేదు. తర్వాత చంద్రం బ్యాంకుకు, విమల ఊరికి బయలు దేరారు. వెళ్ళేటప్పుడు రేపు సాయంత్రం ఫోను చేస్తానని చంద్రం చెప్పాడు.

●●●

సాయంత్రం అయిదైంది. కాలింగ్‌బెల్ మోగడంతో హాలులో ఉన్న ఈశ్వర్రావు తలుపు తీయటానికి లేచాడు. మనవడు అప్పుడే వచ్చాడు, కొడుకు ఇప్పుడేరాడు, ఎవరబ్బా అనుకుంటూ తలుపు తీశాడు. ఎదురుగా కూతురు, అల్లుడు ఆ వెనుకనే తన తమ్ముడు, మరదలు ఉన్నారు.

ఆశ్చర్యంగా వారిని చూసి కుశల ప్రశ్నలు వేశాడు ఈశ్వర్రావు. "ఏమేవ్ ఎవరొచ్చారో చూడు" అంటూ వంటింట్లో మనవడికి పాలు కలుపుతున్న భార్యను కేకేశాడు ఈశ్వర్రావు.

"వస్తున్నట్లు ఫోన్ కూడా చేయలేదు" అంటూ ఆశ్చర్యంగా పలకరించింది సుభద్ర.

"అదేమిటి వదినమ్మా, చంద్రం నిన్న సాయంత్రం ఫోన్ చేసి అర్జంటుగా రమ్మని అంటేనే కదా మేం వచ్చాం; మీకు తెలియదా?" అంటూ ఈశ్వర్రావు తమ్ముడు వీరభద్రం అన్నాడు. కూతురు మీనాక్షికూడా అలాగే అంది. ఈశ్వర్రావు, సుభద్ర ముఖాలు చూసుకున్నాడు.

ఈ క్రమంలోనే కారు హారన్ వినిపించడంతో అందరూ అటు చూశారు. ఆ వెంటనే చంద్రం, విమల వారి వెనుక కావ్య ఇంట్లోకి వచ్చారు. ఇంట్లోని వారందరూ అయోమయంగా చూస్తున్నారు. చంద్రం, విమల మెడలో దండలు ఉన్నాయి. విమల పట్టుబట్టల్లో మెరిసిపోతోంది. ఈశ్వర్రావు తేరుకుని విమలను, కావ్యను గుర్తుపట్టి విస్మయానికి లోనై మాట్లాడటం మరచిపోయి చూస్తున్నాడు.

"అమ్మా... నాన్నా... గంటక్రితం మేం గుళ్ళో పెళ్ళిచేసుకున్నాం. అమ్మా ఈమె పేరు విమల. నాన్నకు ఇంతకుముందే తెలుసు, మమ్మల్ని ఆశీర్వదించండి" అంటూ పాద నమస్కారం చేశారు. తర్వాత విమలను అక్కా బావలకు, బాబాయ్‌కీ, పిన్నికీ పరిచయం చేశాడు. ఇంకా అయోమయంగా చూస్తున్న అందరికీ కావ్యను పరిచయం చేశాడు. అప్పుడుగానీ సుభద్రకు పూర్తిగా విషయం అర్థం కాలేదు. విషయం అర్థమై సుభద్ర బుర్ర దిమ్మ తిరిగిపోయింది. దూరంగా నిలబడి అంతా గమనిస్తున్న కొడుకు బాబీగాడిని పిలిచాడు చంద్రం.

"ఇక నుండి ఈమె నీకు అమ్మ... ఈమె నీకు అక్క" అంటూ విమలను, కావ్యను పరిచయం చేశాడు చంద్రం. బాబీని దగ్గరకు తీసుకుంది విమల.

"అక్కా, బావా, బాబాయ్ పిన్నీ, ఈరోజు పెళ్ళి చేసుకుంటున్నాను కాబట్టే మిమ్మల్ని రమ్మన్నాను. ఈ రాత్రికి గ్రాండ్ పార్టీ ఏర్పాటు చేశాను. వచ్చినందుకు థాంక్స్" అంటూ విమలతో వంటగదిలోకి దారితీశాడు చంద్రం. అందరూ శిలా ప్రతిమల్లాగా అలాగే నిలబడిపోయారు.

సెల్: ***98492 08080***

## అలాంటి వ్యక్తిని చూడలేదట!

రాధికా ఆప్టే అంటేనే సంచలనాలకు కేరాఫ్ అడ్రస్. ఎప్పుడూ ఏదో ఒక స్టేట్‌మెంట్ ఇచ్చి వార్తల్లో నిలవడం ఆమెకు అలవాటు. నిజానికి సినిమాల్లో కంటే సంచలన వార్తల్లోనే రాధిక ఎక్కువ కనిపిస్తూ ఉంటుంది. అలాంటి రాధిక 'కబాలి'లో రజనీకాంత్‌తో నటిస్తున్న సంగతి తెలిసిందే! త్వరలో విడుదలకు సిద్ధమవుతున్న ఈ సినిమా గురించి రాధిక మాట్లాడుతూ, సూపర్‌స్టార్ మీద ప్రశంసల వర్షం కురిపించింది. అలాంటి వ్యక్తిని తన జీవితంలో ఇదే మొదటిసారి చూశానంటూ ఆనందం వ్యక్తం చేస్తోంది. ఇప్పటివరకూ తను చేసిన సినిమాలన్నీ ఒక ఎత్తు 'కబాలి' ఒక ఎత్తు, అంటోంది. ఈ సినిమా విడుదలకోసం ప్రేక్షకులతోపాటు తాను కూడా ఎంతో ఆత్రుతగా ఎదురు చూస్తోందట.






# పాస్తా మంచిదే!



ఇటాలియన్ వంటకం 'పాస్తా' అంటే చాలామంది ఇష్టపడతారు. దీన్ని తీసుకుంటే ఊబకాయం బారిన పడతారన్న అనుమానాలు చాలా మందిలో ఉన్నాయి. ఈ అనుమానం ముఖ్యంగా మహిళల్లో ఎక్కువగా ఉంది. అయితే ఇది కేవలం అనుమానం తప్ప నిజం కాదన్న విషయం ఇటలీలో ఇటీవల నిర్వహించిన పరిశోధనలో వెల్లడైంది. పాస్తా తింటే ఊబకాయం రాదనీ, అసలు ఈ సమస్య దరిచేరదనీ పరిశోధకులు స్పష్టం చేస్తున్నారు. సుమారు 20,000 మంది మహిళలను రెండు గ్రూపులుగా విభజించి, ఒక గ్రూపు వారికి ప్రతి రోజూ పాస్తా అందించారు. రెండో గ్రూపు వారికి వారంలో రెండుమూడు రోజులు మాత్రమే పాస్తా ఇచ్చారు. కొన్ని నెలల అనంతరం వీరి బరువు పరిశీలించగా ప్రతిరోజూ పాస్తా తిన్న మహిళల బరువులో ఏ మాత్రం పెరుగుదలను వీరు గుర్తించలేదు. మునుపటి బరువుతోనే ఉండటమే కాకుండా నడుము కూడా కాస్త సన్నగా మారడం వీరు గుర్తించారు. పాస్తా మీద అపోహలు వీడి నిరభ్యంతరంగా దీనిని తీసుకోవచ్చని వీరు సూచిస్తున్నారు. ఊబకాయానికి వేరే కారణాలు ఉండవచ్చని వీరు అభిప్రాయపడుతున్నారు.

# మహిళల్లోనే నిద్రలేమి?

నిద్రలేమి పురుషుల్లో కన్నా స్త్రీలలో ఎక్కువవంటున్నారు అమెరికా పరిశోధకులు. పురుషులతో పోల్చుకుంటే స్త్రీలు 1.4 శాతం తక్కువ నిద్రపోతారని వీరి పరిశోధనల్లో వెల్లడైంది. 20-30, 40-50 సంవత్సరాల మధ్య వయస్సుగల స్త్రీలలో నిద్రలేమి ఎక్కువగా ఉందంటున్నారు. నిద్రలేమికి అనేక రకాల కారణాలు ఉన్నా స్త్రీలలో మాత్రం ఒత్తిడి, ఆందోళనే ప్రధాన పాత్ర పోషిస్తాయి. వీటికి తోడు హార్మోన్లలో తేడాలు, మెనోపాజ్ వంటివి కూడా కారణమని పరిశోధకులు చెబుతున్నారు. పై కారణాల వల్ల మహిళల్లో ఊబకాయం, గుండె సంబంధ సమస్యలు, ఇతర ఆరోగ్య సమస్యలు తలెత్తి చిన్న వయసులోనే వారు మరణించడానికి కారణం అవుతున్నాయని, ఆరోగ్యకరమైన ఆహార అలవాట్లు, మంచి జీవనశైలితో సమస్యలను అధిగమించవచ్చని పరిశోధకులు సూచిస్తున్నారు. భారతీయులలో ఈ సమస్య మరింత ఎక్కువగా ఉందన్న విషయం మరొక పరిశోధనలో వెల్లడైంది. 50 సంవత్సరాలు పైబడిన వారిలో ఐదు శాతం మంది స్త్రీలు నిద్రలేమితో బాధపడుతున్నారని పరిశోధకులు స్పష్టం చేస్తున్నారు.



# వాకింగ్ మీటింగులే మంచివి

ఆఫీసుల్లో గంటల తరబడి కూర్చోవడం తప్పనిసరి. మధ్య మధ్యలో కొద్దిసేపు నడవడం తప్ప ఎక్కువసేపు కూర్చునే పని చేయాలి. ఈ విధంగా పనిచేయడమే పలు ఆరోగ్య సమస్యలకు కారణమవుతోందని నిపుణులు పదే పదే హెచ్చరిస్తున్నారు కూడా! గంటల తరబడి కూర్చునే విధానానికి వారంలో ఒకటి రెండు సార్లు చెక్ పెట్టొచ్చంటున్నారు అమెరికాలోని మియామి యూనివర్సిటీ పరిశోధకులు. వారంలో ఒకటి రెండు సార్లు నిర్వహించే మీటింగులను ఆఫీసు ఆవరణలోనే నడుస్తూ నిర్వహిస్తే వ్యాయామంతో పాటు స్వచ్ఛమైన గాలిని కొన్ని నిమిషాలన్నా సొంతం చేసుకోవచ్చు అని వీరు సూచిస్తున్నారు. ఇలా నడుస్తూ మీటింగులు నిర్వహించడం వలన ఉద్యోగుల ఆరోగ్యంలో కూడా మార్పులు వస్తాయన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. ఈ విధంగా చేయడం వల్ల కనీసం మూడు సంవత్సరాల జీవిత కాలం పెరుగుతుందని పరిశోధకులు స్పష్టం చేస్తున్నారు.



# యవ్వనాన్ని పెంచే పిల్

జీవితాంతం యవ్వనంతో ఉండాలని ప్రతి ఒక్కరూ కోరుకుంటారు. అయితే అది సాధ్యం కాదన్న విషయం కూడా తెలిసిన విషయమే! కాలంతో పాటు, వయస్సు, వయస్సుతో పాటు వచ్చే మార్పులు సర్వ సాధారణం. కానీ ఇప్పుడు యవ్వనాన్ని పెంచే పిల్స్‌ను అమెరికా శాస్త్రవేత్తలు రూపొందించారు. విటమిన్ బి, సి, డి, ఫోలిక్ యాసిడ్, గ్రీన్ టీ వంటి 30 రకాల మూలకాల నుంచి ఈ పిల్ తయారు చేశారు. ఈ పిల్‌ను ఎలుకల మీద ప్రయోగించారు. 22 నెలల వయస్సున్న ఎలుకల మీద ప్రయోగించి పరిశీలించినప్పుడు ఎలుకల్లో 50 శాతం వయస్సు వెనక్కి వెళ్ళినట్లు గుర్తించారు. అయితే ఈ పిల్‌ను ఇంకా అభివృద్ధి చేయాల్సి ఉందని, దీన్ని పూర్తిస్థాయిలో వినియోగంలోకి తేవడానికి మరికొంత కాలం పట్టవచ్చని అంటున్నారు శాస్త్రవేత్తలు.



-అవినాష్

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో

## సిస్టమిక్ లూపస్ ఎరితిమాటోసిస్ (SLE) సమస్యకు సరైన పరిష్కారం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



సిస్టమిక్ లూపస్ ఎరితిమాటోసిస్ (SLE) అనేది ఒక ఆటో ఇమ్యూన్ వ్యాధి. సాధారణంగా మన శరీరంలోకి ఏవైనా అన్యపదార్థాలు ప్రవేశించినప్పుడు శరీర రోగనిరోధక వ్యవస్థ వాటిని గుర్తించి, వాటికి వ్యతిరేకంగా యాంటీబాడీస్‌ను ఉత్పత్తి చేయటం ద్వారా వాటిని నశింపజేసి ఇన్‌ఫెక్షన్స్ బారిన పడకుండా కాపాడటం జరుగుతుంది. కానీ మన శరీరంలోని కొన్ని అసమతుల్యతల కారణంగా ఈ రోగనిరోధక వ్యవస్థ పొరబడి సొంత కణాలపై దాడి చేయడం వలన కలిగే వ్యాధులనే ఆటో ఇమ్యూన్ వ్యాధులు అని అంటారు. ఈ వ్యాధి ప్రభావం చర్మంపైన మరియు కీళ్ళు, మూత్రపిండాలు, మెదడు మొదలగు ఇతర అవయవాలపై ఉంటుంది. ఈ వ్యాధి ఏ వయస్సు వారినైనా ప్రభావితం చేస్తుంది. ముఖ్యంగా 10 నుండి 50 సం॥ మధ్య వయస్సు గల వారిలో ఎక్కువగా కనిపిస్తుంది. పురుషుల కంటే స్త్రీలలో 10 రెట్లు అధికంగా ఈ సమస్య కనిపిస్తుంది. ఇది ఒక దీర్ఘకాలిక ఆరోగ్య సమస్య.

**కారణాలు:** SLE వ్యాధికి గల ఖచ్చితమైన కారణాలు తెలియరాలేదు. కానీ కొన్ని జన్యు పరమైన అంశాలు, వాతావరణ సంబంధిత కారణాలు – ముఖ్యంగా అల్ట్రావైలెట్ కిరణాలు, కొన్ని మందులు, వైరస్‌లు, మానసిక ఒత్తిడి మరియు శారీరక బలహీనతలు లేదా అనుకోని గాయాల వలన ఈ వ్యాధి ప్రేరేపించబడేలా ఉంటుందనేది అనుభవపూర్వకంగా తెలుస్తోన్న విషయం. SLE పురుషుల కంటే స్త్రీలలో ఎక్కువగా కనిపిస్తుంది. స్త్రీలలో ఈ వ్యాధి లక్షణాలు గర్భధారణ సమయంలో మరియు నెలసరి సమయంలో ఎక్కువగా తలెత్తుతాయి. ఈ కారణంగా Oestrogen హార్మోన్ SLE వ్యాధి కలగడానికి కారణంగా భావించడం జరుగుతుంది.



Symptoms of systemic lupus erythematosus

**లక్షణాలు:** SLE వ్యాధి లక్షణాలు కొన్ని రోజులు ఎక్కువగాను, మరికొన్ని రోజులు తక్కువగాను ఉంటాయి. ఈ వ్యాధికి గురి అయిన అవయవాన్ని బట్టి లక్షణాలు కనిపిస్తాయి.

- మెదడు మరియు నాడీ వ్యవస్థ ఈ వ్యాధి బారిన పడితే మానసిక అశాంతి, పక్షవాతం, మూర్ఛవ్యాధి, తలనొప్పి, తిమ్మిర్లు, కంటిచూపు సమస్యలు ఏర్పడతాయి.
- **గుండె:** గుండెలో పెరికార్డైటిస్, మయోకార్డైటిస్, ఎండోకార్డైటిస్ సమస్యల వలన ఆయాసం, నీరసం మొ॥గు లక్షణాలు కనిపిస్తాయి.
- ఈ వ్యాధికి గురి అయిన వారి రక్తనాళాలలో కొవ్వు పేరుకుపోయి గుండెనొప్పి వచ్చే అవకాశం ఉంటుంది.
- **జీర్ణకోశ ప్రాంతము:** కడుపునొప్పి, వికారం మరియు వాంతులు కలుగుతాయి.
- **ఊపిరితిత్తులు:** ఈ వ్యాధి బారిన పడితే శ్వాస తీసుకోవడంలో ఇబ్బంది ఏర్పడుతుంది మరియు దగ్గు, ఊపిరితిత్తులలో నిమ్ము చేరటం వంటి లక్షణాలు ఏర్పడతాయి.
- ఈ వ్యాధి వలన మూత్రపిండాలు శోథమునకు గురి అయితే, మూత్రం ద్వారా ప్రొటీన్లు మరియు రక్తకణాలు కోల్పోయి శరీరమంతా వాపులు మరియు బరువు పెరగటం వంటి లక్షణాలను గమనించవచ్చు.
- చర్మంపై ఈ వ్యాధి ప్రభావం వలన ఎర్రని దద్దుర్లు ఏర్పడి, పొరలు-పొరలుగా మరియు దళసరిగా మారి, అక్కడి చర్మంపై నల్లటి మచ్చలు ఏర్పడతాయి. ముఖంలో బుగ్గలు మరియు ముక్కు పైన సీతాకోకచిలుక ఆకారంలో దద్దుర్లు ఏర్పడతాయి.
- గర్భిణీలలో ఈ వ్యాధి వలన పిండ మరణం, గర్భస్రావం అధికంగా జరిగే అవకాశం ఉంటుంది.
- తీవ్రమైన అలసట, కీళ్ళలో నొప్పి, ముఖ్యంగా చిన్న కీళ్ళలో నొప్పి, వాపు, వెంట్రుకలు రాలిపోవడం, రక్తహీనత, రక్తం గడ్డకట్టడంలో సమస్యలు, జ్వరం, లింఫ్ గ్రంథుల వాపును గమనించవచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** CBP, ESR, CUE, రుమటాయిడ్ ఫ్యాక్టర్, యాంటీ న్యూక్లియర్ యాంటీబాడీ (ANA), సీరం క్రియేటినైన్, లివర్ మరియు కిడ్నీ ఫంక్షన్ టెస్ట్‌ల ద్వారా ఈ వ్యాధిని నిర్ధారించుకోవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** సాధారణంగా SLE వ్యాధికి అనేక చికిత్సా పద్ధతులు ఉన్నప్పటికీ ఏ పద్ధతిలోనూ సంపూర్ణంగా నయం చేసే అవకాశం లేదు. కేవలం హోమియోపతి వైద్య విధానంలో అందబడే మందులతో మాత్రమే ఎటువంటి అసౌకర్యం, దుష్ఫలితాలు లేని చికిత్స చేయవచ్చు. 'హోమియోకేర్ ఇంటర్‌నేషనల్'లో మాత్రమే అందించబడే జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా అధునాతనమైన వైద్య నిపుణులచే SLE వ్యాధిని పూర్తిగా అదుపులో ఉంచటమే కాకుండా ఎటువంటి దుష్ఫలితాలు లేకుండా సంపూర్ణంగా నయం చేయవచ్చు.



# సినీ నారాయణీయం

## (ఎమ్మెస్ నారాయణ జీవితచిత్రం) 27

**ఒకరోజు గోదావరిగట్టున షూటింగ్. నైటు కెమేరా పెట్టగానే ప్రపంచంలో ఎక్కడా చూడని ఒక అద్భుతమైన దృశ్యం. శతకోటి మిణుగురు పురుగులు! ఆ పురుగుల ఛాయలో లైటు వెలవెలబోయింది. ఒక రచయితగా నేను అది చూసి ఇలాంటి దృశ్యం ఎక్కడన్నా దొరుకుతుందా అని అనుకున్నా. షూటింగ్ ఆగిపోతే బాగుండుననీ, ఎంజాయ్ చేయొచ్చుననీ అనుకున్నాను.**

అక్కిరాజుగారని ఒకాయన ఉన్నారు. ఆయన చలనచిత్ర పరిశ్రమకి కోస్టల్ నాయకుడు. ఆయన మాకు పార్టీ ఇస్తానన్నాడు. రవిరాజాగారు వచ్చారు. ఈ పురుగుల్ని చూశారా గురువుగారూ! ఈ ప్రకృతి ఎంత గొప్పగా ఉందో అన్నా. వీటివల్ల షూటింగ్ జరగదు. క్యాన్సిల్ అయిపోతుంది. చక్కగా రూంకెళ్ళి కథలు రాస్తున్న సమయంలో మర్దూరు రాజాగారి రూంలో ఉండేవాడిని. ఒకసారి ఇద్దరం చక్కగా పార్టీ చేసుకున్నాం. ఆ టైములో ఒక మనిషిమీద ఆయనకు ఆగ్రహం వచ్చింది. ఒక దుర్మార్గుడు ఉన్నాడు, ప్రొడ్యూసర్. రచయితగా నేనెంతో రాశాను. చాలా దుర్మార్గంగా ప్రవర్తిస్తున్నాడు, నాకెంతో కోపం వస్తోంది అని దుఃఖించాడు ఆయన. సార్ మీరు రైటర్, ఆయన ప్రొడ్యూసర్. నేనొక పాయింట్ చెప్తాను సార్ అన్నా. అప్పటికే ఆయన చాలా ఎస్టాబ్లిష్డ్ రైటర్. నేను జస్ట్ ఇన్ ట్రయల్స్. ఆయన ముందు నేను చాలా బచ్చా. ఆయనకో మాట చెప్పా. సార్ హిందూమతం పైన మీకు నమ్మకం ఉందా అన్నా. ఉందండి అన్నాడు. ఎంత మంది దేవుళ్ళు? త్రిమూర్తులు అన్నాడు. యస్. ఇక్కడి నుంచి నేను చెప్తానన్నా. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. వీళ్ళల్లో బ్రహ్మ సృష్టికర్త. విష్ణువు దానిని సంరక్షించేవాడు. మహేశ్వరుడు లయకారకుడు. అయితే దీన్ని సినిమా ఫీల్డ్‌కి అన్వయించుకుని మాట్లాడుకుందాం అన్నా. ఏంటన్నాడాయన. త్రిమూర్తుల్లో బ్రహ్మకి ఎక్కడన్నా ఆలయాలున్నాయా? అన్నాను. లేవు. మీరు సృష్టించకపోతే, మిగిలిన ఇద్దరూ ఉండరు కదా? మహేశ్వరుడు నటరాజ్, డాన్స్ వచ్చు. అంటే హీరో. సెకండ్ విష్ణుమూర్తి. ఆయనకు లక్ష్మీదేవి తోడు. అంటే ప్రొడ్యూసర్. థర్డ్ బ్రహ్మ అంటే కథా రచయిత అది మర్దూరి రాజా. మీరు సృష్టించకపోతే మొదటి ఇద్దరూ ఉండరు. కాబట్టి మీరు సృష్టించిన మీ కొడుకులు లాంటి వాళ్ళు ఇద్దరూ గొప్పవాళ్ళు అవుతున్నారు. కాబట్టి వాళ్ళని చూసి ఆనందించండి, దుఃఖించకండి అన్నా.

# ప్రాక్టికల్ జోకులే నా కథల్లో హాస్య సన్నివేశాలు

ఎంజాయ్ చెయ్యొచ్చు అని కదా మీ ఆనందం అన్నాడాయన. సార్ అన్నా. ఆ పనే చేయండి. ఎలాగూ షూటింగ్ జరగదిక్కడ అన్నాడు. అంటే ఎమ్మెస్ నారాయణ అనేవాడికి ఆ మార్గదర్శకుడు వచ్చి నీ మనసులో ఆలోచనలు ఇలా ఉన్నాయి కాబట్టి, అలాగే కానివ్వండి అని అనడం నాకిచ్చిన గౌరవమే. మామూలుగా అయితే, ప్రతీ ఆర్టిస్టుకీ ఏయ్ కూర్చోవయ్యా ఇక్కడా, అలా ఉండవయ్యా అనడంతప్ప, ఆ విధంగా ఎవరు చెప్పగలరు?

### రచయిత బ్రహ్మలాంటివాడు!

ఒక గొప్ప ఎపిసోడ్ చెప్తా. చెన్నైలో నేను



### ట్రాజెడీ భరించలేను

ట్రాజెడీ అంటే భరించలేకపోయేవాణ్ని. సాధారణ ప్రజలకంటే నాకు స్పందన కొంచెం ఎక్కువే. ఓసారి ఏలూరులో మా ఆవిడ, నేనూ "అంజలీ ఐ లవ్ యూ" సినిమాకు వెళ్ళాం. ఆ సినిమా చూస్తుంటే నాకు విపరీతమైన ఏడుపు వచ్చేసింది. వెక్కి వెక్కి ఏడ్చాను. 'ఏమిటండీ ఈయన సౌండ్ వచ్చేలా ఏడుస్తుంటే మేం సినిమా ఎలా చూడాలి' అని అందరూ మా ఆవిడకి కంప్లయింట్ చేశారు. ఆవిడ సిగ్గుపడి నన్ను బయటకు తీసుకువచ్చేసింది. మరోసారి భీమవరం సత్యనారాయణ టాకీస్‌లో 'అన్నమయ్య' చూశాను. అన్నమయ్య భార్యలిద్దరూ చనిపోయినప్పుడు "అంతర్యామీ" అనే పాటప్పుడు విపరీతంగా ఏడ్చేశాను. అప్పటికే కొంచెం కొంచెంగా సినిమాల్లో వస్తున్నా కాబట్టి అక్కడి సినిమా హాలు మేనేజర్లు నన్ను దగ్గరుండి బయటకు తీసుకు వచ్చేశారు. నా చిన్నప్పటి 'రక్తసంబంధం' సినిమా ఒకటి గుర్తు. ఆ సినిమా చూసి చంటిపిల్లాడిలా ఏడ్చాను. అందులో ఎన్‌టీఆర్, సావిత్రి అన్నాచెల్లెళ్ళు. ఎందుకో ఇలా చేయడం నాకు నచ్చలేదు. ట్రాజెడీని నేను తట్టుకోలేకపోయేవాడిని. బహుశా అందుకే నేను కమెడియన్ అయ్యానేమో అనిపిస్తుంది.

### ఒక యోగి కాశీ అనుభవం!

మనుషులు తమ సహజ గుణాలు వదులుకోవడం అంత తేలిక కాదేమో అనిపిస్తుంది. ఓసారి ఎవరో చెప్పిన సంఘటన గుర్తుకు వచ్చింది. ఒక





యోగి కాశీ వెళ్ళి వచ్చాడట. ఆ ఊళ్ళో వాళ్ళంతా ఆయన చుట్టూ జేరి కాశీ విశేషాలు అడిగి తెలుసుకుంటున్నారు. మన జీవితాన్ని అభివృద్ధి చేసుకోవడానికి గంగానదిలో ఏదైనా వదిలేయడం సంప్రదాయం. శిష్యులు కొంతమంది చేరి గురూగారూ! కాశీలో మీరు ఏమి వదిలారు? అని అడిగారు. ఆయనన్నాడు. "తుమ్మాకు" అన్నాడు. వీళ్ళకు అనుమానం వచ్చింది. తుమ్మాకు తినే ఆకు కాదు కదా! అంటే గురూగారు చాలా తెలివిగా ప్రవర్తిస్తున్నారు అని అర్ధమైంది. గురూగారు ఏ కాయగూర వదిలేశారు? అని అడిగారు శిష్యులు. 'మారేడుకాయ" అన్నారు. "హార్నీ గురూ గారు, తినే కాయగూర కాకుండా తినని కాయపేరు చెబుతున్నారు" అనుకుని ఈసారి మీలోని ఏ దుర్లక్షణం వదిలేశారు? అని అడిగారు శిష్యులు. "కోపం" వదిలేశానని అన్నారు. వీళ్ళు బిత్తరపోయారు. ఇంతలో వెనుకనున్న ఓ శిష్యుడు లేచి నాకు సరిగా వినపడలేదు ఏ లక్షణాన్ని వదిలారు? అని అడిగాడు. "కోపాన్ని రా" అని గట్టిగా చెప్పాడు. ఇంతలో కొత్తగా వచ్చిన శిష్యుడు అన్నాడు "గురూగారూ నేను ఇప్పుడే వచ్చాను. మీరు కాశీలో ఏ లక్షణాన్ని వదిలారో నాక్కూడా చెప్పరూ" అన్నాడు. "ఎన్నిసార్లు చెప్పాలి? కోపాన్నిరా" అని బిగ్గరగా అరిచాడు. ఇంతలో చివరనున్న వ్యక్తి లేచి మీరు ఏం చెప్పారో వినపడడం లేదు, మళ్ళీ చెబుతారా? అని అడిగాడు. అప్పుడాయనకి ఇంకా కోపం పెరిగిపోయింది. అప్పుడందరూ ఈ విషయానికి గురువుగారు ఇంత కోప్పడతారెందుకు? అనుకున్నారు. దీన్ని ఒక సినిమాలో కూడా పెట్టాం.

నేను కొన్ని కామెడీ ట్రాక్‌లు కూడా రాసేవాడిని. వాటిల్లో మచ్చుకి ఒకటి చెబుతా. ఓసారి ఒక ఆసామిని చూడ్డానికి వాడి ఫ్రెండ్ వచ్చాడు. ఏదో పిచ్చాపాటి మాట్లాడుకుంటూ ఉంటే ఫ్రెండ్ అన్నాడు, నీకు ఓ నాలుగు ఎకరాల చెరువు ఉండాలి కదా! మీ ఏరియా కూడా బాగుంటుంది కాబట్టి, పడవలు అవి పెట్టి పర్యాటక కేంద్రంగా చెయ్యొచ్చు కదా!" అన్నాడు. ఈ ఆసామి అన్నాడు ఐడియా బాగానే ఉంది కానీ 'ఆ చెరువు కోర్టులో ఉంది' అన్నాడు. ఫ్రెండ్‌కు ఆశ్చర్యం వేసింది.

**ఎమ్మెస్‌గారి జీవితంలో, ఆయన చుట్టూ సమాజంలో ఎన్నో ప్రాక్టికల్ జోకులు పేలేవి. చాలామంది వాటిని పట్టించుకోరు. కానీ ఎమ్మెస్ పరిసరాల్ని జాగ్రత్తగా గమనిస్తూ, నిత్యజీవితంలో మనుషుల మధ్య పండే హాస్యాన్నీ, తెలియకుండా జరిగే కామెడీ సంఘటనల్నీ తన సినిమా కథల్లో హాస్య సన్నివేశాలుగా మలుచుకునేవారు. ఇది ఎమ్మెస్‌గారి ప్రతిభకు తార్కాణం.**

చెరువు కోర్టులో ఉండడమేంటి? అనుమానం వచ్చింది. ఏ కోర్టులో అని అడిగాడు. 'తాడేపల్లిగూడెం తాలూకా కోర్టు' అన్నాడు. సరే, అనుకుని, తాడేపల్లిగూడెం కోర్టుకు వెళ్ళి చూశాడు. ఎక్కడా చెరువు కనిపించలేదు. ఆసామి మోసం చేస్తున్నాడనిపించింది. ఆ తరువాత కలిసినప్పుడు 'ఒరే! ఒక మంచి బేరం వచ్చింది, బాడవాలో ఉన్న నీ పొలం అమ్ముతావా? అని అడిగాడు. 'నీ ఆలోచన బాగానే ఉంది కానీ అది కూడా కోర్టులో ఉంది' అన్నాడు ఆసామి. అరె! మళ్ళీ కోర్టు అంటున్నాడు. నన్ను వెధవని చేద్దామని ఉద్దేశమా అనుకున్నాడు. 'ఏ కోర్టురా!' అని అడిగాడు ఫ్రెండ్. 'ఏలూరు జిల్లా కోర్టురా!' అన్నాడు ఆసామి. సరే, ఈసారి విషయం తేల్చేయాలని ఏలూరు జిల్లా కోర్టుకెళ్ళాడు. ఆవరణ పెద్దదే గానీ, ఎక్కడా వ్యవసాయ భూమి లేదు. ఉక్రోషం వచ్చేసింది. నాతో వీడు ఆడుకుంటున్నాడనుకున్నాడు.

మూడోసారి కలిసినప్పుడు సరదాగా మాట్లాడుతుండగా 'ఒరే! చిన్నప్పటి ఫ్రెండ్ లక్ష్మి ఏం చేస్తోందిరా! అని అడిగాడు. మొగుడూ పెళ్ళాలు దెబ్బలాడుకున్నారు, అది కోర్టుకెక్కింది' అన్నాడు. సరే అని వెంటనే అక్కడికి వెళ్ళాడు. అక్కడ ఏ లక్ష్మీ కనిపించలేదు. కోర్టుపైన కూడా చూశాడు. వెంటనే కోపంతో తిరిగొచ్చి, 'నా కొడకా! నన్ను ఎదవని చేద్దామనుకుంటున్నావా? చెరువు కోర్టులో ఉందన్నావు, పొలం కోర్టులో ఉందన్నావు, ఇప్పుడేమో లక్ష్మి కోర్టుకెక్కిందన్నావు' అని ఆసామి వెంటబడ్డాడు ఫ్రెండ్. అతను చెప్పే అవకాశం లేక పరుగుపెట్టాడు. ఇలా ఊళ్ళో జరిగిన ఎన్నో సంఘటనల్ని సినిమా కథల్లో హాస్య సన్నివేశాలుగా మార్చేవాణ్ణి.

మద్రాసులో కథలు వినిపించే రోజుల్లో ఓసారి ఓ కవి నన్ను తన రూముకు పిలిచాడు. తను రాసిన పాటను టేపు చేసి వినిపించాడు. 'ప్రే' అని రాస్తే 'ప్రే', 'మ' అని రాస్తే 'మ', 'ప్రేమా' అని రాస్తే ప్రేమా అని పాట సాగింది. నాకు ఒళ్ళు మండి అసలు కవిత్వం గుబాళింపే లేని ఆ పాట విని వాణ్ణి ఇష్టం వచ్చినట్లు తిట్టి వెనక్కు వచ్చేశాను. ఇలాంటివి రాసేవాళ్ళ మీద నాకు కసి తీరక, ఓ సినిమాలో ఇలాంటి కవులపై కామెడీ ట్రాక్ రాశాను. మరోసారి ఓ టీవీ సీరియల్‌లో కూడా కవులుపెట్టే హింస గురించి రాశాను. ఒకతను ఆఫీసుకు అర్జంటుగా వెళుతుంటే అతని వెంటపడి "రాత్రంతా కూర్చుని ఓ మంచి కవిత రాశా. మీరు తప్పనిసరిగా విని చావాల్సిందే! అని పట్టుబడుతుంది నా పాత్ర. 'మీ కవిత్వం వినటం కంటే చావటమే మంచిది' అంటాడతడు. 'బాబ్బాబు' అని బతిమాలి ఆ చెత్త కవిత వినిపిస్తాను! కళ్ళు తెరిచి చూస్తే అతను ఎదురుగా ఉండడు. కట్ చేస్తే కిందపడి ఉంటాడు!

ఆ సినిమాలోనే మాలతి అనే అమ్మాయి రోజూ ఉదయమే ఓ చెట్టు దగ్గర పూలు కోస్తూ ఉండేది. నేను ఏమైనా సరే ఆ అమ్మాయికి కవిత్వం వినిపించాలని ఆ అమ్మాయి వచ్చేముందే చెట్టెక్కి కూర్చుని, ఆ అమ్మాయి పూలు కోస్తుంటే, 'పూలు అందంగా ఉండును' అని కవిత్వం వినిపించడానికి ఆ అమ్మాయి వెంటబడ్డాను. ఈ సీనులు ఆ రోజుల్లో బాగా పండాయి.

### మిడ్‌నైట్ బిర్యానీ

సోంబాబు అని చిన్న నిర్మాత ఉండేవారు. అప్పట్లో గ్రీన్‌పార్క్ హోటల్‌లో "మిడ్‌నైట్ బిర్యానీ" ఉండేది. నన్ను పార్టీకి తీసుకెళ్ళారు. ఆయన మంచి తిండి ప్రియుడు. "బఫే" కాబట్టి ఎంతయినా తినొచ్చు. రెండు ప్లేట్లు పట్టుకెళ్ళి నిండా బిర్యాని గనులు తవ్వినట్టు తవ్వుకొచ్చి తినేశాడు. అక్కడ మేనేజర్ అదోరకంగా చూస్తున్నాడు. బహుశా ఆరుగురు తినే బిర్యానీ తినేసి ఉంటాడు. తరువాత ఖాళీ మంచినీళ్ళ మగ్గుల్లో ఐస్‌క్రీం వేసి నీళ్ళు కలిపి తాగేశాడు. బయటికి వెళుతుంటే, "ఎక్స్‌క్యూజ్‌మీ సార్..." అని మేనేజర్ చాలా వినమ్రంగా నా దగ్గరకొచ్చి, "ఎప్పుడూ ఈయన్ని తీసుకురాకండి సార్! నేను ఇలా అనకూడదు గానీ ఇది రిక్వెస్ట్ సార్..." అన్నాడు. ఆ ఆశ్చర్యం నుంచి తేరుకోవడానికి నాకు చాలాసేపు పట్టింది.

*(ఇంకావుంది)*

*-కూనపరాజు కుమార్*

*సెల్: 99899 99599*

# మదరిండియా 6

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287



**గదిలో అద్దం ముందు నిలుచుని తన ప్రతిబింబాన్ని తదేకంగా చూస్తూ ఉండి పోయాడు. నోనాతో పరిచయం, అనుబంధం, ఇవాళ్టి అధర స్పర్శ తనని ఎక్కడికి తీసు కెళ్తాయి! తనకి ఆకలిగా ఉన్నట్టు గుర్తించాడు సాకేత్. సోఫాలోంచి లేచి 'డ్రెస్ ఛేంజ్' అంటూ గదిలోకి వెళ్ళింది నోనా. తనను డిన్నర్‌కి తీసుకెళ్ళడానికి ఎవరైనా వచ్చి, హాల్లో ఉంటారేమో..**

**సాకేత్ మెట్లుదిగి హాల్లోకి వచ్చాడు. తనకోసమే ఎదురు చూస్తున్నట్టు నోనా గదిలోంచి బైటికి వచ్చింది. జీన్స్, టీషర్ట్. నవ్వుతూ అతని దగ్గరగా వచ్చింది నోనా. 'రెడీ!" అంది.**

"ఎక్కడికి?"

"డిన్నర్!"

"నన్ను తీసుకెళ్ళడానికి ఎవరో వస్తారనీ, ఇరవై నాలుగ్గంటలూ అటెండ్ చేస్తారనీ జాన్‌మైకేల్ అన్నాడు. ఎవరూ రాలేదా!" సాకేత్ అడిగాడు.

నోనా చిన్నగా నవ్వింది "వచ్చి, ఉన్నారుగా!"

"వచ్చారా? ఎవరు? ఏరీ?"

"ఇదిగో... ఇక్కడే! నీ రౌండ్ ద క్లాక్ అటెం డెంట్ నేనే!" నోనా నవ్వుతూ అంది.

సాకేత్ కళ్ళు పెద్దగా చేసి చూశాడు. "నిజం గానా?"

"నిజంగానే! నీకు ట్రైనింగ్ కూడా నా సూపర్ విజన్‌లోనే జరుగుతుంది!" నోనా అంది." కమాన్, ఇండియన్ రెస్టారెంట్‌లో టేబుల్ రిజర్వ్ చేశాను.."

"ఇండియన్ రెస్టారెంటా?"

"యా! శరవణ భవన్!" నోనా హుషారుగా అంది. "ఐ లైక్ ఇండియన్ ఫుడ్!"

సాకేత్ ఆశ్చర్యంగా చూశాడు. నోనా చొరవగా అతని చెయ్యిపట్టుకుని గుమ్మంవైపు లాక్కెళ్ళింది. కాసేపట్లో నోనా డ్రైవ్‌చేస్తున్న కారు శాన్‌ఫ్రాన్సిస్కో రోడ్ల వెంట దూసుకెళ్తోంది.

•••

"థాంక్స్ నోనా, ఫర్ ది డిన్నర్!" మేడమెట్ల దగ్గరగా నిలుచుని అన్నాడు తిరిగి రాగానే సాకేత్.

"థాంక్స్ చెప్పొద్దు సాకేత్. నువ్విప్పుడు ఇండ మెరికా ఫ్యామిలీ మెంబరువి, నాలాగే!"

"ఓకే... గుడ్‌నైట్!"

"నైట్!" నోనా చిరునవ్వుతో అంది.

అయిదు నిమిషాల్లో డ్రెస్ ఛేంజ్ చేసుకుని మంచం మీద వాలాడు సాకేత్. జరిగిన 'ఊహిం చని సంఘటన' అతన్ని ఆలోచనలతో ఉక్కిరి బిక్కిరి చేస్తోంది. సడన్‌గా శాన్‌ఫ్రాన్సిస్కో ప్రయాణం, నోనా ప్రత్యక్షం కావడం, ఐ లవ్ యూ చెప్తూ తన ఒడిలో తలపెట్టిపడుకోవడం, ఈ ప్రయాణానికి గమ్యం ఏదో, ఎక్కడుందో తెలీదు! తనని ఎక్కడికి చేరుస్తుందో తెలీదు.

నోనా తనని ప్రేమిస్తోంది. ఆ ప్రేమకు ఆమె ఆశించే పరమావధి ఏమిటి? సరదాగా కలిసి కొంతకాలం పాటు కాలక్షేపం చేయడమా? కలిసి, కలకాలం కాపురం చేయడమా? తనకి ఇండి యన్ కల్చర్ ఇష్టం అంటోంది నోనా. ఇండియన్ ఆహారం ఇష్టమంటోంది. ఇండియన్ లవ్ ఇష్టమం టోంది... అంటే... అంటే...

ఇందాక తన ఒళ్లో తలపెట్టి వెల్లకిలా పడుకుని నోనా తనని ప్రేమిస్తున్నానంది. తనూ ఆమెను ప్రేమిస్తున్నానన్నాడు. నిజంగానే తాను ఆమెను ప్రేమిస్తున్నాడా? లేక - కేవలం ఇష్టపడుతున్నాడా! ఇష్టంవేరు. ప్రేమవేరు. ఇష్టం ఎందరిమీదైనా



## జరిగిన కథ

భర్త ఆశయసాధనకోసం ముగ్గురు కొడుకుల్నీ, కూతుర్నీ నీతీనిజాయితీలు రంగరించి పెద్ద చేస్తుంది నిగమ. కానీ ఆ కొడుకులు ఉన్నతస్థానాలకు ఎదిగి తండ్రి స్ఫూర్తికి భిన్నంగా తయారవుతారు. దాంతో కన్న కొడుకులకు వ్యతిరేకంగా న్యాయస్థానాన్ని ఆశ్రయిస్తుందా కన్నతల్లి. ఫ్లాష్‌బ్యాక్‌లోకెళితే, తన తండ్రిని చంపిన రాజవర్మ కూతురు రంజనను ప్రేమిస్తాడు నిగమ పెద్ద కొడుకు ఏకాంత్. ఆమెను పెళ్ళి చేసుకుని ఇల్లరికం వెళ్ళడమే కాకుండా, ఓ డబ్బున్న మారాజుకు దత్తపుత్రుడైపోతాడు. అతని తమ్ముడు సాకేత్‌ను ఒక బహుళజాతి కంపెనీ యజమాని కూతురు నోనా ఇష్టపడుతుంది. తెలుగు నేర్చుకోవడం కోసం ఉద్యోగంలో పెట్టుకుంటుంది. అతనితో సాన్నిహిత్యం పెంచుకుంటుంది. ఆ ప్రయత్నంలో సాకేత్‌ను శాన్‌ఫ్రాన్సిస్కో తీసుకెళ్ళి అక్కడే ఐ లవ్యూ చెబుతుంది.

**ఆ తర్వాత....**

ఉండొచ్చు, ఉండగలదు. ప్రేమ ఏ ఒక్కరిమీదో ఉంటుంది. నిజం చెప్పుకోవాలంటే నోనా తనని సుడిగాలిగా చుట్టేసింది. ఇంతవరకూ, ఏ విషయంలోనూ, క్షణమాత్రం కూడా ఆమె నటించ లేదు. మనసులోని భావాలను స్వచ్ఛంగా మాటల్లో వ్యక్తం చేస్తూనే ఉంది.

'తెలుగు నేర్చుకోవాలి' అన్న నిర్ణయమూ నిజమే! తనను అంటిపెట్టుకుని ఉండటానికి అదొక సాకు కాదు. ఆ విషయంలో నోనా సిన్సియర్. తెలుగు నేర్చుకోడానికే తనను సెలెక్ట్ చేశానంది. అప్పుడు కూడా సిన్సియరే. రెండో కారణం తనకోసం అంది. అక్కడా సిన్సియరే.

కూతురి కోరికలన్నీ క్రేమర్‌కి తెలుసని రూఢి అయిపోయింది. నోనా ముందస్తుగా ఇక్కడికిచేరిన విషయం రహస్యంగావుంచి, తనని పంపించాడాయన! వయసొచ్చిన కూతుర్నీ, వయసొచ్చిన ఒక యువకుడినీ ఎవ్వరూ లేని శాన్‌ఫ్రాన్సిస్కో నగరంలో ఐసొలేట్‌గా వదిలేస్తున్నానన్న భయం కానీ, ఆందోళన కానీ ఆయనలో లేవు! ఆయన ముందు నోనా మాటకు తిరుగులేదు!

'ప్రేమిస్తున్నా' అని తను నోనాతో అనేశాడు. ప్రేమించకుండా ఉండలేకపోతున్నాడు. తన మీద నోనాకు ఎంతప్రేమ ఉందో ఆమె పెదవులు తన పెదవులకు తమదైన భాషలో చెప్పాయి. కానీ... కానీ... 'ప్రేమ' అనేది ఆవేశంలో అనేమాట. ఆవేశంలో ఆవహింపజేసుకునే ఒక శక్తి! కానీ పెళ్ళి ఆవేశంతో అనే మాటకాదు. ఆలోచనతో చేసే కార్యం. తనకి ఒక నేపథ్యం ఉంది. ఆ నేపథ్యంలో అమ్మ ఉంది. అన్న ఉన్నాడు. తమ్ముడున్నాడు. చెల్లి ఉంది. సమాజం ఉంది. అందర్నీ, అన్నింటినీ ఆవరించి స్పందిస్తున్న భారతీయత ఉంది! సాకేత్ బరువుగా నిట్టూరుస్తూ బెడ్‌లైట్ స్విచ్ నొక్కాడు. గదిని చీకటి ఆవరించుకుంది.

నోనా తనను ప్రేమిస్తోంది. ప్రేమించమంటోంది. పెళ్ళి చేసుకోమంటుందా? అంటే తన సమాధానం ఏమిటి? నిద్ర పట్టని సాకేత్ పక్కకు తిరిగాడు. తనకు నిద్రపట్టక పోవడానికి జెట్‌లాగ్ ఒక్కటే కారణం కాదు.

చిన్నగా ఏదో చప్పుడు. కిటికీ గాలికి కదలినట్టుంది. ఉన్నట్టుండి గదిలో చీకటి వెలుతురుగా మారింది. సాకేత్ కళ్ళు జిగేల్‌మన్నాయి. అతని వీపు వైపు ఎవరో బరువుగా ఊపిరి పీలుస్తున్నట్టుంది. సాకేత్ వెల్లకిలా తిరిగిచూశాడు. అతని కళ్ళు ఆశ్చర్యదరహాసంతో నిండిన గిన్నెల్లా అయ్యాయి. మంచం దగ్గరగా నోనా. ఆమె ఇప్పుడు జీన్స్‌లో లేదు. టీ షర్టులో లేదు. తెల్లటి పల్చటినైటీ ఆమె శరీరాన్ని తనలో దాచుకోవడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తోంది. బాబ్డ్‌హెయిర్ ఆమె భుజాల మీద కదుల్తోంది. నైటీ చాటున నివురుకప్పిన నిప్పులా అవుపిస్తోంది నోనా.





## కండిషన్స్ అప్లయ్!

'జెంటిల్‌మన్' తరువాత నివేదా థామస్‌కి అవకాశాలు క్యూ కడుతున్నాయి. అయితే తనతో సినిమా చేయాలనుకునే దర్శకనిర్మాతలకు తన కండిషన్స్‌తో తికమక పెట్టేస్తోందట! సినిమాలో ఎంత గ్లామర్‌గా కనిపించమన్నా కనిపిస్తుందట కానీ, స్కిన్ షో మాత్రం చేయదట! అలాగే తన పాత్రకు చాలా చాలా ఇంపార్టెన్స్ ఉండాలని కూడా చెబుతోందట! రెండో కండిషన్ కాస్త అర్థమయినా మొదటి కండిషనే అర్థం కాక వచ్చిన వారు వచ్చినట్టే వెళ్ళిపోతున్నారట! కొందరు స్టార్ హీరోల సినిమాలకు కూడా నివేదా ఈ కండిషన్స్ అప్లయ్ చేస్తోందట! దాంతో ఇటీవలి కాలంలో ఒకటి రెండు పెద్ద ప్రాజెక్టులను మిస్ చేసుకుందన్నది తాజా సమాచారం! నివేదా అర్థం లేని కండిషన్లతో కెరీర్ నాశనం చేసుకుంటోందని టాలీవుడ్‌లో గుసగుసలు వినిపిస్తున్నాయి.

"నోనా..." సాకేత్ వణికే కంఠంతో అంటూ తటాలున లేచి కూచున్నాడు.

"ఒంటరిగా... భయమేసింది, వచ్చాను.." నోనా మెల్లగా అంది. బరువుగా, ఆవేశంగా సాగుతున్న ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలను నైటీ కళ్ళకు కడుతోంది.

"నోనా..." ఏం చెప్పాలో తోచని స్థితిలో సాకేత్ అన్నాడు.

నోనా నెమ్మదిగా కదిలింది. అతని దగ్గరగా మంచం మీద కూచుంది. ఆమె స్ప్రే చేసుకున్న పర్‌ఫ్యూమ్ మత్తెక్కిస్తూ సాకేత్‌ని హిప్నటైజ్ చేస్తోంది. నోనా చేతులు కదిలాయి. రెండు అర చేతులూ అతని ఛాతీమీద వాలాయి. నోనా సున్నితంగా సాకేత్‌ని తోసింది. సాకేత్ బలహీనంగా మంచం మీదికి వాలాడు. నోనా మెల్లగా అతని వైపు వాలింది. ఏదో నులివెచ్చని స్పర్శ సాకేత్ సర్వస్వాన్నీ ఆవరిస్తోంది. నోనా చెయ్యి కదిలింది. లైటు ఆరిపోయింది. నోనా బాబ్‌హెయిర్ సాకేత్ ముఖాన్ని కారుమేఘంలా కప్పేసింది. సాకేత్‌ని ఏదో సరికొత్త అనుభూతి కాల స్థల పరిమాణాలకు అతీతమైన స్థితికి తీసుకెళ్తోంది. అతని చేతులు ప్రణయ రజ్జువులా కదిలాయి. తన మీదికి వాలిన నోనా శరీరాన్ని ఆ ప్రణయ రజ్జువులతో అల్లుకున్నాడు. రెండు హృదయాలు ఒక్కటిగా స్పందించడానికి ప్రయత్నిస్తున్నాయి. రెండు శరీరాలు తమ అస్తిత్వాన్ని తాత్కాలికంగా కోల్పోతున్నాయి. ఆ గదిలో కాలం స్తంభించింది.

•••

సాకేత్ ఎందుకో ఉలిక్కిపడి లేచాడు. గదంతా పగటి వెలుగు వ్యాపించింది. సాకేత్ తలతిప్పి చూశాడు. మెడ దాకా రగ్గు కప్పుకున్న నోనా గాఢ నిద్రలో ఉంది. బాబ్డ్ హెయిర్ తలగడ మీద ఉన్న ఆమె ముఖం చుట్టూ గుండ్రటి విసనకర్రలా పరుచుకుంది. నోనా ఎర్రటి పెదవులు ఎందుకో కొద్దిగా ఉబ్బినట్టున్నాయి.

నోనా రాత్రి గదిలోకి వచ్చిన తరువాత జరిగిందంతా వర్ణనాతీతమైన ఏదో నూతన అనుభూతిలా అనిపిస్తోందతనికి. ఇన్నాళ్ళూ అసంపూర్ణంగా అనిపించిన తన వ్యక్తిత్వం హఠాత్తుగా ఏదో పరిపూర్ణత సంతరించుకున్నట్టు అనిపిస్తోంది అతనికి.

సందేహం లేదు, తను నోనాను ప్రేమిస్తున్నాడు. శరీరాల ద్వారా హృదయాలను, ఆత్మలను ఐక్యం చేసిన రాత్రి అనుభవం తరువాత, ఆలోచనతో చేసే పెళ్ళి అనే కార్యం ఇప్పుడు సాకేత్‌కి అంత అసాధ్యమైనదిగా అనిపించడంలేదు. తన నేపథ్యంలో ఉన్న తనవాళ్ళూ, సమాజం, లోకం ,అందరూ తాను నిర్ణయం అనే తీక్షణతతో చూస్తే కరిగిపోయే మంచు ప్రతిమల్లా అనిపిస్తున్నారు.

నోనా కళ్ళు మెల్లగా విచ్చుకున్నాయి. తన ముఖంలోకే చూస్తున్న సాకేత్ కళ్ళల్లోకి చిరునవ్వుతో చూసింది. కొద్దిగా విచ్చుకున్న ఎర్రటి పెదవులమధ్య తెల్లటి పళ్ళు మెరిశాయి.

"సాకేత్... థాంక్యూ వెరీమచ్..."

"దేనికి?"

"నీ దగ్గర పడుకోనిచ్చినందుకు..." నోనా కళ్ళు కొద్దిగా మూస్తూ అంది. ఏదో జీర ఆమె కంఠస్వరాన్ని మధురంగా మార్చింది.

"ఇది నీ ఇల్లు. ఇది నీ గది. ఇది నీ మంచం..." సాకేత్ నవ్వుతూ అన్నాడు.

"ఇల్లు నాది. గది నాది. మంచం నాది... మరి నువ్వో?" నోనా జీరగా అంది. "నువ్వు కూడా నాదేనా?"

"నువ్వు కూడా నాదేనా - అనకూడదు. 'నువ్వు కూడా నావాడివేనా?' అనాలి!' సాకేత్ దిద్దాడు.

"ఐ... సీ.. ఇల్లు నాది. అది నాది. మంచం నాది. నువ్వు కూడా... నా వాడివేనా?" నోనా మెల్లి మెల్లిగా గుర్తు చేసుకుంటూ అంది.

"యస్... నోనా.. నేను నీవాణ్ణి..."

"మరి నేను? హూ యామ్ ఐ?" నోనా అమాయకంగా అడిగింది.

'నువ్వు నా దానివి!" సాకేత్ ఆవేశంగా అన్నాడు. 'అంటే యూ ఆర్ మైన్' అని అర్థం!"

"ఓ సాకేత్ ఐ లవ్ యూ... ఐ లవ్ యూ...' అంటూ నోనా రెండు చేతుల్నీ చాపింది.

తీగల మధ్య కొమ్మలా సాకేత్ ఆ చేతుల మధ్య ఒదిగిపోయాడు.

•••

రోజులు గడుస్తున్నాయి. నోనా సాకేత్‌ల మధ్య అంకురించిన ప్రేమ చిగుళ్ళు తొడిగి, తీగలు సాగుతోంది. తనకు ఏదో కొత్త అర్హత వచ్చినట్టు అనిపిస్తోంది సాకేత్‌కు. తనిప్పుడు ఒక పరిపూర్ణ యువకుడు. తన జీవితం గురించి తను ఆలోచించుకోగలడు. నిర్ణయించుకోగలడు. మనిషి జీవితంలో అనుభవం చాలా ప్రమాదమైందని ఇప్పుడు అర్థమవుతోంది అతనికి. ఉద్యోగాల విషయంలో కూడా అనుభవానికి ప్రాధాన్యం అందుకే ఇస్తున్నారు.

నోనాతో తన అనుభవం కేవలం శారీరకమైనదే కాదు. మనసులేని శరీరం స్పందనలేని ప్రతిమ! ప్రారంభం నుంచీ నోనా తన అందంతో, ప్రవర్తనతో తన మనసును ప్రభావితం చేసింది. ప్రేమతో, ప్రణయంతో ముఖ్యంగా త్యాగంతో తన శరీరాన్ని ప్రభావితం చేసింది.

ఆనాటి ఉదయం ఆమె తనతో అన్నమాటలు ఇంకా గుర్తున్నాయి తనకు. కిందటి రాత్రి అనాలోచితంగా, అసంకల్పితంగా జరిగిన సంఘటనకు తను నోనాకు సారీ చెప్పాడు. నోనా తేలిగ్గా నవ్వేసింది.

"పెళ్ళికి ముందు శృంగారం ఇక్కడ నిషేధం కాదు. ఇండియాలో ఉండొచ్చు. కానీ మనం ఇప్పుడు ఇండియాలో లేం. పర్మిసివ్ ల్యాండ్‌లో ఉన్నాం. బీ యే రోమన్, లివ్ ఇన్ రోమ్, సాకేత్!"

తను ఆశ్చర్యంగా చూశాడు. "నేను... ఒక నిజం చెప్తున్నాను. నన్ను ఒక భారతీయుడికి అంకితం చేయాలనుకున్నాను. ఒక భారతీయుడి ప్రేమను పొందాలనుకున్నాను. ఆ భారతీయుడితో జీవితం పంచుకోవాలనుకున్నాను. నా ఆశ ఫలించింది. పర్మిసివ్ ల్యాండ్ అయిన అమెరికాలో పుట్టి పెరిగినా, నేను యువత లోనయ్యే శారీరక ప్రలోభానికి లోను కాలేదు!" అంది నోనా.

> **తెల్లటి పల్చటి నైటీ చాటున ఆమె నివురుగప్పిన నిప్పులా కనిపిస్తోంది. ఆమె స్ప్రే చేసుకున్న పర్‌ఫ్యూమ్ అతడికి మత్తెక్కిస్తోంది. అతన్ని సున్నితంగా మంచంమీదకు తోసి మెల్లగా అతనివైపు వాలిందామె. ఏదో నులివెచ్చని స్పర్శ... లైటు ఆరిపోయింది. ఆమె కురులు అతడి ముఖాన్ని కారుమేఘంలా కప్పేశాయి. అతడిలో ఏదో సరికొత్త అనుభూతి. ఆ రెండు శరీరాలు తమ అస్తిత్వాన్ని తాత్కాలికంగా కోల్పోతున్నాయి.**

క్రేమర్ తనని ఏమార్చాడు. క్రాష్ ప్రోగ్రాం కింద ట్రైనింగన్నాడు. నోనాతో గడపడమే తన ట్రైనింగ్ అని రెండవ రోజే తెలిపోయింది...!

•••

పసిఫిక్ మహాసముద్రం మీంచి గాలి హోరుమని వీస్తోంది. అంత ఎత్తుమీంచి గోల్డెన్ గేట్ బ్రిడ్జి చిన్నగా అనిపిస్తోంది. ఇంకా దూరంలో ఆ ముందురోజు బోటులో వెళ్ళి తనూ, నోనా చూసిన అల్‌కట్రాజ్ చెరసాల... గోల్డెన్‌గేట్ బ్రిడ్జి గురించీ, అల్‌కట్రాజ్ ప్రిజన్ గురించి తను విని ఉన్నాడు. నోనా మూలంగా చూడగలిగాడు. ఆ రెండింటినీ బ్యాక్‌గ్రౌండ్స్‌గా నోనా, తనూ ఎన్ని ఫోటోలు తీసు

కున్నారో లెక్కలేదు.

"సాకేత్..."

నోనా పిలుపు సాకేత్‌ని ఈ లోకంలోకి లాగింది. ఏమిటన్నట్టు చూశాడు.

"ఎల్లుండి ఫ్లయిట్‌కి బయల్దేరుతున్నాం. నాన్న ఫోన్ చేశాడు" నోనా గాలికి ఎగురుతున్న బాబ్డ్ హెయిర్ సర్దుకుంటూ అంది.

"అంత త్వరగానా?"

నోనా నవ్వింది. "మనం ఇక్కడ మూడు వారాలు గడిపాం!:"

"అది మూడు రోజులుగా అనిపిస్తోంది నాకు!" సాకేత్ నవ్వుతూ అన్నాడు. "ఓకే! ఎం.డి.గారు రమ్మంటే వెళ్ళాల్సిందే! తిరుగుప్రయాణం చెరొక రోజూ, చెరొక ఫ్లయిటా?"

"ఒకే రోజు. ఒకే ఫ్లయిట్!" నోనా నవ్వింది. "సాకేత్... ఒక విషయం అడగనా?"

"అడగనా అని అడగాలా? అడుగు!"

"ఇండియాకి వెళ్ళగానే నన్ను... పెళ్ళి చేసుకుంటావుగా?" సాకేత్ సాలోచనగా చూశాడు. "వెళ్ళగానే అంటే..?"

"రోజులు. నెలలు కాదు!"

"...మా ఫ్యామిలీకి చెప్పాలి. అమ్మ, అన్నయ్య, తమ్ముడు, చెల్లి..."

"అమెరికా అమ్మాయిని వాళ్ళు స్వాగతిస్తారా?" నోనా ఇంగ్లీషులో అడిగింది. సాకేత్ ఆమె ముఖంలోకి సూటిగా చూశాడు. "వాళ్ళను అడగాలి" అని నేను అనలేదు. 'చెప్పాలి' అన్నాను. చెప్పడానికీ, అడగడానికీ చాలా తేడా ఉంది నోనా!"

"యస్!" నోనా ఉత్సాహంగా అంది. "మీ అమ్మగారి సంగతి చెప్పు. మిగతావాళ్ళు... ఫర్వాలేదు. ఆమె మెంటాలిటీ... ఆమె ఆర్థడాక్సా!"

"మా అమ్మ ఇంతవరకూ కులమతాల భేదాల గురించీ, జాతీయ విజాతీయ భేదాల గురించీ ఎప్పుడూ మాట్లాడలేదు. 'యూనివర్సల్ ఫ్యామిలీ' ఆదర్శం ఆమెకి ఇష్టం!"

"అలాంటి అత్తగారే కావాలి నాకు!" నోనా నవ్వుతూ అంది. ఏదో గుర్తొచ్చినట్టు నిదానించి సాకేత్ ముఖంలోకి చూసింది.

"సాకేత్, నా ప్రశ్నకి నువ్వు డైరెక్టుగా సమాధానం ఇవ్వలేదు!" సాకేత్ కనుబొమలు ముడివేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఇండియాకి వెళ్ళగానే, పోనీ వెళ్ళాక - నన్ను పెళ్ళి చేసుకుంటావా?"

"నిన్ను చేసుకోకుండా నన్ను నువ్వు కూడా ఆపలేవు!" సాకేత్ నవ్వుతూ అన్నాడు.

నోనా ఆవేశంగా అతనివైపుదూకి కౌగిలిలో బంధించింది. పసిఫిక్ మహాసముద్రం గోల్డెన్ గేట్ బ్రిడ్జి వైపు నుంచి వీస్తున్న చల్లటిగాలి వాళ్ళ కౌగిలిలోని వెచ్చదనాన్ని చల్లార్చలేకపోతోంది.

చాలాసేపు ఒక్కటిగా పెనవేసుకుపోయిన ఇద్దర్నీ చూస్తూ ఎవరో చప్పట్లు చరుస్తున్నారు. ఆ శబ్దం ఇద్దర్నీ విడదీసింది.

●●●

ముంబై ఎయిర్‌పోర్ట్‌లోంచి ఇవతలకి వస్తున్న ఏకాంత్‌కి ఎదురుగా వెళ్ళి, 'అన్నయ్యా!' అంటూ కౌగిలించుకున్నాడు సాకేత్.

ఏకాంత్ తమ్ముణ్ణి ఎగాదిగా చూశాడు. 'సాకేత్ అక్కడున్నప్పటికన్నా బ్రైట్‌గా అయ్యావు. ముంబై గాలీ నీరూ వంటబట్టినట్టున్నాయి..."

సాకేత్ సమాధానంగా నవ్వాడు. ఏకాంత్ చేతిలోని ఎయిర్‌బ్యాగ్ తీసుకుని, కారు పార్క్ వద్దకు నడిచాడు సాకేత్. 'అన్నయ్యా, అమ్మ ఎలా ఉంది?"

"బావుంది. నువ్వు మంచి ఉద్యోగంలో సెటిల్ కావడంతో ఆమె ఆనందానికి హద్దుల్లేవు!" ఏకాంత్ నవ్వుతూ అన్నాడు.

ఇద్దరూ కారెక్కారు. "నీ రాక ప్లెజెంట్ సర్‌ప్రైజ్!" కారు స్టార్ట్ చేస్తూ అన్నాడు సాకేత్.

"ముఖ్యమైన విషయం. త్వరగా తేల్చాలి కూడా. నువ్వు అమెరికానుండి ఎప్పుడొస్తావా అని కాచుక్కూర్చున్నాన్రా!" ఏకాంత్ అన్నాడు.

"అంత అర్జెంటైతే ఫోన్ చేయొచ్చుగా, అన్నయ్యా?" సాకేత్ కారు యూటర్న్ చేస్తూ అన్నాడు.

"ఫోన్ వ్యవహారం కాదు. ముఖాముఖీ... చెప్తాగా!"

## అనవసరంగా ఇరికించారట!



కొద్దిరోజుల క్రితం కర్నాటకలో నిర్వహించిన యోగా డేకి బిపాసా హాజరు కావడం, ఆ కార్యక్రమానికి సెంటర్ ఆఫ్ ది ఎట్రాక్షన్‌గా నిలవడం తెలిసిందే! జరిగిపోయిన దానికి ఇప్పుడు ఈ గొడవ ఎందుకు అనుకుంటే పప్పులో కాలేసినట్టే! యోగా డేలో పాల్గొన్నందుకుగాను బిపాసా భారీ రెమ్యునరేషన్ డిమాండ్ చేసిందన్న వార్తలు వచ్చాయి. వీటి నేపథ్యంలో నిర్వాహకులు 43 లక్షల యోగా డే బిల్లు పెట్టారట! స్వచ్ఛందంగా నిర్వహించాల్సిన కార్యక్రమానికి ఇంత బిల్లు ఏమిటి? అని కర్నాటక సర్కారు నిర్వాహకులను ప్రశ్నిస్తే ఇంత మొత్తం బిపాసాకు చెల్లించవలసి ఉందని చెప్పారట! వాస్తవానికి ఈ కార్యక్రమంలో పాల్గొన్నందుకు బిపాసా ఒక్క రూపాయి కూడా పుచ్చుకోకుండా స్వచ్ఛందంగా పాల్గొందనీ, నిర్వాహకులు చెబుతున్న 43 లక్షలకూ, బిపాసాకు ఎలాంటి సంబంధం లేదని ఆమె సన్నిహితులు చెబుతున్నారు. ఈ విషయంలో బిపాసా ఓ క్లారిటీ ఇస్తే తప్ప అసలు గొడవ తెగదు అంటున్నారు బాలీవుడ్ జనాలు.

ఏకాంత్ నిట్టూర్చి అన్నాడు. "అన్నట్టు నీ యూయస్ ట్రిప్పు ఎలా ఉంది? ట్రైనింగ్ ఉపయోగపడేదేనా?"

"మూడు వారాలు లైవ్‌లీగానే గడిచింది. జస్ట్ రిఫ్రెషర్ కోర్సన్నయ్యా. మొత్తం మీద ఫ్యూచర్లో ఉపయోగపడేదే..." సాకేత్ నోనాతో గడిపిన క్షణాల్ని గుర్తుచేసుకుంటూ అన్నాడు.

"అలవెన్స్ బాగానే ఇచ్చారా?" ఏకాంత్ ప్రశ్నించాడు.

"నేను ఎక్స్‌పెక్ట్ చేయని లెవెల్లో ఇచ్చారు!" సాకేత్ చిన్నబంగళా ముందు కారాపుతూ అన్నాడు. ఇద్దరూ కారు దిగారు.

"సాకేత్ ఇవాళ లీవ్ అప్లై చేస్తావా? చాలా విషయాలు మాట్లాడాలి నీతో.." ఏకాంత్ అన్నాడు.

సాకేత్ చిన్నగా నవ్వాడు. "చెప్పడం మరిచిపోయాను. యూయస్ నుండీ తిరిగి రాగానే ప్రమోషన్ ఇచ్చారు! స్వతంత్ర ఉద్యోగం. సెలవు పెట్టే అవసరమే లేదు. వెళ్ళాలంటే వెళ్ళొచ్చు. వద్దనుకుంటే మానేయొచ్చు. పని దినాలు లెక్కకి రావు. పని లెక్కకొస్తుంది. అంటే! మనం బంగళాలో హాయిగా రిలాక్స్ అవ్వచ్చు!"

●●●

"చెప్పన్నయ్యా!" టిఫిన్ ముగించి, కాఫీలు తాగేక అన్నాడు సాకేత్.

"ఏం లేదు, సాకేత్... నేను ఒకమ్మాయిని ప్రేమిస్తున్నాను. చదువూ, సంస్కారం, అందం, చందం, ఆస్తీ అంతస్తూ - అన్నీ ఉన్న అమ్మాయి."

సాకేత్ ఆశ్చర్యంగా చూశాడు. ఎప్పుడూ పుస్తకాల్లో తలదూర్చి బతికిన ఏకాంత్ ప్రేమలో పడ్డాడా!" ఎవరన్నయ్యా ఆ అదృష్టవంతురాలు?"

"అదృష్టవంతురాలే.. కానీ ఆ తండ్రి కూతురిగా పుట్టడం ఆమె దురదృష్టం!" ఏకాంత్ బరువుగా అన్నాడు.

"ఏం? గూండానా? మాఫియా కేసా?"

"అలాంటి వారు కాదు. వ్యాపారవేత్త. కోటీశ్వరుడు. పేరు రాజవర్మ... రాజవర్మ అనగానే ఏదైనా గుర్తొచ్చిందా నీకు?"

"రాజవర్మ... ఎప్పుడో విన్నపేరులాగే ఉంది..."

ఏకాంత్ బరువుగా నిట్టూర్చాడు. "నాన్నను ఫేబ్రికేటెడ్ కరప్షన్ కేసులో ఇరికించిందీ, నాన్న మరణానికి పరోక్షంగా కారణమైందీ రాజవర్మగారే అని అమ్మ నమ్మకం..."

"మైగాడ్..." సాకేత్ అన్నాడు. "అమ్మ ఊరికే నమ్మకం పెట్టుకోదు. అమ్మ ఎంత పర్‌ఫెక్టో మనందరికీ తెలుసు.."

"మొదట్లో రాజవర్మ అలాంటి వ్యక్తి కాదని అమ్మతో వాదించాను. అమ్మ గ్యారెంటీగా చెప్పాక సరే అన్నాను. అయితే ఆ రాజవర్మ కూతురైనంత మాత్రాన రంజనను మరిచి పోవాలనుకోవడం ధర్మం కాదని నా నమ్మకం..." ఏకాంత్ సాకేత్‌నే చూస్తూ అన్నాడు. "నువ్వేమంటావ్? నాన్నకి అలా జరిగే సమయానికి రంజన మరీ చిన్నపిల్ల కావచ్చు. పుట్టే ఉండక పోవచ్చు. తండ్రి నేరాన్ని ఆమెకి అంటగట్టడం..."

"న్యాయం కాదు" సాకేత్ అడ్డొస్తూ అన్నాడు.

ఏకాంత్ తృప్తిగా చూశాడు. "థాంక్స్ సాకేత్..

నాతో ఏకీభవిస్తున్నందుకు.."

"అమ్మ ఏమంటుంది. రాజవర్మ నేరంలో రంజనకు వాటా ఉంటుందంటుందా?"

"అమ్మ అలా అనదు. ఇప్పటిదాకా అనలేదు. 'నా పసుపు కుంకుమల్ని చెరిపివేసిన వ్యక్తితో వియ్యం నచ్చదు!' అంటోంది కరాఖండిగా!"

"సానుభూతితో ఆలోచిస్తే అమ్మ ఆలోచనా న్యాయమైందే అనిపిస్తుంది. కానీ... ఆ కారణంతో ఆ అమ్మాయికి అన్యాయం చేయలేం.."

"అమ్మ సెంటిమెంటూ, ఆవేదనా, ఆత్మాభిమానమూ అన్నీ గౌరవించదగినవే! అలాగే రంజన ప్రేమను కూడా గౌరవించాల్సిందే! సానుభూతితో చూడాల్సిందే.." ఏకాంత్ ఉద్రేకంగా అన్నాడు.

"సమాధానం లేని సమస్యే..." సాకేత్ సాలోచనగా అన్నాడు.

"రంజనను పెళ్ళి చేసుకుంటే అమ్మ ఏమవుతుందో తెలీదు. చేసుకోకపోతే రంజన ఏమవుతుందో తెలీదు.." ఏకాంత్ కంఠంలో నిరాశ బలహీనంగా పలికింది.

"అవును. పెద్ద డైలమాలో పడిపోయావన్నయ్యా".

"నాకు తెలీకుండా రంజనవెళ్ళి అమ్మతో మాట్లాడింది. కోడలిగా స్వీకరించమని రిక్వెస్ట్ చేసింది కూడా."

"అమ్మ ఏమంది?"

"ఏమన్నా కూడా అది ఆశాజనకంగా లేదు. నాతో ఒక మాట అంది. 'నువ్వూ, ఆ రంజనా ఇద్దరూ మేజర్లు. మీరిద్దరూ పెళ్ళి చేసుకోవాలనుకుంటే ఎవ్వరూ ఆపలేరు. నేను కూడా ఆపలేను!" అంది."

"అగ్నిపరీక్షే! ఏం చేయాలన్నయ్యా! సాకేత్ అడిగాడు.

"ఏ సమస్య ఎదురైనా ఇంట్లో మనం అయిదుగురమూ చర్చించి నిర్ణయం తీసుకునే అలవాటు ఉందిగా. ఈ సమస్యనూ అలాగే చూద్దాం అంది అమ్మ. త్వరలో నీకు పిలుపు వస్తుంది. మెజారిటీ అభిప్రాయాన్ని మనందరం ఒప్పుకుంటామని నీకు తెలుసు. నువ్వు... నా పక్షాన... మాట్లాడు తమ్ముడూ!"

ఏకాంత్ ప్రాధేయపూర్వకంగా అన్నాడు. 'నా కోసం. నా ప్రేమకోసం.... నా రంజన కోసం నన్ను సపోర్ట్ చేయి సాకేత్".

"అమ్మ మనసు నొప్పించడం నాకు ఇష్టం ఉండదన్నయ్యా.." అంటూ సాకేత్ కూచున్నచోటు నుంచి లేచాడు. కిటికీముందు నిలుచుని, తోటలోకి చూస్తూ ఉండిపోయాడు. ఏకాంత్ గుండె ఎందుకో దడదడ కొట్టుకుంది. సాకేత్ ఇలా అంటే, ఇంక సంకేత్-ఏమంటాడు? ఏకాంత్ ఆలోచిస్తూ సాకేత్ వీపునే చూస్తూ ఉండిపోయాడు.

"సాకేత్..."

సాకేత్ మెల్లగా తన అన్నవైపు తిరిగాడు. తదేకంగా అతని ముఖంలోకి చూశాడు. "నీకోసం.. నిన్ను సమర్థిస్తూ నీకే ఓటేస్తాను అన్నయ్యా!"

"థాంక్స్ సాకేత్... ఇది నాకు నువ్వు చేస్తున్న పెద్ద సహాయం. రంజనను చేసుకోలేకపోతే నీ అన్న ఏకాంత్ ఇంకెవర్నీ ఈ జన్మలో పెళ్ళి చేసుకోలేడు.."

"సంకేత్‌తో మాట్లాడావా?"

"లేదు. నా తర్వాత పెద్దాడివి నువ్వే. ముందు నీతో చర్చించాలనుకున్నాను. సంకేత్‌నీ కలుసుకుని సమస్య వివరిస్తాను. నువ్వు కూడా వాడికి ఒకమాట చెప్పు. ఫోన్ చేస్తుంటాడుగా!"

"చెప్తాను" సాకేత్ సాలోచనగా అన్నాడు. "అమ్మకూ మనకూ ఒక పెద్ద తేడా ఉంది. చెప్పనా అన్నయ్యా?"




"ఏమిటి?" ఏకాంత్ కళ్ళు చిట్లిస్తూ అన్నాడు.

"నువ్వూ నేనూ కలుసుకుని, ఒక ఒప్పందానికి వచ్చాం. నీకు అనుకూలంగా మాట్లాడమని నువ్వు అడిగావు. నేను నీతో చేతులు కలిపాను. కానీ.. అమ్మ తన మాటకు అనుకూలంగా మాట్లాడమని ఎవ్వర్నీ - నన్ను గానీ, సంకేత్‌ను గానీ, నిశితను గానీ అడగదు!

ఏకాంత్ ఆశ్చర్యంగా చూశాడు. నిట్టూర్చాడు. "ఔను... అమ్మ ఒక ఆదర్శానికి ప్రతిరూపం!"

సాకేత్ అవునన్నట్టు తల ఊపుతూ, వచ్చి తన కుర్చీలో కూచున్నాడు. ఏకాంత్ మొహంలో వచ్చినప్పటినుంచీ ఉన్నంత దైన్యతలేదు. సాకేత్ తనలో తను నవ్వుకున్నాడు. ఏకాంత్ ఎలాంటి పడవలో ప్రయాణం చేస్తున్నాడో తనూ అలాంటి పడవలోనే ప్రయాణం సాగిస్తున్నాడు. ఏకాంత్‌ని సమర్థించకుండా ఉండలేని, నిస్సహాయ స్థితి తనది!

ఏకాంత్ ఎదురీదుతున్నాడు నదిలో. తాను సుడిగుండాల మధ్య ఈదుతున్నాడు.

"సాకేత్..."

ఏకాంత్ వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"నీకో సలహా ఇస్తాను. నాలాగా తొందరపడి నువ్వు ఎవరి ప్రేమలోనో పడొద్దు. అమ్మ నిర్ణయించిన సంబంధం చేసుకో. ఎందుకంటే నాలాగే జీవన్మరణ సమస్యలో ఇరుక్కుంటావ్!" సాకేత్ కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

సాకేత్ మౌనంగా చూస్తూ ఉండిపోయాడు.

"ఎందుకు చెప్తున్నానంటే - కొడుకులందరూ ఒక్కలాగే అయిపోయారన్న దుఃఖంతో అమ్మ కుంగిపోతుంది".

●●●

ఏకాంత్ వచ్చివెళ్ళిన వారం రోజుల్లోనే అమ్మ నుండి సాకేత్‌కు పిలుపు వచ్చింది. 'కుటుంబ సభ' జరిగింది. ఏకాంత్ రంజనను చేసుకోవడం తప్పు కాదని తను వాదించాడు. సంకేత్ కూడా ఏకాంత్ ప్రేమను సమర్థించాడు. అమ్మ తన మనసులో భావాలు వెల్లడించింది. అయినప్పటికీ చివరికి ఏకాంత్ మాటే నెగ్గింది.

రాజవర్మ అత్యంత వైభవంగా చేసిన పెళ్ళిలో రంజనా, ఏకాంత్ భార్యాభర్తలయ్యారు. పెళ్ళి కార్యక్రమాలన్నీ ముగిశాక, సాకేత్ ముంబై చేరుకున్నాడు. నోనా అతని కోసం వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తోంది.

●●●

శాన్‌ఫ్రాన్సిస్కో నుండి వచ్చాక, సాకేత్‌కు ఒక పోస్టు సృష్టించి మరీ ప్రమోషన్ ఇచ్చాడు క్రేమర్. హోదా పెరిగింది. జీతం పెరిగింది. వాటితోబాటు, క్రేమర్‌కీ, నోనాకూ తను 'పడిన' రుణం కూడా పెరిగింది. నోనాకోసం, నోనా కోరినట్లు తనను క్రేమర్ రుణగ్రస్థుడిని చేస్తున్నాడా? తన ఆలోచనలకు తానే నవ్వుకున్నాడు సాకేత్. తనకు ఉద్యోగం రావడంలో, ప్రమోషన్ రావడంలో అన్నింటిలోనూ క్రేమర్ నిమిత్తమాత్రుడు! ఏకైక పుత్రిక, ఆరో ప్రాణం అయిన నోనాకోసం క్రేమర్ ఏదైనా చేస్తాడని తనకి తెలుసు. నోనాని బహుమతిగా ఇచ్చి, భార్య చనిపోయినప్పటి నుంచీ క్రేమర్ కేవలం నోనా కోసమే తన సర్వస్వాన్నీ అంకితం చేసేశాడు.

క్రేమర్ భార్య పూర్వీకులలో ఎవరో భారత సంతతికి చెందినవారనీ, తనకూ తన తండ్రికీ భారత్ అన్నా, భారతీయులన్నా అంతర్గతంగా ఆప్యాయత ఉన్నట్టుందనీ చెప్పింది నోనా. ఇండియాకు తిరిగి వెళ్ళాక పెళ్ళి చేసుకుంటావా అని శాన్‌ఫ్రాన్సిస్కోలో అడిగిన నోనా - ఆ విషయం తనకి గుర్తు చేసింది.

"అన్న అవివాహితుడుగా ఉంటే, తమ్ముడు పెళ్ళి చేసుకోవడం భారతీయ సంప్రదాయం కాదనీ, తన అన్న ఏకాంత్‌కి పెళ్ళయ్యేదాకా ఆగుదామనీ అన్నాడతడు. తనను ఆశ్చర్యపరుస్తూ అంగీకరించింది నోనా. ఇండియన్ కల్చర్ అంటే ఆమెకు ఇష్టమూ, గౌరవమూ ఉన్నాయని స్పష్టమైంది సాకేత్‌కు.

ఏకాంత్ రంజనను పెళ్ళాడ్డానికి అమ్మను ఒప్పించాక సాకేత్‌లో భయమూ, అనుమానమూ ప్రారంభమయ్యాయి. విదేశీయువతితో తన పెళ్ళికి అమ్మ ఒప్పుకోదన్న భయం అతన్ని పీడించసాగింది.

**(ఇంకావుంది)**

## సైనసైటిస్‌కు హోమియో చికిత్స

సైనసైటిస్...ఈపదం వర్షాకాలం, శీతాకాలంలో ఎక్కువగా వింటాం.సైనసైటిస్‌వస్తే ఆపరేషన్ తప్పని సరి, ఆ తరువాత కూడా మళ్ళీ వచ్చి దీర్ఘకాలికంగా బాధిస్తుం టుందని సైనసైటిస్ బాధితులు చెబుతుంటారు. అయితే సైనసైటిస్‌కు హోమియోపతిలో అద్భుతమైన చికిత్స ఉందని, శాశ్వత నివారణ పొందవచ్చని చెబుతున్నారు ప్రముఖ హోమియోవైద్యులు డాక్టర్ మురళీఅంకిరెడ్డి.

ప్రపంచవ్యాప్తంగా సైనసైటిస్‌బాధితుల సంఖ్య రోజు రోజుకూ పెరుగుతోంది. ఒక్కఅమెరికాలోనే 2.4కోట్లకు పైగా సైనసైటిస్ బాధితులున్నారని అధ్యయనాలు చెబుతున్నాయి. ఇక.. సైనసైటిస్ విషయానికి వస్తే ఇది 3 విభాగాలుగా ఉంటుంది.

1. **అక్యూట్ :** వచ్చి ఒకవారం రోజులు ఉంటుంది.

2. **సబ్ అక్యూట్ :** 4నుంచి 8వారాలు ఉంటుంది.

3. **క్రానిక్ :** ఇది దీర్ఘకాలిక సైనసైటిస్. 8-10 వారాలపైన ఉంటుంది. సైనసైటిస్ ఇన్ఫెక్షన్, వైరస్, బ్యాక్టీరియా వల్ల వస్తుంది. ముఖ్యంగా స్ట్రెప్టోకోకస్ న్యుమోనియా, ఇన్‌ఫ్లూయెన్‌జా వల్ల వస్తుంది. ప్రతి మనిషి తన జీవిత కాలంలో సైనసైటిస్ బారిన పడటానికి 90% అవకాశాలున్నాయి. అత్యధికంగా వెళ్ళే సర్జికల్ ప్రాసెస్‌లో ఈ సైనసైటిస్ కూడా ఒకటని ఒక పరిశోధనలో తేలింది. సుమారు 2 లక్షల కేసులు సర్జరీకి దారితీస్తాయి. ఏదేలా ఉన్నా సైనసైటిస్‌కు హోమియోలో అద్భుత చికిత్స ఉంది. పూర్తిగా మందుల ద్వారా నివారించడమే కాకుండా, వ్యాధి నిరోధక శక్తిని పెంచి మళ్ళీ మళ్ళీ రాకుండా నివారించ వచ్చు. ముఖంలో కళ్లదగ్గర, ముక్కు పక్క భాగంలో, ఎముకలు ఉండే సన్నని గాలితో నిండే ప్రదేశాన్ని సైనస్ అంటారు. ఈ భాగం ఇన్‌ఫెక్షన్లతో వాచిపోవడమే సైనసైటిస్. రకాలు: 1. ఫ్రంటల్ 2. పారా నాసల్ 3. ఎత్మాయిడల్ 4. మాగ్జిలరీ 5. స్ఫీనాయిడల్ ఇవి కూడి, ఎడమగా రెండు జతలుంటాయి.

**కారణాలు:** ఇన్‌ఫెక్షన్, బ్యాక్టీరియా, వైరస్, ఫంగస్, ఉపరితల శ్వాసకోశవ్యాధులు, ముక్కులోదుర్వాసన, ముక్కులో దుర్మాంసం పెరుగుదల, అలర్జీ, పొగ, విష వాయువుల కాలుష్యం, వాతావరణ కాలుష్యం, అకస్మాత్తుగా వాతావరణ మార్పులు, చలికాలం, వర్షా కాలం, గాలిలో తేమ ఎక్కువగాఉండే సమయం. నీటిలో ఈదటంవల్ల, జలుబు, గొంతునొప్పి, పిప్పిపన్ను, టాన్సిల్స్ వాపు, రోగనిరోధక శక్తి తగ్గిపోవటం.

**లక్షణాలు:** ముఖంలో భారంగా ఉంటుంది. తలనొప్పి బరువు, ముఖంలోవాపు, సైనస్‌భాగంలో నొప్పి, ముక్కు దిబ్బడ, ముక్కుదురద, నీరుకారడం, గొంతులోనికి ద్రవంకారడం, గొంతుగరగర, దగ్గు,జలుబు, చెవిలో చీము, కోపం, మానసిక స్థైర్యం కోల్పోవడం. అలసట, విసుగు, పనిపై ఆసక్తి తగ్గటం, హోరు దగ్గు.

**నిర్ధారణ:** ఎక్స్‌రే, సిటీస్కాన్, సైనస్‌భాగంలో నొక్కినపుడు నొప్పి కలిగితే కూడా సైనసైటిస్‌ను నిర్ధారించవచ్చు.

**దుష్పరిణామాలు:** దీర్ఘకాలికంగా సైనసైటిస్ వ్యాధితో బాధపడేవారు కనురెప్పల వాపు, కనుగుడ్లు పక్కకు జరిగినట్లు ఉండటం, కన్నునరం దెబ్బతిన్నపుడు చూపు కోల్పోవడం, వాసనలు తెలియకపోవడం, తరుచూవచ్చే జ్వరం, ఎదుగుదలలోపాలు కలుగుతాయి.

**సైనస్‌ను గుర్తించే ప్రశ్నావళి:** మీరు పది రోజుల కంటే ఎక్కువగా ఈ కింది వాటిలో దేనితోనైన బాధపడుతు న్నారా? అయితే మీకు సైనసైటిస్ ఉన్నట్లే. వెంటనే డాక్టర్‌ను సంప్రదించడం మంచిది.

1. ముఖబాగంలో నొప్పి - అవును / కాదు




**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**


2. తలనొప్పి - అవును / కాదు

3. ముక్కుదిబ్బడ - అవును/కాదు

4. చిక్కటి పసుపు, ఆకుపచ్చ ముక్కుస్రావాలు - అవును/కాదు.

5.జ్వరం (99-100 ఫారెన్‌హీట్స్) - అవును/కాదు.

6.నోటి దుర్వాసన - అవును/కాదు..

7. పంటినొప్పి - అవును /కాదు.

**నివారణ:** మీ నోటిని తరుచూ గోరు వెచ్చని నీటితో శుభ్రం చేస్తూండాలి. అలర్జీకి సంబంధించిన దుమ్ము, ధూళికి దూరంగా ఉండాలి. ఇల్లుపరిశుభ్రంగా ఉంచుకొని దుమ్మూ బురద లేకుండా చూసుకోవాలి. ఈత కొలనులో ఎక్కువ సమయం ఉండకూడదు. ఎందుకంటే ఆనీళ్లు ముక్కు లోపలి దళసరిచర్మాన్ని దెబ్బతీస్తాయి. ఎక్కువగా చల్లని పదార్థాలు, చల్లని గాలి తగలకుండా చెవిలో దూది పెట్టుకోవడం, వేడి ఆవిరి పట్టడం వల్ల దీన్ని కొంత వరకు నివారించవచ్చు.

**హోమియోచికిత్స:** హోమియోపతిలో ఆపరేషన్‌లేకుండా మంచి మందులున్నాయి. వాటిలో ముఖ్యంగా కాలిబైక్, కాలిసల్ఫ్, హెపార్‌సల్ఫ్, మెర్క్‌సాల్, సాంగ్న్యూరియా, లెమ్‌నార్‌మైనార్, స్పైజిలియా వంటి మందులు మంచి ఫలితాన్నిస్తాయి.



## సయాటికా (గృధ్రసీ వాతము)

ప్రస్తుత పరిస్థితిలో మానవుని జీవితం వాల యాంత్రికం గా మారిపోయింది. ముఖ్యంగా ఆహారపుఅలవాట్లు, దిన చర్య స్వప్నవిపర్యయం (పగటినిద్ర, రాత్రి సమయానికి నిద్రపోకపోవటం) లాంటి విషయాలలో అనేక మార్పులు రావటం వలన, ఆందోళన, మానసికఒత్తిడి లాంటి సమస్యల వలన మానవులనేక వ్యాధులబారిన పడుతు న్నారు. అందులో అతి ముఖ్యమైనది (నడుమునొప్పి) కటిశూల. నూటికి 90మంది తమ జీవితకాలంలో ఎప్పుడో ఒకసారి ఈనడుమునొప్పిసమస్యతో బాధ పడుతున్నారు. ఆయుర్వేద శాస్త్రంలో చరక, సుశ్రుత, వాగ్భటులు ఈ సమస్యను గృధ్రసీవాతం(సయాటికా)గా పేర్కొంటూ ఎంతో విపులంగా వివరించారు.

దీనికి సాధారణ కారణాలు పరిశీలించినట్లయితే... ఎక్కువగా ఒకే పొజిషన్‌లో కూర్చోవటం, స్థూల కాయం, అధికశ్రమతో కూడిన పనులు ఎక్కువ సేపు చేయటం, అధిక బరువులను మోయటం, ఎక్కువ దూరం ద్విచక్ర వాహనాలు, కార్లలోప్రయాణించటం, కొన్ని దీర్ఘకాలిక వ్యాధులువలన, కొన్ని వంశపారం పర్య వ్యాధులవలన, మరికొన్ని రోడ్డుప్రమాదాల వలన ఈ నడుము నొప్పి సమస్య వస్తుంటుంది. ముఖ్యంగా పైన వివరించిన కారణాలవలన శరీరంలో వాతప్రకోపంజరిగి, ముందుగా పిరుదులకు పైభాగాన స్తబ్ధతను, నొప్పినికలిగించి తరువాత కటి ప్రదేశం (నడుము), తొడలు, మోకాళ్ళు, పిక్కలు, పాదాలలో క్రమంగా నొప్పి కలుగుతుంది. దీనినే గృధ్రసీవాతాము (సయాటికా) అని అంటారు. ఈ సమస్య శీతాకాలంలో ఎక్కువ అవుతుంది. ముఖ్యంగా నడుముకు సంబంధించిన ఎల్4-ఎల్5, ఎస్1-ఎస్2 వెన్నుపూసల మధ్యగల సయాటికా అనే నరంపై ఒత్తిడి పడటం వల్ల ఈ నొప్పి వస్తుంది.

**డిస్క్‌లో వచ్చేమార్పులు:** ఈ వ్యాధిలో వెన్నుపూసలమధ్య ఉండే డిస్క్‌లో కొన్ని మార్పుల జరుగుతాయి. అవి డిస్క్ మీద ఒత్తిడి పెరగటం, వాపురావటం లేదా డిస్క్‌కి రక్త ప్రసరణ సరిగా లేకపోవటం, అరిగిపోవటం అనే సమస్యల వల్ల ఈ నొప్పి వస్తుంది. డిస్క్‌లో వాపు వస్తే దానిలోఉండే చిక్కనిద్రవం బయటకు వచ్చి మేరుదండం లేదా దాన్నుంచి వచ్చే నరాలపై ఒత్తిడి కలిగించటం వల్ల నొప్పి వస్తుంది.

**లక్షణాలు:** నడుములో నొప్పి కలగటం, వాపు, కొంచెం శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగటం, ఈ నొప్పి సూదులతో గుచ్చినట్లుగా, ఒక్కోసారి తిమ్మిర్లు, మంటలతో కూడి ఉంటుంది. సమస్య తీవ్రమైనది అయితే స్పర్శహాని కూడా కలుగవచ్చు. ఒక్కో సారి మల మూత్రాలమీద నియంత్రణకూడా పోయేప్రమాదంఉంది. వెన్ను నొప్పి బాధ అనగానే సాధారణంగా పెయిన్‌కిల్లర్స్ తో కాలయాపన చేస్తుంటారు. దీనివల్ల తాత్కాలిక ఉప శమనం కల్గుతుంది. కాని మలబద్ధకం, జీర్ణా శయ సమస్యలు మొదలవుతాయి. కావున ఇలాంటి సమస్యల ను ప్రారంభదశలోనే గుర్తించి, జాగ్రత్త పడటం వల్ల ఈ వ్యాధిని సమూలంగా నయం చేయవచ్చు.

**ఆయుర్వేదచికిత్స:** ఆయుర్వేదంలో ఇలాంటి సమస్యల కు సమగ్రమైన చికిత్సాపద్ధతులుఉన్నాయి. అందులో **శమన చికిత్స:** ఇది దోషాలను బట్టి అభ్యంతరంగా వాడే ఔషధ చికిత్స ఇందులో వేదన, కాయకంగా ఔషదాలు ఉంటాయి. అలాగే వాతహర చికిత్సా పద్ధతులుంటాయి.

**శోధనచికిత్స:** శమన చికిత్స వలన ఒక్కోసారి మళ్ళీ వ్యాధి తిరగబెట్టవచ్చు. అందుకే ఆయుర్వేదంలో పంచకర్మ అనే ఒక ప్రత్యేక చికిత్సా పద్ధతి ఉంది. ఈ చికిత్సా పద్ధతి ద్వారా ప్రకోపించిన వాతాది దోషాలను సమూలంగా తగ్గించవచ్చు.

**1.స్నేహకర్మ:** ఈ ప్రక్రియ ద్వారా వెన్నెముకలోని వెన్ను పూసల మధ్య స్నిగ్ధత్వాన్ని పెంపొందించి, తద్వారా జాయింట్స్‌లో కదలికలను తేలికగా చేయవచ్చును.

**2.స్వేదకర్మ:** ఈ పద్ధతిలో గట్టిగా అతుక్కొనిఉండే జాయింట్స్ ను మృదువుగా అయ్యేటట్లు చేయవచ్చును. కటివస్తి. ఈ ప్రక్రియ ద్వారా అరిగిపోయిన మృదులాస్థికి రక్త ప్రసరణను పెంచి తద్వారా నొప్పి తీవ్రతను తగ్గించ వచ్చును. అలాగే సర్వాంగధార, వస్తికర్మ అనే విశిష్ట చికిత్సా పద్ధతుల ద్వారా నాడీ కణాలలో కలిగిన లోపాల ను సరిచేయువచ్చు అదేవిదంగా ప్రకోపించిన వాతాన్ని సమస్థితికి తీసుకురావచ్చు.

జాగ్రత్తలు:సరిఅయిన పోషకఆహారాలు తీసుకోవడం. నిదాన పరివర్జనం అనగా పైన చెప్పిన ప్రత్యేక వ్యాధి కారణాలను మళ్లీ చేయకుండా జాగ్రత్త పాటించినట్ల యితే ఈ సమస్యనుంచి శాశ్వతవిముక్తి పొందవచ్చును.


**డా. లక్ష్మి** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

# అచ్చం నీలాగే

## -చెంగలవల కామేశ్వరి



**మనవరాలికి ఇవాళ మొదటిరాత్రిట! అందరు హడావిడిగా ఉన్నారు. కరుణ మాత్రం ఒంటరిగా సోఫాలో పడుకుని ఆలోచిస్తోంది. తన అవసరం ఎవరికీ లేదులే! అన్నట్టుగా. ఆ చేసేదేదో ఇంట్లోనే చేయొచ్చుకదా! ఊహు! చెయ్యరు. ఈ లంకంత కొంపలో వాళ్ళకి ప్రైవసీ ఉండదుట!**

**అది కూడా, మనవరాలు పింకి సెలెక్ట్ చేసుకున్న, రిసార్ట్‌లోనే! ఇదేంటి? అంటే, ఇవన్నీ మీ రోజులు కావు! పిల్లేదో సరదా పడింది. అది కూడా అర్థం కాదు మీకు! అని అసహనంగా అంటున్న కోడలిని చూసి ఒళ్ళు మండింది.**

ఇదేం సరదానే! దంపత తాంబూలాలు, ఆశీర్వచనాలు, అలంకరణలు, ఆడాళ్ళు లేకుండా ఎక్కడో కార్యం చేయడం? తర్వాత ఎలాగూ వాళ్ళిద్దరే ఉంటారు. కానీ ఎవరయినా ఇలా చేస్తారా? అయినా నువ్వు మీ ఆయన చక్కగా ఇంట్లో, అందరు చెప్పినట్లు వినలేదా! అని తను అనగానే 'చాల్లెండి, మాదో కార్యం? వేసవి కాలం, కరెంటు లేని చీకటిగది, హరికేన్ లాంతరు, అగరొత్తుల పొగ చచ్చాం ఊపిరాడక! దానికితోడు, మేమేం మాట్లాడుకుంటామో! విందామని మా గది తలుపులదగ్గరే అమ్మలక్కలు, ఎప్పుడు తెల్లారుతుందా! అన్నట్లు మేము, ఏదో మొక్కుబడిలా అఘోరించింది. ఇలా మా కార్యం గురించి లేదా ఏదో ఒకటి చెబుతూ పిల్లల మూడాఫ్ చేయకండి. అసలే ప్రేమించుకున్న జంట. మీ మాటలకి చిన్నబుచ్చుకుంటే, అందరు మిమ్మల్నే అంటారు! అని వెళ్ళిపోయింది కోడలు శారద.

తమ రోజుల్లో అదేంటోకూడా తెలీదు. ఏ అమ్మమ్మో పక్కకు తీసుకెళ్ళి, పడగ్గదిలో మొగుడున్నాడని, అతనికి కోపం రాకుండా మసలుకోవాలని గుసగుసగా చెప్తే, భయం, సిగ్గుతో తల వంచుకుని విని ఆచరించింది. తనంత కాకపోయినా, అంతో ఇంతో తన కూతుళ్ళు కూడా పెద్దలమాట విన్నారు. మరి! ఈ తరం పిల్లలు అందరు, తన మనవరాలిలాగే, అన్నీ బాహాటంగా మాట్లాడేస్తుంటే, వింతగా ఉంది. తల్లిదండ్రులు కూడా అదేదో సాధారణం అన్నట్లు వింటున్నారు. తనకి ఆశ్చర్యంగా ఉంది. తానే మైనా అంటే, ఆ రోజులువేరు! ఈ రోజులు వేరులే! అంటారు. అసలు ఆ రోజుల్లో అయినా ఈ రోజుల్లో అయినా, ఆకారాలు, అనుభవాలు ఒకటే కదా? తనువుకి పులకింతలు లేవా? పురుటి నొప్పులు లేవా? ఆహార్యం మారుతోంది. వస్త్రధారణవల్ల అంతరంగాలు అనుబంధాలు అభిరుచులు మార్చుకుంటూ కాలం మారిపోయింది అంటారు.

పెళ్ళిచూపులకు వచ్చిన వ్యక్తిని మళ్ళీ పెళ్ళి పీటల మీద చూడటం, జీలకర్ర బెల్లం అయ్యాక పురోహితుడు ప్రథమ వీక్షణం చేయమని చెప్పడం, ఒకరి కళ్ళల్లోకి ఒకరిని చూడమని చెబితే, ఆ చూసుకున్న చూపుల్లో ఎంత ఇష్టముంటుందో, ఎంత పవిత్రత ఉందో, ఇప్పటి పిల్లలకి ఏమి తెలుస్తుంది? తొలి స్పర్శలో ఎంత కరెంటు ఉంటుందో! పెళ్లి అయ్యాక భర్త ద్వారానే ఆ కర స్పర్శ ఎలా ఉంటుందో తెలిస్తే, అదెంత బాగుంటుందో ఇప్పటి జనాలకేం తెలుసు? ఈడు రాక ముందు నుండే అందరితో కరచాలనం చేస్తూ, బైకుల మీద తిరుగుతూ, 'ఆడా, మగా, 'తేడా' లేకుండా, అధునాతనంగా తిరిగేవాళ్ళకి చూపు, స్పర్శ, మాట ఈ మూడు ఎంతో పవర్‌ఫుల్ అన్న విషయం ఎలా తెలుస్తుంది? ఈ మూడు అపరిచితులతో చేయకూడనివి.

చేస్తే వాటి ప్రభావం వలన, ప్రతి వారు దగ్గర అయిపోయే ప్రమాద కారకాలు అని కూడా చాలా మందికి తెలియదు. ఇలా అందరితో ఒకేలా ఉండటం, అలవాటై



పోతే, ఇక 'భార్యాభర్తలు ఒకరికొకరు' అనే ముంటుంది? పెళ్లి ఓకే అనుకోవడం తరువాయి పగలు, రాత్రి, ఒకటే ఫోన్లు! నిశ్చయ తాంబూలాలు అవడమే తరువాయి 'షికార్లు' మొదలు! అసలు అలా అన్నీ, ముందే మాట్లాడేసుకుంటే మొదటిరాత్రి ఒకరి గురించి మరొకరు తెలుసుకోవడానికి ఇంకేముంటుంది? దాంపత్యంలో కొత్తదనం ఏముంటుంది? కానీ చిన్న వయసులో పెళ్లి అంటే తెలీకుండా జరిగిపోయినా, తన భర్తతో గడిపిన ప్రతి క్షణం మధురమే! అసలు తన 'తొలిరాత్రి' గుర్తుకొస్తే నవ్వు వస్తుంది. ఏమీ తెలియని అమాయకత్వంతో భర్త రాజశేఖరాన్ని తను ఎన్ని తిప్పలు పెట్టిందో! మనసు పొరలలో పదిలపరచుకున్న జ్ఞాపకాలు దొంతరలుగా రాసాగాయి.

•••

ఆరోజు తెల్లవారుజామున తను శ్రీమతిగా మారింది. ఇంటిపేరు మారిపోయిందని



అందరు వేళాకోళం ఆడితే, ఉక్రోషం వచ్చి, వాళ్ళందరూ తనని దూరం చేస్తున్నారనుకుని ఏడ్చింది కరుణ. తండ్రి దగ్గరకు తీసుకుని ఓదార్చాడు. ఇంటిపేరు అందరికీ మారుతుంది. మారితే మాత్రం! ఇది నీ పుట్టిల్లు. అందులో మార్పేం ఉండదు అని సముదాయించాడు.

ఆ రోజు రాత్రే శోభనం. ఆ విషయం తనకి తెలియదు కూడా. సాయంకాలం తలంటు పోస్తుంటే ఎందుకో అనుకుంది. కానీ మళ్ళీ మల్లెపూల జడ కుట్టడానికి మేనత్త తయారైతే గొడవపెట్టింది తను. పూలజడ దేనికి? మోయ లేక చస్తున్నాను. పెళ్లికూతురిని చేసిన దగ్గర నుండి ప్రతిరోజూ పూలజడవేసి చంపుతున్నారు అని పేచీ పెడుతుంటే, ముసిముసిగా నవ్వు కుంటూ ఈరోజు ఒక్కరోజే మేము జడ వేయడం! మీ ఆయనకి మల్లెపూలు ఇష్టమట. నీ జడ అంటే ఇష్టమట! ఇక రోజుకోరకం పూలతో మీ ఆయనే వేస్తాడు నీ జడ! అనగానే, అక్కడున్న అందరు ఒకటే నవ్వులు. పెద్దమ్మ




కూతురు లలిత అయితే 'మీ ఆయనతో ఏం మాట్లాడావో రేపు నాకు చెప్పాలి సరేనా?' అంది. ఎందుకు? ఆయనతో నేనెందుకు మాట్లాడ తాను? అని తను అమాయకంగా ఎదురు ప్రశ్న వేసింది.

పిచ్చిమొద్దు! రాత్రంతా నువ్వేగా ఉండేది అంటుండగానే, పురోహితుడు రమ్మంటున్నాడన్న పిలుపుతో తీసుకెళ్ళి రాజశేఖరం పక్కన కూచో పెట్టారు. తన మనసులో ఎన్నో శంకలు, తనని చూసి రాజశేఖరం కళ్ళల్లో మెరుపులు, ఆ చూపుకే ఏదోలా అనిపించి, మేను ఝల్లుమంది తనకి. మిసమిసలాడే తెల్లని జార్జెట్‌చీర కట్టారు. తెల్లని జాకెట్, తలలో మల్లెలు, పూలజడ తెల్ల రాళ్ల నెక్లెస్. పిన్ని రాసిన సెంటు, కళ్ళకి కాటుక, కల్యాణం బొట్టు, బుగ్గన చుక్కతో చాలా బాగుంది అని అందరు పొగిడిన పొగడ్తలన్నీ, రాజశేఖరం కళ్ళల్లో, కనిపించి ఏదో గిలిగింతగా అనిపించింది.

పురోహితుడు ఏవో మంత్రాలు చదువు తున్నాడు. మధ్యలో గర్భాదానం అంటుంటే రాజ శేఖరం ఏంటో చిలిపిగా నవ్వినట్లనిపించింది. తనకేమీ అర్థంకాలేదు. కానీ ఎంగిలి తినిపించే టప్పుడు మంచం మీద కూర్చోపెట్టి తామిద్దరిచేత దంపత తాంబూలం ఇప్పించేప్పుడు అతని వేళ్ళ స్పర్శ జివ్వునలాగి గుండెకి కొట్టినట్లయి తుళ్ళిపడింది. అది గమనించిన అతని మోములో చిరునవ్వు సిగ్గుపడేలా చేసింది, అందరినీ బయటకిపంపి, తనను పక్కకు పిలిచి అమ్మమ్మ తనని దగ్గరకు తీసుకుని, బంగారు తల్లివికదూ, మీ ఆయనకి ఎలా ఇష్టమయితే అలా ఉండాలి? ఎదురు చెప్పకూడదు. అడ్డు చెప్పకూడదు. గొడవచేస్తే మమ్మల్ని అంటారు. మా అందరికీ మంచిపేరు తేవాలి! సరేనా అని చెప్తే సరే, అని తలాడించింది కరుణ.

గదిలోకివెళ్ళాక అమ్మమ్మ చెప్పినట్లే పాల గ్లాసు ఇచ్చి కాళ్ళకు నమస్కరించింది. రాజశే ఖరం అయ్యో ఎందుకు? అంటూనే లేవదీసి, పద్ధతి ప్రకారం కొంగుకి ఏదోకట్టి దగ్గరకుతీసు కున్నాడు. మంచంమీద ఇద్దరూ కూర్చున్నాక గ్లాసులోని పాలు కొంచెంతాగి కరుణనికూడా తాగమని ఇచ్చాడు. కరుణా, నిజంగా నేను నీకు నచ్చానా? అనడిగితే, ఇష్టమే! అన్నట్టు తలూపింది కరుణ. పాలగ్లాసు పక్కనపెట్టి అలా కాదు నోటితో చెప్పాలి ఎందుకు నచ్చానో! అంటున్న రాజశేఖరాన్ని సిగ్గుగానే కనులెత్తి చూసింది. పచ్చగా బలిష్టంగా చిక్కని నల్ల మీసకట్టుతో, ఒత్తైనక్రాపుతో చాలా అందంగా ఉన్న భర్తని చూసి లోలోనే గర్వంగా అనిపిం చింది. అయినా బింకంగా ముందు మీరు చెప్పండి అంది కరుణ. అహ! గడుసుదానివే అని కరు ణని మరింత దగ్గరగా తన ఒడిలోకి లాక్కుని సుతారంగా చెంపపై ముద్దాడి నేనైతే నిన్ను చూడగానే నువ్వు నాకు చాలా నచ్చావు. ఈ బంగారుబొమ్మ తప్ప మరెవరూ వద్దని, కచ్చి తంగా చెప్పేశాను అన్నాడు. అప్పటికే మైకం కమ్మినట్లయింది కరుణకి. పదారేళ్ళ తొలి ప్రాయంలో మొదటిసారి పురుష స్పర్శ ఆమెని ఎక్కడికో తీసుకెళ్ళింది. తన చెంపపై అతని తొలిముద్ర మాటరానట్లు చేసింది. అయినా తమాయించుకుని మీరుకూడా బాగున్నారు కదా' చాలా మంచివారని నాన్నగారు చెప్పారు. అందుకే చేసుకున్నాను. చిలకపలుకుల్లా పలికింది.

కరుణ జవాబుకి పొంగిపోయి, ఇంకా దగ్గ రకు తీసుకుని ఈసారి ఇంకొంచెం అడ్వాన్స్ అయ్యాడు. ఆమె మోముని చేతుల్లోకి తీసు కుని, ఎర్రని పెదాలను చుంబించాడు. విడిపిం చుకుందామని ప్రయత్నిస్తే, వదిలినట్లే వదిలి, మళ్ళీఅలాగే ముద్దు పెట్టుకుంటుంటే, అతని చేతుల్లోఉన్న కరుణకి నరాలన్నీ జివ్వుమన్నాయి. మనసు, శరీరం గాల్లోతేలుతున్నట్లు అనిపిం చింది. ఆటోమాటిక్‌గా అతని చేతుల్లో మైనపు బొమ్మలా మారిపోయింది. అసలే పడుచు ప్రాయం! భార్యతో తొలిరాత్రి ఆనందాలు జుర్రు కోవాలని ఆరాటపడే ఇరవై నాలుగేళ్ళ కోడె వయసు అతన్ని ప్రేరేపించాయి. ఇంకా మాట్లాడే అవకాశం లేదన్నట్లు కరుణని తన బిగికౌగిలిలో బంధించి, తన చేతలకి, ముగ్ధమందారంలా పరవశిస్తూ సోలిపోతున్న కరుణని, పొదివి పట్టుకుని, గదిలో లైటుఆర్పి మంచంపైన కరు ణని పడుకోబెట్టి, పక్కనే తనుపడుకొని, తనకభి ముఖంగా తిప్పుకొని ఎలా ఉంది? నీకేమీ ఇబ్బంది లేదుకదా అనడిగాడు.

ఇబ్బందా దేనికి? అనడిగింది కరుణ. అదే ఇలా నిన్ను ముద్దులుపెట్టుకోడం నీకు ఇష్ట మేనా! అని అన్న అతని మాటకి బదులుగా "మా అమ్మమ్మ చెప్పింది. మీరేమి చేసినా ఏమి అనొ ద్దని, చెప్పినట్లు వినమని." కరుణ జవాబుకి ఖంగుతిన్నాడు రాజశేఖరం. 'అయ్య బాబోయ్ ఇదేంటి? ఇలాంటి అమ్మమ్మకూచితో, తన మొదటి రాత్రి ఎలా మొదలుపెట్టాలో? తనకన్నా చిన్న పిల్ల అయినా, ఏపుగా, పుష్టిగా బాగుంది. వాళ్లకి లేని అభ్యంతరం మనకెందుకు? అంటే కరుణ బాగా నచ్చి చేసుకున్నాడు. కానీ అన్నెంపున్నెం తెలియనిదాన్ని శృంగారరాజ్యంలోకి ఎలా లాగాలి? అనుకుని మనసులోనే వాపోయాడు. 'సరే ఏదో ప్రయత్నం చేయాలి కదా! అనుకుని, కరుణని దగ్గరకు పొదువుకొని, మళ్ళీ ఒకసారి ముద్దు పెట్టుకుని, చూడు అమ్మమ్మ చెప్పిందని, అన్నిం టికి సైలెంట్‌గా ఉండటం కాదు. 'నీకేది కావాలో అది అడుగు? నీకు ఏది నచ్చదో? అది నిర్భయంగాచెప్పు! నేను ఏమీ అనను. సరేనా అని అనునయిస్తూ, అవును నీకు పిల్లలు అంటే ఇష్టమేనా? అనడిగాడు.

దానికి కరుణ ఉత్సాహంతో 'ఓ నాకు చాలా ఇష్టం!' అంది. 'సరే మనకి ఎంతమంది పిల్ల లుంటే బాగుంటుంది?' సరదాగా అడిగాడు. చేతులతో ఆమె తనువంతా తడుముతుంటే కొన్నిచోట్ల కరుణ చేతులు వారిస్తున్నాయి. భర్త అడిగిన దానికి ఇద్దరు చాలుకదా అంది. హే ఇద్దరేమి సరిపోతారు? మనకి కనీసం డజను

మంది ఉండాలి! అన్నాడు. అమ్మో, నేను కనలేను బాబు! అంది గోముగా. తన మెడ కిందుగా జారబోతున్న అతని చేతిని తప్పిస్తూ, మరి మనకి పిల్లలు ఎలా పుడతారు? అన్న మాటకి 'ఏముందీ సంసారం చేస్తే' అంది టక్కున. అయితే నీకు తెలుసా? సంసారం ఎలా చేయాలో! అనడిగాడు. ఏమో అందరు ఎలాగుంటారో మనమూ అంతేగా! అంది. అదే ఎలా? అనడుగుతుంటే, కంగారుగా 'ఛీ ఏంటది? అని చిరాగ్గాలేచింది తను. అప్పటికే ఊడిపోయిన చీర, బ్లౌజు సరిగ్గా సర్దుకుంటూ.

ఆమె కంగారుకి తను ఉలికిపడినా, ఇటువంటి విషయాలకు 'పూర్తిగా కొత్త!' చిన్నవయసు! త్వరపడకూడదు అనుకున్నాడు రాజశేఖరం. 'సరే ఏమి చేయనులే! కూర్చో! మరి పిల్లలంటే ఇష్టం అన్నావు కదా! అలా వెళ్ళిపోతే ఎలా పుడతారు మనకి? అన్నాడు. కవ్వింతగా దగ్గరగా లాక్కుని. మరి ఇలాచేస్తే ఎలా? అసలిలా కాదేమో? అంది అతనేదో తప్పుచేసినట్లుగా. మరి? ఎలా? అని ప్రశ్నించిన భర్తకు ఏం చెప్పాలో తెలియక, ఇలా మాత్రం కాదు అంది.

లేదు! ఇలాగే నేను చెప్పినట్లు వింటేనే మనకి పిల్లలు! మనం కూడా ఇలాగే పుట్టాం అంటున్న రాజశేఖరం మాటలకి, 'ఏమో నాకు భయమేస్తోంది! మీరు చేసేది నాకు నచ్చటం లేదు! మా అమ్మమ్మ దగ్గరకు వెళ్ళిపోతాను! అని అంటున్న తనని సరే! నిన్నేమి చేయను. ముట్టుకోను కూడా సరేనా! నువ్వు మామూలుగా పడుకో! అని అనునయించి కబుర్లలో పెట్టాడు. తనకి నిద్ర వచ్చాక, నడిరాత్రి వేళ మళ్ళీ, తనని నిద్రలోనే రెచ్చగొట్టి, తన చేతలతో కోరికలు రగిలించి, తనకు అనువుగా మార్చుకుని, భయాలు, బాధలు అన్ని భావోద్రేకంలో మురిపించేసి, తనదాన్ని చేసుకున్నాడు. అలా అమాయకంగా మనశ్శరీరాలు అర్పించుకుని పూర్తిగా అర్ధాంగి అనిపించుకుంది. అప్పటి ఆడపిల్లలకి, ఇప్పటి ఆడపిల్లలకి ఇంత తేడా ఏమిటో? పెంపకాలలోనే తేడా! సర్లే, వాళ్ళ అమ్మానాన్నలకి లేని బాధ! నాకెందుకు? ఏదో ఏడవనీ!

చక్కగా ప్రియాంక అన్న పేరు 'పింకి' అని మార్చేశారు. పెద్దగా ఉన్న జడల్ని పోనీ టెయిల్‌గా మార్చేశారు. ఇంగ్లీషు మీడియమే కానీ తెలుగులో మాట్లాడ్డం కూడా ఇంగ్లీష్ స్టయిలే. తన కొడుకు కోడలే అలా మార్చేశారు. ఇంకా దాన్ని అనుకోవడందేనికి? తన పిల్లల వరకు తనఇష్టం! మనవలు, మనవరాళ్ళు, తన మాట వినలేదని అనుకోవడం దండగ! అనుకుని నిట్టూర్చింది కరుణ. అలా అనుకుంటూనే నిద్రలోకి జారింది. 'బామ్మా! బామ్మా! అని ప్రియాంక గొంతు వినిపించి, దిగ్గున లేచింది కరుణ.

ఎదురుగా అపరంజి బొమ్మలా 'ప్రియాంక తెల్లని జార్జెట్ చీర, దానిపైన వెండి బంగారు జరీతో కుట్టిన లతలు, పూలతో అందంగా కుట్టిన డిజైన్ అలాంటిదే బ్లౌజ్ వేసుకొని, తెల్లని మల్లెలతో కుట్టిన పొడవాటి జడ కల్యాణం బొట్టు, కళ్ళకి ఒత్తుగా కాటుక, బుగ్గన నల్లని చుక్క, పచ్చని పాదాలకి, చేతులకి పండిన ఎర్రని గోరింటాకుతో శోభనం పెళ్ళి కూతురుగా, మనవరాలిని చూడగానే కరుణ మనసు సంతోషంతో ఎగిసిపడింది. నా తల్లే! అని దగ్గరకు తీసుకున్న కరుణని చూసి, బామ్మా, ఏంటి కోపం వచ్చిందా? అలిగావా? అని కితకితలు పెట్టింది ప్రియాంక.

ఏమీ లేదులే! నీ ఇష్టం! మంచిగా, పిల్లాపాపలతో హాయిగా ఉండమ్మ అంటున్న కరుణను చూసి, ప్రియాంక నీకో రహస్యం చెప్పనా అని అక్కడున్న అందర్నీ ఉద్దేశించి, మీ అందరు పదండి! మా బామ్మతో మాట్లాడుకుని వస్తాను! అంది నవ్వుతూ. 'అందరూ వెళ్ళిపోయాక, బామ్మ చేయి నిమురుతూ బామ్మా! నేను ఫస్ట్ నైట్ ఇంట్లో వద్దన్నానని, ఏదో అనుకుంటున్నావు కదా! అసలు సంగతి ఏమిటంటే, 'ఇది ఎవరికైనా, జీవితంలో ఒక్కసారే వస్తుంది కదా బామ్మా! అందుకే అదెలా జరుపుకోవాలో, ఆ రోజుల్లో మీకు తెలీదు. ఏదో పెద్దాళ్ళు చెప్పినట్లుగా, మీకు ఇబ్బందిగా ఉన్నా, అన్ని భావాలూ మీలోనే దాచుకుని మామూలుగానే ఉండేవారు.

ఇప్పుడు మాకు ఏది తినాలంటే, అదే తింటున్నాం. ఏది కట్టుకోవాలంటే, అదే వేసుకుంటున్నాం. ఎలాంటివాడు కావాలో? వాడినే సెలెక్ట్ చేసుకుంటున్నాం. ఎలా ఎంజాయ్ చేయాలో ప్లాన్ చేసుకుంటున్నాం. భావ స్వాతంత్ర్యం, ఆర్థిక స్వాతంత్ర్యం ఉంది. మానసిక పరిపక్వత వచ్చాకనే పెళ్ళిళ్ళు చేసుకుంటున్నాం. అందుకే నేను హేమంత్ మాకు ఎంతో అపురూపమైన మా మొదటిరాత్రి ఆరుబయట, పున్నమివెన్నెలతో, ఇలా ప్రత్యేకంగా తయారై, 'మేమిద్దరంతప్ప, మరెవరూలేని, ఏకాంత ప్రశాంత, ప్రదేశంలో ఆ నింగి, నేల, ఆకాశం, చుక్కలు, చంద్రుడు, వెన్నెల, గాలి సాక్షిగా, మా ఆయన గెస్ట్‌హౌస్ పైన మేం ఏర్పరుచుకున్న ఏర్పాట్లతో మా మొదటిరాత్రి జరుపుకుంటున్నాం. అందరికీ 'రిసార్ట్' అని చెప్పాం. కానీ రిసార్ట్‌లో కాదు. అని సిగ్గుల మొగ్గలా చెప్తున్న ప్రియాంక మాటలు వింటూ, ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బు అయింది కరుణ.

నిజమా! అనడుగుతున్న బామ్మ చెంప మీద చిటికవేసి, అవును బామ్మా! నా చిన్నపుడు నువ్వు మీ అక్కతోనో, ఎవరితోనో చెప్తుంటే రహస్యంగా విన్నాను. తాతయ్యకి అలా ఇష్టమని, మీ ఇంట్లో వాళ్ళందరూ యాత్రలకు వెళ్ళినప్పుడు, తాతయ్య నువ్వు అలా హేపీగా, గడిపేవారని విన్నాక అది నా మనసులో నాటుకుపోయింది. అందుకే! ఈ బామ్మకి మనవరాలుగా అచ్చం నీలానే!... అని నవ్వుతున్న ప్రియాంక మాటలకి విస్తుపోతూనే మనవరాలిని అక్కున చేర్చుకుంది. ఎంతయినా జీన్స్ ఎక్కడికి పోతాయి..? తాతగారి ఇష్టాలన్నీ పుణికి పుచ్చుకున్నావే! అనుకుంది కరుణ.

**సెల్: 98493 27469**

## సెంటిమెంట్‌తో పడేశాడట

**సం**పత్ నందికి తమన్నా సెంటిమెంట్ ఉందట! ఆమెతో చేసిన రెండు సినిమాలు మంచి హిట్ సాధించడంతో దర్శకుడికి ఈ హీరోయిన్ సెంటిమెంట్ అయిపోయిందట! తను గోపిచంద్‌తో చేయబోతున్న సినిమాలో తమన్నాతో చిన్న క్యారక్టర్ కానీ, ఐటెంసాంగ్ కానీ చేయించాలని భావించాడట సంపత్‌నంది! తన సెంటిమెంట్ గురించి తమన్నాకు చెప్పి ఈ సినిమా చేయమని అడగడంతో తమన్నా కూడా ఓకే అనేసిందట! ఓ పక్క హీరోయిన్‌గా దూసుకుపోతున్న తమన్నాతో చిన్న రోల్ లేదా ఐటెంసాంగ్ చేయించడం అంటే ప్రస్తుత పరిస్థితుల్లో కాస్త కష్టమే! కాకపోతే సంపత్‌నంది తన సెంటిమెంట్ చెప్పడంతో ఆ మాటకు పడిపోయి తమన్నా ఓకే చెప్పేసిందని అంటున్నారు సినీ జనాలు.






# 'విస్తరణ' వ్యూహం ఫలిస్తుందా?

**ఉత్తరప్రదేశ్ ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని మోదీ మంత్రివర్గాన్ని విస్తరించారు. వ్యూహం తారుమారైతే ఏమిటి పరిస్థితి?**

**ఇటీవల కేంద్ర మంత్రి వర్గాన్ని పునర్వ్యవస్థీకరించారు. ప్రధానమంత్రి నరేంద్ర మోదీ చెప్పినట్టు మంత్రివర్గాన్ని 'విస్తరించారు'. ఉత్తరప్రదేశ్ శాసనసభ ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని ఈ విస్తరణ జరిపినట్టు కొన్ని సూచనలను బట్టి అర్థమవుతోంది. కుల, ప్రాంతీయ వర్గాల మధ్య సమతూకం తీసుకు రావడమే ఈ విస్తరణ ధ్యేయమని కొందరు పరిశీలకులు వ్యాఖ్యానించారు.**

2014లో ప్రధాని పదవి చేపట్టిన తరువాత మోదీ చేపట్టిన అతి పెద్ద చర్య ఈ మంత్రివర్గ విస్తరణే అనుకోవచ్చు. 2014 మే తరువాత నాలుగు పర్యాయాలు మంత్రివర్గంలో మార్పులు చేర్పులు జరిగాయి. అయితే, ఈ విస్తరణ మాత్రం మోదీ ప్రభుత్వానికి పెద్ద ఎన్నికల పరీక్ష కాబోతోందని పిస్తోంది. ఒక్క ఉత్తర ప్రదేశ్ ఎన్నికలే కాదు, 2017లో ఎన్నికలు జరగబోతున్న ఉత్తరాఖండ్, తదితర రాష్ట్రాలను దృష్టిలో పెట్టుకుని కూడా ఈ విస్తరణ జరిగిందని పరిశీలకులు, ప్రభుత్వవర్గాల వారు అభిప్రాయపడుతున్నారు.

ప్రకాశ్ జవదేకర్‌కు ప్రమోషన్ ఇచ్చి క్యాబినెట్ హోదా ఇచ్చారు. ఆయనకు మానవ వనరుల అభివృద్ధి శాఖను అప్పగించడం చాలా కీలకమైన మార్పు అని ప్రభుత్వ వర్గాలు భావిస్తున్నాయి. కొత్తగా చేరిన 19 మంది మంత్రుల్లో 17 మంది బీజేపీకి చెందినవారే. ఎస్ ఎస్ అహ్లూవాలియా, ఫాగన్ సింగ్ కులస్తే, అర్జున్ రామ్ మేఘ్వాల్, విజయ్ గోయెల్, రమేశ్ చందప్ప, జిగాంజీనాగీ, రాజెన్ గోహైన్, అనిల్ మాధవ్ దవే, పర్షోత్తమ్ రూపాలా, ఎం.జె. అక్బర్, జశ్వంత్ సిన్హ్ భాబోర్, మహేంద్ర నాథ్ పాండే, అజయ్ టామ్టా, కృష్ణరాజ్, మాన్‌సుఖ్ మాండవీయ, సీఆర్ చౌధురి, పీపీ చౌధురి, సుభాష్ భామ్రేలు బీజేపీ మంత్రులు. మిగిలిన ఇద్దరు - అనుప్రియా సింగ్ పటేల్ అప్నాదళ్‌కు చెందినవారు కాగా, రాందాస్ అథవాలే ఆర్‌పీఐ నాయకుడు.

కొత్త మంత్రులను తీసుకున్న తీరును బట్టి, రానున్న ఎన్నికలపై మోదీ, బీజేపీ అధ్యక్షుడు అమిత్ షా ఎటువంటి ఆశలు పెట్టుకున్నారో, ఎటువంటి అంచనాలు వేస్తున్నారో అర్థం చేసుకోవచ్చు. ఇందులో ఐదుగురు నాయకులు - అథవాలే (మహారాష్ట్రకు చెందిన రాజ్యసభ సభ్యుడు), కృష్ణరాజ్ (ఉత్తర ప్రదేశ్‌లోని షాజహాన్‌పూర్), మేఘ్వాల్ (రాజస్థాన్‌లోని బికనేర్), జిగాంజీ నాగి (కర్ణాటకలోని బిజాపూర్), అజయ్ టామ్టా (ఉత్తరాఖండ్‌లోని ఆల్మోరా) షెడ్యూల్డ్ కులాలకు చెందిన వారు. ముగ్గురు షెడ్యూల్డ్ తెగలు, ఇద్దరు ఓబీసీకి చెందినవారు. బీజేపీ తన పరిధిని విస్తరించుకునేందుకు జాతవేతర దళితులు, యాదవేతర ఓబీసీలను తమ వైపు తిప్పుకోవడానికి ప్రయత్నిస్తోందని అర్థమవుతోంది. ఉత్తరప్రదేశ్‌లో పాలక సమాజ్‌వాదీ పార్టీయే తమ ప్రధాన ప్రత్యర్థి అని అమిత్ షా ఇదివరకే ప్రకటించడం గుర్తుంచుకోవాల్సిన అంశం.

### దళితులు ఎటువైపు?

2011 నాటి కేంద్ర జనాభా గణాంకాల ప్రకారం, మొత్తం షెడ్యూల్డ్ కులాల జనాభాలో 20.5 శాతం జనాభా ఉత్తరప్రదేశ్‌లోనే ఉంది. షెడ్యూల్డ్ కులాల జనాభా విషయంలో ఉత్తర ప్రదేశ్ ప్రథమ స్థానంలో ఉందన్న మాట. ఆ తరువాతి స్థానం 10.7 శాతంతో పశ్చిమ బెంగాల్‌ది. ఈ ఇరవై శాతం షెడ్యూల్డ్ కులాల జనాభా మీద ఎక్కువగా మాయావతి నాయకత్వంలోని బహుజన్ సమాజ్ పార్టీ ఆధారపడి ఉంటుంది. ఈ వర్గాలు మద్దతిచ్చినంత మాత్రాన మాయావతికి గెలవడం సాధ్యం కాదు. రాష్ట్రంలోని ఓబీసీలు, ముస్లింలు, అగ్రవర్ణాలు కూడా మద్దతిస్తే తప్ప ఆమె ప్రభుత్వం ఏర్పాటు చేయలేరు. షెడ్యూల్డ్ కులాల జనాభాలో ఏ కొద్దిమంది బీజేపీకి మద్దతిచ్చినా అది విజయానికి చేరువ అవుతుంది. మొత్తం 403 మంది సభ్యుల శాసనసభలో 265 స్థానాలను ఏవిధంగానైనా చేజిక్కించుకోవాలని బీజేపీ ఈసారి గట్టి పట్టుదలతో ఉంది.

ఓబీసీని బీజేపీకి అనుకూలం చేయడంలో కొత్త మంత్రి అనుప్రియా పటేల్ ప్రధాన పాత్ర పోషిస్తారని బీజేపీ నాయకత్వం గట్టిగా నమ్ముతోంది. మీర్జాపూర్ నియోజకవర్గం నుంచి అప్నా దళ్ టికెట్‌పై మొట్టమొదటిసారిగా లోక్‌సభకు గెలిచిన అనుప్రియ కుర్మీ కులస్థురాలు. ఉత్తర ప్రదేశ్‌లో బీజేపీకి అప్నాదళ్ ముఖ్యమైన మిత్ర పక్షం. అప్నాదళ్‌లో ఎక్కువ సంఖ్యలో ఉన్నది ఓబీసీలు అయినందువల్లే, బీజేపీ ఆమెపై ఆశలు పెట్టుకుంది. ఆమె తండ్రి పూర్తిగా ఓబీసీలను కూడగట్టుకునే అప్నాదళ్‌ను పెంచి పెద్ద చేశారు. ఆమెను గనుక మంత్రివర్గంలో చేర్చుకుంటే, రాష్ట్రంలో వెనుకబడిన తరగతుల ఓట్లన్నీ బీజేపీకే పడతాయన్నది పార్టీ నాయకత్వం ఉద్దేశం. ముఖ్యంగా తూర్పు ఉత్తరప్రదేశ్‌లో అది సాధ్యమని పార్టీ అభిప్రాయపడుతోంది. అయితే, ఉత్తరప్రదేశ్‌లో కాలు పెట్టడానికి శతవిధాలా ప్రయత్నిస్తున్న బీహార్ ముఖ్యమంత్రి నితీశ్ కుమార్ కూడా ఎన్నికలకు ముందు నుంచే తూర్పు ఉత్తరప్రదేశ్‌లో ప్రచారాలు, ప్రసంగాలు, ప్రకటనలు చేస్తున్నారు. ఆయన కూడా కుర్మీ నాయకుడే కావడం బీజేపీకి కొద్దిగా సమస్య సృష్టించవచ్చు. ఆయన ఈ మధ్య కాలంలో తూర్పు ఉత్తరప్రదేశ్‌లో విస్తృతంగా

ప్రచార సభలు నిర్వహిస్తున్నారు.

### మంత్రులు సాధించగలరా?

అనుప్రియ ఇంతకు ముందు వారణాసిలోని రోహనియా నియోజకవర్గం నుంచి శాసనసభ్యురాలిగా గెలిచారు. తమకు వెనుకబడిన వర్గాల నుంచి ఎంత మద్దతున్నదీ తెలియజెప్పడానికి బీజేపీ అనుప్రియనే ఉపయోగించుకుంటోంది. ఇటీవల వారణాసిలో సోనేలాల్ పటేల్ 67వ జయంత్యుత్సవం సందర్భంగా జన్ స్వాభిమాన్ ర్యాలీని ఏర్పాటు చేసి, అమిత్ షా ఆమెకే ప్రాధాన్యం ఇచ్చి ప్రసంగించారు. బీజేపీ అనుప్రియను తమ వైపు తిప్పుకోవడం చూసి సమాజ్‌వాది పార్టీ రాష్ట్రంలో మరో శక్తిమంతమైన నాయకుడైన బేణీ ప్రసాద్ వర్మను తమ పార్టీలోకి చేర్చుకుంది. ఈ పరిణామాన్ని చూసి బీజేపీ పెద్దగా నిరాశ చెందలేదు. వృద్ధ, వ్యర్థ బేణీ ప్రసాద్ వర్మ కంటే యువ, ఆధునిక, చైతన్య అనుప్రియా పటేల్ అన్ని విధాలా నయమని పార్టీ భావిస్తోంది.

ఇక మంత్రివర్గంలోకి అథవాలే, కృష్ణరాజ్‌లను తీసుకోవడం కీలక వ్యూహాత్మక నిర్ణయమే. రాష్ట్రంలో దళితుల మీద మాయావతికి పట్టు ఎక్కువ. దళితులను తమవైపు తిప్పుకోవాలంటే, దళితుల్లో తమ మద్దతు విస్తరించుకోవాలంటే బీజేపీ కొత్త వ్యూహాన్ని అనుసరించకతప్పదు. అథవాలే, కృష్ణరాజ్‌లను తీసుకోవడం ఈ వ్యూహంలో భాగమే. ఉత్తరప్రదేశ్‌లో దళిత జనాభా ఎక్కువ. బీజేపీ దళిత అనుకూల పార్టీ అని, అగ్రవర్ణాల కంటే వారికే ప్రాధాన్యం ఇస్తుందని లోకానికి తెలియజెప్పడానికి మంత్రివర్గంలో అథవాలే ఉనికి ఉపయోగపడుతుంది. ఇదివరకు మానవ వనరుల అభివృద్ధి శాఖ మంత్రిగా ఉన్న స్మృతి ఇరానీని అంతగా ప్రాముఖ్యం లేని జౌళి శాఖకు మార్చడం మోదీకి అతి ప్రాధాన్య విషయం. రోహిత్ వేముల ఆత్మహత్య తరువాత హైదరాబాద్ విశ్వవిద్యాలయంలో జరిగిన సంఘటనలను అదుపు చేయడంలో ఆమె ఘోరంగా విఫలమయ్యారని మోదీ ప్రభుత్వం గుర్తించింది. అతి సున్నితమైన మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వ శాఖలో ఆమెను కొనసాగించడం పార్టీకీ, ప్రభుత్వానికి చెరుపు చేస్తుందే



**ఉత్తరప్రదేశ్ శాసనసభ ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని మంత్రివర్గాన్ని విస్తరించారు ప్రధానమంత్రి నరేంద్రమోదీ. యూపీ అసెంబ్లీలో మెజార్టీ స్థానాలు గెలుచుకోవాలని బీజేపీ ఈసారి గట్టిపట్టుదలతో ఉంది. ఓబీసీలను పార్టీకి అనుకూలంగా మార్చడంలో కొత్తమంత్రి అనుపమ ప్రధానపాత్ర పోషిస్తారని ఆ పార్టీ నమ్ముతోంది. ఇంతకూ ఈ విస్తరణ యత్నాన్ని ఏమని అర్థం చేసుకోవాలి?**

తప్ప ఉపయోగించదని మోదీ ప్రభుత్వం భావించింది. అలాగే, జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయాన్ని చుట్టు ముట్టిన వివాదాలపై కూడా కేంద్రం దృష్టి పెట్టింది.

నరేంద్ర మోదీకి రాజకీయంగా ఇది తప్పనిసరి ఎత్తుగడ. 2017లో ఉత్తరప్రదేశ్, ఇతర రాష్ట్రాలలో జరగబోయే ఎన్నికలలో మోదీ, అమిత్ షాలు ప్రధాన ప్రచార సారథులవుతారు. కొత్తగా ఎన్నికైన మంత్రులంతా ప్రత్యర్థుల నోళ్ళు మూయించడానికి ఉపయోగపడతారు. మొత్తం మీద ఎన్నికల్లో కొన్ని ప్రయోజనాలు పొందడానికే మోదీ, అమిత్ షాలు అనేక నెలల పాటు తీవ్రస్థాయిలో కసరత్తు చేసి, మంత్రి వర్గంలో భారీగా మార్పులు చేర్పులు చేశారు.



### తారుమారైతే ఏమిటి పరిస్థితి?

అనుకున్నదొకటి, అయ్యేది ఒకటి అయితే ఎలా? ఈ మార్పులు చేర్పులు నిజంగా ఆశించిన ప్రయోజనాన్ని నెరవేరుస్తాయా? నెరవేర్చకపోతే ఏంటి పరిస్థితి? బీజేపీకి వచ్చే ఏడాది జరగబోయే ఉత్తరప్రదేశ్ ఎన్నికలు చాలా కీలకం. తమిళనాడు, పశ్చిమ బెంగాల్, కేరళ, అసోమ్, పుదుచ్చేరి రాష్ట్రాల్లో పార్టీ కొన్ని సత్ఫలితాలు పొందింది. కానీ, బీహార్ ఎన్నికల ఫలితాలు మాత్రం పార్టీ నాయకత్వం మరచిపోలేనివి. ఉత్తరప్రదేశ్‌లో గెలిస్తే దేశ రాజకీయ చరిత్రలో మోదీ, అమిత్ షాలు చిరస్మరణీయంగా మిగిలిపోతారు. ఆ పార్టీ బీహార్ పరాజయం నుంచి పాఠాలు నేర్చుకున్నదనే అభిప్రాయం సర్వత్రా కలుగుతుంది. అభ్యర్థుల ఎంపిక కంటే లాలూప్రసాద్ యాదవ్, కాంగ్రెస్‌లతో కూటమిని ఏర్పాటు చేసుకోవడం అనేది విజయాలు తెచ్చి పెట్టిందనే వాస్తవాన్ని బీజేపీ గ్రహించుకుని ఉండాలి. లాలూప్రసాద్ యాదవ్, నితీశ్ కుమార్‌లు చేతులు కలిపినందువల్ల, యాదవులు, ముస్లింలు, కుర్మీలు కలిసి బీజేపీని ఘోరంగా ఓడించగలిగారు. బీజేపీ కూడా హిందుస్తానీ ఆవామ్ మోర్చా, లోక్ జనశక్తి పార్టీ, రాష్ట్రీయ లోక్ సమతా పార్టీలతో చేతులు కలిపింది. కానీ, వాటితో వెనుకబడిన తరగతుల ఓట్లను సమీకరించుకోలేకపోయింది. నిజానికి ఇవే వర్గాలు, ఇవే కూటములు రెండేళ్ల క్రితం జాతీయ స్థాయి ఎన్నికల్లో బీజేపీకి గంపగుత్తగా ఓట్లు వేసి గెలిపించాయి. బీహార్ ఎన్నికల్లో ఆ వర్గాలు బీజేపీ కూటమిని ఘోరంగా తిరస్కరించడం ఆ పార్టీని సైతం నిర్ఘాంత పరుస్తోంది.

ఏది ఏమైనా బీజేపీ ఓ జాతీయ పార్టీ. రాజకీయ లబ్ధి కోసం మంత్రులను తీసుకోవడం, ఉద్వాసన చెప్పడం వంటి చర్యలతో బీజేపీ ఎంత కాలం ముందుకు వెడుతుందన్నది వేచి చూడాల్సిందే. మంత్రుల మార్పులు చేర్పులు, వర్గ సమీకరణలు, కూటముల ఏర్పాటు వంటి చర్యల కన్నా, ప్రజల మనసులను గెలుచుకోవడానికి మరో మార్గం లేదా అన్నది కూడా ఆలోచించాల్సి ఉంటుంది. దాదాపు 1970ల నుంచి ఈ రకమైన వ్యూహాలు, ఎత్తుగడలు చెలామణీ అవుతున్నా, ఓడలు బళ్ళు, బళ్ళు ఓడలు అవుతూనే ఉన్నాయన్నది వాస్తవం. వర్గాలు, కూటములు, సమీకరణలను ఆధారం చేసుకుని, సర్వేలు, అధ్యయనాలు చేస్తున్నందు వల్లే, వాటి ఫలితాలు తలకిందులవుతున్నాయన్నది అనుభవాన్ని బట్టి అర్థం చేసుకోవాల్సి ఉంది. ఇది ఎత్తుగడా కాదు, వ్యూహమూ కాదు. ఇదొక రాజకీయ జూదం మాత్రమే.




**"అన్వర్ మన ప్రయత్నాలు ఫలిస్తాయా?" అడిగాడు కర్కరే.**

**"ఆ అనుమానం ఎందుకు వచ్చింది సార్?" అన్నాడు అన్వర్.**

**"సమంత క్యూట్ అండ్ హాట్ గర్ల్‌రా. అంత తొందరగా ఒక నిర్ణయానికి రాదు" తన ఒపీనియన్ రిలీజ్ చేశాడు కర్కరే.**

**అప్పటికే సమంత గురించిన కబుర్లుచెప్పి కర్కరే దగ్గర డబ్బులు గుంజడం అలవాటు చేసుకున్నాడు అన్వర్. అందుకే అతణ్ణి డిజప్పాయింట్ చేయడంకంటే ఎంకరేజ్ చేయడమే తన జేబుకు బెటరనుకున్నాడు అన్వర్.**

"ఒక వేళ శ్రీకర్‌ని వదులుకున్నా నాతో జత కడుతుందన్న నమ్మకమేముంది?" కాస్త బాధగా అన్నాడు కర్కరే.

"అదేం లేదు సార్, శ్రీకర్ సార్ ప్రపోజ్ చేయకపోతే మిమ్మల్నే మేడమ్ డిసైడ్ చేసుకునేవారట" చెప్పాడు అన్వర్.

కర్కరేలో ఏవో ఆశలు చిగురించాయి.

"అన్వర్ ఒకసారి సమీరని పిలు" చెప్పాడు.

"ఓకే సార్" అని బయటకు నడిచాడు అన్వర్.

"వీడికి ఇదేం పిచ్చిరా బాబూ" అనుకుంటూ,

ఐదు నిమిషాల తర్వాత సమీర కర్కరే చాంబర్‌కి వెళ్ళింది.

కర్కరే విపరీతమైన గౌరవం చూపుతూ ఆహ్వానించాడు.

"చెప్పండి సర్" అంది సమీర.

ఒక నిమిషం సిగ్గు పడ్డాడు కర్కరే.

"ఆఫీసు విషయం కాదు పర్సనల్" అన్నాడు.

"పర్సనలా?" అంది ఆశ్చర్యంగా.

"అవును" నసిగాడు.

"ఇది ఆఫీసు టైం సార్" అంది.

ఆఫీసు సమయంలో ఇతర విషయలేవీ మాట్లాడవద్దని కర్కరే గట్టిగా కేకలు వేయడం సమీరకు గుర్తుకు వచ్చింది. అందుకే ప్రతీకారం తీర్చుకుంది. తనని ఎందుకు పిలిపించారో కర్ణాకర్ణిగా అర్థమయింది సమీరకు.

"అఫ్‌కోర్స్.. అది ఇతరుల విషయంలో. నా విషయంలో కాదు కదా? మీరా... నాకొక ఫేవర్ చేసి పెట్టాలి.." అన్నాడు కర్కరే కాస్త గోముగా.

"చెప్పండి సర్..." అంది సమీర.

"సమంత, శ్రీకర్ విషయంలో రీ థింకింగ్‌లో ఉందని తెలిసింది. పిల్లలు కావాలి అనే పర్టిక్యులారిటీస్ నా దగ్గరలేవు. తనంటే నాకు ఎందుకో తెలీదు గానీ క్రేజ్. వాళ్ళ రిలేషన్ బ్రేక్ అయితే నన్ను ఇన్‌సర్ట్ చేయాలి. ఇది ఊరకనే చేయక్కర్లేదు. నిన్ను యుఎస్ ప్రాజెక్టుకు పంపే ఏర్పాట్లు చేస్తా" చెప్పాడు కర్కరే.

ఒళ్ళు మండింది సమీరకు.

"వీడు గోతికాడ నక్కలా కాచుక్కూర్చున్నాడే!" అనుకుంది.

"వాళ్ళ రిలేషన్స్ బ్రేక్ అవుతాయని అనుకోవడం లేదు సర్. ఒకవేళ అటువంటిది ఏమైనా జరిగి, తను మరొకరితో కలిసి జీవించాలనుకుంటే అప్పుడు నేను మీకు సహకరిస్తాను" అంది సమీర లోపల తిట్టుకుంటూనే.

కర్కరే డ్రీమ్స్‌లోకి వెళ్ళిపోయాడు.

వెనక చారెడుమందంజుట్టు ఎగిరిపోయినా "వీడికి ఈ పిచ్చి పోలేదా" అనుకుంది సమీర.

అయినా ఈ బంధాలు, అనుబంధాలు ఎక్కడకు పోతున్నాయో? అనిపించింది.

తాళి కట్టించుకోనంతమాత్రాన సమంత ఫ్రీ బర్డ్ అవుతుందా? శ్రీకర్‌తో ఆమెబంధం అంత కృతకంగా ఉందా? సహజీవనమంటే అంత లోకువా? పెళ్ళి చేసుకోకుండా ఇటువంటి కమిట్‌మెంట్‌కి సమంత రావడం పొరపాటా? పెళ్ళనే అఫీషియల్ కమిట్‌మెంట్ లేకపోయినా సమంత మరో మగాణ్ణి మరోదృష్టితో ఏ రోజూ చూడలేదు. కనీసం కామెంట్ కూడా చేయలేదు. శ్రీకర్‌కి భర్త అనే టాగ్‌లైన్ ఇవ్వకపోయినా శ్రీకర్ స్థానం ఆమె హృదయంలో ఎప్పటికీ పదిలం. దానిని ఎవరూ తొలగించలేరు. తను ఒప్పుకోదుకానీ, శ్రీకర్‌పైన సమంతకి భాషలో చెప్పలేనంత ప్రేమ ఉంది. అతడు తనవల్ల నష్టపోవడం ఏ రోజూ భరించలేకపోయింది. అందుకే అతడితో స్నేహం నడిపింది.

●●●

శ్రీకర్‌తో భేటీ వేశాడు రమణ.

ముందురోజు కర్కరే ప్రపోజల్ గురించి రమణకు చెప్పింది సమీర.

"వాళ్ళ రిలేషన్ బ్రేక్ అయితే కర్కరే నక్కలా కాచుకొని ఉన్నాడు. అందుకు ఫారెన్ విజిట్ కూడా ఆఫర్ ఇచ్చాడు" చెప్పింది.

రమణ సుదీర్ఘంగా ఆలోచించి శ్రీకర్‌కి ఫోన్ చేసి "కలుద్దామని" చెప్పాడు.

మొదట శ్రీకర్ క్యాజువల్ అనుకున్నాడు. రమణ గొంతులో సీరియస్‌నెస్ అతన్ని ఆలోచనల్లో పడవేసింది. పంజాగుట్టలో వాళ్ళిద్దరూ తరచుగావెళ్ళే చట్నీస్‌లో కూర్చున్నారు.

"రమణా, ఎలా ఉంది మ్యారీడ్ లైఫ్" అడిగాడు శ్రీకర్.

"మా లైఫ్ ఎంజాయ్ చేయడంకంటే మీ లైఫ్ గురించి ఆలోచించడమే ఎక్కువైంది" అన్నాడు రమణ నవ్వుతూ.

"కంప్లైంటా? కాంప్లిమెంటా?" అన్నాడు శ్రీకర్ అతడి నవ్వులో శ్రుతి కలుపుతూ.

"శ్రీకర్, సమంతతో నీ రిలేషన్స్ బ్రేక్ కాకుండా చూసుకో" సలహా ఇచ్చినట్టు చెప్పాడు రమణ.

"అలా ఎందుకనుకుంటున్నావురా" అడిగాడు.

"పిల్లల విషయంలో..?" అర్థోక్తిలో ఆగాడు రమణ.

"అదే నాకు అర్థం కావట్లేదు. తను నా ఫీలింగ్స్ అర్థం చేసుకోవట్లేదు" బాధగా అన్నాడు శ్రీకర్.

"భవిష్యత్తు ఉంది కదా. తనకు నమ్మకం కలిగిన తర్వాత అంగీకరిస్తుంది. అప్పటివరకూ లైఫ్ ఎంజాయ్ చేయవచ్చు కదా?" సలహా ఇస్తున్నట్టు చెప్పాడు రమణ.

## జరిగిన కథ

పెళ్ళి, తాళి వ్యవస్థపై నమ్మకం లేని సమంత, శ్రీకర్ ప్రతిపాదనను తిరస్కరిస్తుంది. వారిద్దరినీ కలిపేందుకు శ్రీకర్ తమ్ముడు, మరదలు, సమంత స్నేహితురాలు, ఆమె ప్రియుడు నడుంకడతారు. ఇటు తల్లిని, అటు శ్రీకర్‌ని తృప్తి పరచడంకోసం, పెళ్ళిబంధానికి భిన్నంగా ఎట్టకేలకు శ్రీకర్‌తో సహజీవనానికి అంగీకరిస్తుంది సమంత. తనకో బిడ్డ పుట్టాలని కోరుకుంటాడు శ్రీకర్. కానీ ఆ విషయం అగ్రిమెంటులో లేదని తేల్చిచెబుతుంది సమంత. శ్రీకర్ షాకవుతాడు. ఇకవారు ఎంతోకాలం కలిసి సహజీవనం చెయ్యరని అంతా చెవులుకొరుక్కుంటూ ఉంటారు.

ఆ తర్వాత....

"కావచ్చు. నేనో ఇంటివాడినై వంశాన్ని నిలబెడ తాననే ఉద్దేశంతోనే నాన్న నా పెళ్ళికి పట్టుపట్టారు. అదే ఆయన ఆశ."

"నాన్న కన్విన్స్ కాడా" అడిగాడు రమణ.

"అందుకు ఆయన హెల్త్ పర్మిట్ చేయదు. దినకర్ వైపన్నా క్యారీ అయ్యి ఉంటే నాన్నకంత టెన్షన్ ఉండేది కాదేమో. ఆయన మాత్రమేకాదు. నాకూ మా ప్రేమకు గుర్తుగా పసివాడి అడుగుల చప్పుడు వినాలని ఉంటుంది కదా" అన్నాడు శ్రీకర్.

"నీకు తనపైన వందశాతం ప్రేమ ఉంది. తనకి నీ పైన అంత స్థాయిలో లేదు కదా" అన్నాడు రమణ.

శ్రీకర్ ముఖంలో వెలుగు ఆరిపోయింది.

"నా ఉద్దేశం తను నిన్ను సంపూర్ణంగా అంగీక రించడానికి సమయం పడుతుందనేది" రమణ వివరణ ఇచ్చుకున్నాడు.

శ్రీకర్ మాట్లాడలేదు. అతడి ముఖం అప్ర సన్నంగా మారిపోయింది.

●●●

శ్రీకర్ తండ్రి సుధాకర్‌రావుకి మరోసారి హార్ట్ ఎటాక్ వచ్చింది.

విషయం తెలిసి శ్రీకర్ వణికిపోయాడు.

సమంత అతన్ని దగ్గరకు తీసుకొని ఎంత ఓదార్చినా అతడిలో దుఃఖం ఆగలేదు. టెలిఫోన్లో రమణకు సమాచారం ఇవ్వడంతో అతడు హుటా హుటిన వచ్చాడు. అరగంట వ్యవధిలో అందరూ ఒక దగ్గరకు చేరి విజయవాడ చేరుకున్నారు. మొదటి సారి హార్ట్‌ఎటాక్ వచ్చినప్పటి నుంచీ సుధాకర్ రావు చిన్న కొడుకు దినకర్ దగ్గరే ఉంటున్నాడు. దినకర్ స్వయానా డాక్టర్ కావడంవల్ల అతడికి కొంత ధైర్యంగా ఉండేది.

విశాఖనుండి వారానికి ఒకసారి వచ్చినప్పుడు అరుణ కూడా ధైర్యం చెబుతూ ఉండేది.

"అమ్మాయి ప్రయాణాలు చేయడం ఏంట్రా" అంటుండేవాడు సుధాకర్‌రావు.

"అలవాటైందిలెండి మావయ్యగారూ" అంటూ ఉండేది అరుణ.

"ఎవరో ఒకరు ట్రాన్స్‌ఫర్ పెట్టుకోండ్రా" అంటుండే వాడాయన.

ముఖ్యంగా పెద్దకొడుకు కాపురం సవ్యంగా ఉండట్లేదని తెలిసినప్పటినుంచీ ఆయనలో మనో వ్యాకులత పెరిగింది. ముందు వారసుడు కావా లని తపనపడ్డాడు. తర్వాత తెలిసిన సమాచారాన్ని బట్టి కనీసం వాళ్ళిద్దరన్నా బావుంటే చాల్లే" అను కున్నాడు.

కానీ లోపల్లోపల అతడిలో భాషకందని బాధ పెరిగిపోయింది.

తన ఇద్దరి బిడ్డల పరిస్థితి ఇలా అయిం దేమిటా? అని వ్యథ పడేవాడు. ఎంతో కష్టపడి బిడ్డల్ని చదివించాడు. దినకర్‌ని మెడిసిన్ చదివించ డానికి ఆర్థికంగా చాలా శ్రమ పడవలసి వచ్చింది. సుధాకర్‌రావు ఫారెస్ట్ డిపార్ట్‌మెంటులో వాచర్‌గా పని చేసి రిటైర్ అయ్యాడు. అదనపు అవసరాల కోసం కొద్దిపాటి అవినీతి పనులు చేయక తప్ప లేదు అతడికి. స్వతహాగా దైవభీతి ఎక్కువ. ఎప్పుడూ అతడి వెన్నంటి బైబిల్ ఉండేది.

సుధాకర్‌రావు తప్పులు చేయడని పై అధికార్ల బలమైన విశ్వాసం.

స్మగ్లర్స్‌కి సహకారం అందించడంవల్లే అడ విలో కలప అక్రమంగా రవాణా జరిగేది. తాను చేసిన తప్పులవల్లే తన ఇద్దరి బిడ్డల భవిష్యత్తు ఇలా అయ్యిందా? అన్న వేదన అతడిలో పెరిగి పోయింది. "ప్రభువా క్షమించు" అనుకుంటూ ఉండేవాడు.

చిన్నవాడు స్వయానా డాక్టరైనా అతడికి సంతాన భాగ్యంలేదు. పెద్దవాడికి ఎలాంటి సమస్యా లేకపోయినా భార్యాభర్తల మధ్య అవగాహన సఖ్యత లేదు. వారిద్దరు చేసేది కాపురం కాదు. సహజీవనమని తెలిసినప్పుడు మొదట కుంగిపోయాడు.



తర్వాత రాజీపడ్డాడు. పిల్లల్ని కనడానికి సమంత అంగీకరించడం లేదని తెలిసినప్పుడు దరిదాపు అతడి గుండె ఆగినంత పనైంది. అదే రెండోసారి స్ట్రోక్‌కు కారణమైంది.

సుధాకర్‌రావు తండ్రి చిన్న పోలీస్ ఉద్యోగి ఎంతో కష్టపడి కొడుకును చదివించాడు. తన తండ్రి బ్రతికున్న రోజుల్లో కొడుక్కి చెప్పేవాడు. "సుధా పిల్లల చదువు విషయంలో రాజీ పడవద్దు. నువ్వూ నీ భార్య పొట్టకట్టుకునైనా పిల్లల్ని బాగా చదివించండి. మన వంశాన్ని నిలబెట్టండి" అనేవాడు. తన తండ్రి కోరుకున్న వంశం ఇప్పుడు అంతరించిపోతోంది!

సుధాకర్‌రావుకి బాగా గుర్తు. దినకర్‌కి మెడిసిన్ సీటు వచ్చింది. సుధాకర్‌రావు తండ్రి ఆనందరావు మంచంపైన ఉన్నాడు.

"నాన్నా, నీ మనవడికి మెడిసిన్ సీటు వచ్చిందే" సంబరంగా చెప్పాడు.

అవసాన దశలో ఉన్న ఆనందరావు కళ్ళు మెరిశాయి. మనవడిని అభినందనగా చూశాడు. దగ్గరకు పిలిచాడు. దినకర్ నుదుటిపైన ముద్దు పెట్టుకున్నాడు. "మంచిగా సాధించినావురా బిడ్డా. నేను మీ నాయన్ని ఫారెస్ట్ ఉద్యోగిని చేశా. వాడు నిన్ను డాక్టర్‌ని చేశాడు. నువ్వు నీ బిడ్డను కలెక్టర్‌ని చెయ్. మన వంశం దిన దినాభివృద్ధి చెందాలి. పేద వాళ్ళకి అండగా నిలవాలి" సుధాకర్‌రావు చేతుల్లోనే ఆనందరావు కన్నుమూశాడు.

ఆ ముద్ర సుధాకర్‌రావులో నిలిచిపోయింది. తన తండ్రి కోరిక మేరకు తన వంశం వర్ధిల్లాలి. 'ఒలీవా' మొక్కల్లా విరజిల్లాలి. ఇలా అనుకుంటూ ఉండగానే అతడికి రెండోసారి స్ట్రోక్ వచ్చింది. వంట మనిషి ద్వారా సమాచారం తెలుసుకున్న దినకర్‌కి మొదట గుండె ఆగినంత పనైంది. హుటాహుటిన అంబులెన్స్ తీసుకొచ్చి తండ్రిని హాస్పిటల్‌కి చేర్చాడు.

అటువంటి స్థితిలో సుధాకర్‌రావు 'పెద్దోణ్ణి పిలిపించరా' అన్నాడు.

శ్రీకర్, సమంత, రమణ విజయవాడ చేరేసరికి సుధాకర్‌రావు ఐసీయూలో ఉన్నాడు. తమ్ముడు ఎదురు రావడంతోనే "నాన్నకు ఎలా ఉందిరా" అడిగాడు శ్రీకర్.

"పేస్ మేకర్ అమర్చారు. రికవరీ అవుతాడులే అన్నయ్యా" చెప్పాడు దినకర్.

"ఔటాఫ్ డేంజర్ కదా..." అడిగింది సమంత.

"అవును వదినమ్మా..." అనాలనుకున్నాడు కానీ "అవునండీ" అని ఆగిపోయాడు.

వివాహవ్యవస్థ ద్వారానే వావివరుసలు వస్తాయి. సహజీవనంచేసే స్త్రీని ఏమని పిలవాలో ఒక నిమిషం అర్థం కాలేదు దినకర్‌కి.

"దినా అరుణకు చెప్పావా?" అడిగాడు శ్రీకర్.

"చెప్పానన్నయ్యా... తను విశాఖ ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరింది" చెప్పి, "రమణా, నువ్వూ, సమంత ఇంటికెళ్ళి ఫ్రెషప్ అయ్యి రండి" అన్నాడు.

"ఫర్వాలేదు లెండి" అంది సమంత.

రమణ కూడా అదే చెప్పాడు.

హాస్పిటల్ కారిడార్‌లో ఉన్న ఐరన్ ఛైర్స్‌లో కూర్చున్నారు.

"అన్నయ్యా...పేషంట్‌లు నా కోసం వెయిట్ చేస్తుంటారు. రౌండ్స్‌కి వెళ్ళి వస్తాను" చెప్పాడు దినకర్.

"ఓకేరా, మేమిక్కడ వెయిట్ చేస్తాంలే" చెప్పాడు శ్రీకర్.

"అన్నయ్యా...మీకు సహాయంగా మా అటెండర్ ఏడుకొండల్ని పెట్టి వెళ్తున్నా" అని కొండలువైపు తిరిగి, "కొండలూ, అన్నయ్యా వాళ్ళకి మంచి కాఫీ తెచ్చిపెట్టు. స్నాక్స్ కూడా" అని ఐదు వందల నోటు కొండలుకిచ్చి కదిలాడు దినకర్.

"అలాగే సర్" అన్నాడు కొండలు.

పదినిమిషాల వ్యవధిలో పొగలు కక్కే కాఫీ తెచ్చాడు ఏడు కొండలు. కాఫీ తాగేసరికి ముగ్గురికీ ప్రాణం లేచి వచ్చినట్టయింది. "మీ సార్ మళ్ళీ ఎన్ని గంటలకు వస్తాడు?" అడిగాడు శ్రీకర్. 'మా సర్‌కి మంచి పేరు ఉంది సార్" చెప్పాడు ఏడు కొండలు దినకర్ గురించి.

నవ్వాడు శ్రీకర్. నా తమ్ముడి గురించి నాకు తెలీదా అన్నట్టు చూశాడు. "పేరు గురించి కాదు కొండలూ" అని ఏదో అడగబోతుంటే, "అదే సార్ మంచి పేరు ఉంది కాబట్టే వేరే ఓపిలో వాళ్ళు కూడా సార్ దగ్గరకే వస్తారు" చెప్పాడు ఏడు కొండలు. దినకర్ ప్రొఫెషనల్ ఎథిక్స్ పాటిస్తాడు. చాలా మంది డాక్టర్లు హాస్పిటల్‌కి వచ్చే పేషెంట్లని తమ ప్రైవేట్ క్లినిక్‌కి రమ్మని ఏదో ఒక పేరుతో పురమాయిస్తుంటారు. దినకర్ అలా కాదు. హాస్పిటల్ కొచ్చి చూపించుకున్నవారు తర్వాత తన క్లినిక్‌కి వచ్చినా డబ్బులు తీసుకోడు. పేషంట్ల హడావుడిలో పడితే

**హాస్పిటల్‌లో కోలుకుంటున్న ఆ వృద్ధుణ్ణి చూసి ఆవేదన చెందిందామె. తనవల్లే ఆ కుటుంబానికి వారసుడు లేకుండా పోతున్నాడనీ, అలా జరక్కూడదనీ నిశ్చయించుకుంది. మరో వివాహం చేసుకుని బిడ్డల్ని కని సుఖపడమనీ, తండ్రిని సంతోషపెట్టమనీ తన భాగస్వామికి సలహా ఇచ్చిందామె. ఆ సలహాను ఆ భాగస్వామి పాటించాడా లేదా? ఇంతకూ ఆ వృద్ధుడు ఎవరు?**

అరుణ వచ్చినా పెద్దగా పట్టించుకునేవాడు కాదు. ఇదే విషయాన్ని శ్రీకర్‌కి రెండుమూడు సార్లు అరుణ కంప్లైంట్‌లా చెప్పేది. "చూడండి బావగారూ... అంత దూరం నుండి నేను వస్తే... పేషంట్లలో పడి నన్ను పట్టించుకోడు" అనేది. శ్రీకర్ నవ్వుతూ, "అంత బిజీగా ఉన్నవాడివి, తననెందుకురా పిలవడం" అనేవాడు. "తనూ ఒక పేషంటే అన్నయ్యా... నన్ను చూడడమే తనకి ట్రీట్‌మెంట్... చూసింది కదా... దట్సాల్" అనేవాడు అల్లరిగా. అరుణ బుంగ మూతి పెట్టేది. శ్రీకర్ ఆలోచనలను ఛిద్రం చేస్తూ...

"ప్రపంచ బ్యాంకు సహకారంతో గవర్నమెంట్ హాస్పిటల్స్ బాగానే ఆధునీకరించారు.." అన్నాడు రమణ.

"అవును....గవర్నమెంట్ హాస్పిటల్స్ లేకపోతే ఈ కార్పొరేట్ హాస్పిటల్స్ పేదవాళ్ళని ఇంకా బాగా పిప్పిచేసేవే.." అంటూ సమంత వైపు చూశాడు శ్రీకర్. తను జర్నీలో బాగా అలిసిపోయింది. దాని ఛాయలు కన్పిస్తున్నాయి. "కొండలూ...మీ సార్ రెస్ట్‌రూం ఉంది కదా, మేడమ్‌ని అక్కడకు తీసుకెళ్ళు" చెప్పాడు శ్రీకర్.

"పర్వాలేదులే శ్రీకర్" అంది సమంత.

'అలసట నీ ముఖంలో బాగా కన్పిస్తోంది సమంతా. తమ్ముడి రెస్ట్ రూం హాస్పిటల్‌లోనే ఉంది. వెళ్ళు కాసేపు రెస్ట్ తీసుకో" అన్నాడు శ్రీకర్. సమంత ఏమనుకుందో ఏడుకొండలుని అనుసరించింది.

●●●

మరో గంటకు సూర్యుడు అస్తమిస్తాడనగా అరుణ కూడా వచ్చింది. "ఎలా ఉంది మామగారికి" అడిగింది.

"పర్వాలేదు అరుణా, రికవరీ అవుతారు" చెప్పాడు శ్రీకర్.

సమంత తన తండ్రిని అలా సంబోధించకపోవడం గమనించాడు. "నాన్నగారికి ఎలా ఉందని" మాత్రమే అడిగింది.

"ప్చ్ సహజీవనం" శ్రీకర్ అనుకున్నాడు.

రెండురోజుల వ్యవధిలో స్మారకంలోకి వచ్చాడు సుధాకర్‌రావు. రూమ్‌కి షిఫ్ట్ చేశారు. మనిషి చాలా నీరసంగా ఉన్నాడు. అందరూ గదిలోనే కూర్చున్నారు. పది నిమిషాల తర్వాత "నాన్నా రౌండ్స్‌కి వెళ్ళి వస్తా" అని బయలుదేరాడు దినకర్.

"నేనూ రానా?" అడిగింది అరుణ. "రా" చెప్పాడు. అరుణ అతన్ని వెంబడించింది. కొడుకూ,



కోడల్నీ తృప్తిగా చూసుకున్నాడు సుధాకర్‌రావు. రమణ కూడా బయలుదేరి వెళ్ళాడు. శ్రీకరే పంపాడు. "సమీర ఒట్టిమనిషి కాదు కదా" అని.

గదిలో శ్రీకర్, సమంత మాత్రమే మిగిలారు.

సుధాకర్‌రావు సమంత ముఖంలోకి చూసి దగ్గరకు పిలిచాడు. సమంత వెళ్ళింది. బలహీనమైన అతడి చేయిని ఆమె తలపైన పెట్టి, "పిల్లలేకపోయినా పర్వాలేదు. మీరిద్దరూ సంతోషంగా ఉండండమ్మా" అన్నాడు. శ్రీకర్‌కి కాస్త సిగ్గుగానూ, మరికాస్త బాధగానూ అనిపించింది. సమంత పరిస్థితి కూడా దరిదాపు అలాగే ఉంది.

•••

విజయవాడనుండి వచ్చిన తర్వాత సమంత దీర్ఘాలోచనలో పడింది. శ్రీకర్‌కి తాను అన్యాయం చేస్తున్నానా? అనిపించింది. శ్రీకర్ కుటుంబం కోరుకుంటున్నది వేరు. తాను అందిస్తున్నది వేరు. అతడితో తన సహచర్యం కొనసాగుతున్నప్పటికీ అతడితో తప్ప ఎవ్వరితోనూ తాను అనుబంధాన్ని ముడి వేసుకోలేకపోతోంది. అతడితో ఒకే గొడుగుకింద సజావుగా ఉండగలుగుతోంది. కానీ అతడి తండ్రిని మావయ్యా అని, తమ్ముణ్ణి మరిదిగారని భావించలేకపోతోంది. అరుణ ఆప్యాయంగా 'అక్కా' అని పిలిస్తే దాన్నొక మామూలు సంబోధనగా భావించింది తప్ప తాను ఆ కుటుంబంలో సభ్యురాలినని భావించలేకపోయింది.

అరుణ "నీతో కాసేపు మాట్లాడాలి అక్కా" అని అడిగింది ఆరోజు. "మాట్లాడండి" అంది తను. "ఇక్కడ కాదక్కా... టెర్రస్ పైకి వెళ్దాం" అంది. ఒక నిమిషం అరుణ ముఖంలోకి అయోమయంగా చూస్తూ తనతో పాటు పైకి వెళ్ళింది. "అక్కా, ముందుగా మీరు నన్ను క్షమించాలి. నేను సలహా ఇవ్వడం ఏంటా అని అనుకోవద్దు. ముఖ్యంగా శ్రీకర్ బావ గురించి మీతో మాట్లాడాలి.." అంది. తనకి అప్పటికే సగం విషయం అర్థమైంది. విషయం ఎక్కడికి వెళుతుందో తెలుసు. నేరుగా విషయంలోకి దిగింది అరుణ. "అక్కా, మీరో నేనో వీరి వంశానికి ఒక వారసుణ్ణి ఇవ్వాలి. మాకు ఆ అవకాశం లేదు. సైన్సు ఇంకా ఏమైనా అభివృద్ధి జరిగితే నేను 'కన్సీవ్' అవుతానేమో. కానీ మీ ఫీలింగ్స్ నేను అర్థం చేసుకుంటాను. బావతో మీరు చేసుకున్న అగ్రిమెంట్ గురించి నాకు తెలుసు. ఆ వివరాల్లోకి నేను వెళ్ళడం లేదు. ఒక్కటి మాత్రం వాస్తవం. అక్కా బావకి మీరంటే ఎంతో ప్రేమ. మీరు నిర్భయంగా ఆయన ద్వారా కన్సీవ్ కావచ్చు" అని కాసేపు సమంత ముఖంలోకి చూసింది. సమంత ఏమీ మాట్లాడలేదు. "నేను ఆలోచించుకోవాలి" అంటూ మెట్లు దిగింది సమంత. నిజంగానే ఆలోచనలో పడింది సమంత. శ్రీకర్ తనని ప్రేమిస్తున్నది నిజం. తనక్కూడా అతనిపై ప్రేమ ఉందని నిరూపించుకోవాలి. అది నిరూపించుకోవడానికి బిడ్డని మాత్రం తను కనదు. మరి ఎలా? తీవ్ర మథనానికి గురైంది.

•••

"సర్ మీతో మాట్లాడాలి" స్వయానా సమంతే అడగడంతో తబ్బిబ్బయ్యాడు కర్కరే. "ఆఫీసులో మాట్లాడదామా? బయట ఎక్కడికైనా వెళ్దామా?" అడిగి నాలిక్కరుచుకున్నాడతను. "ఆఫీసులోనైనా పర్వాలేదు సర్" అంది. "చెప్పండి.." అన్నాడు.

అతడి ఆలోచనలు పరిపరి విధాలుగా పరిగెత్తుతున్నాయి. "శ్రీకర్‌తో బోర్ కొట్టింది అంటుందా లేక మరేదైనా అడుగుతుందా?" అంచనా వేసుకోవడంలో తల మునకలై పోయాడు. అతడి ఊహలు తలకిందులు చేస్తూ "సమీరకిచ్చిన ఆఫర్ నాకు ఇవ్వండి సర్" అంది. కర్కరే గొంతులో తడారి పోయింది. "అదీ అదీ" అన్నాడు గొణుగుతూ. "శ్రీకర్‌కి దూరంగా వెళ్లాలనుకుంటున్నాను. మన యుఎస్ ప్రాజెక్టుకు నన్ను పంపితే నాకు చాలా సాయం చేసిన వారవుతారు" అంది సమంత నమ్రతగా.

"సమీరకు నేను ఇచ్చిన ఆఫర్ ఎందుకో మీకు తెలుసు. శ్రీకర్‌ని వదులుకోవాలని నేను కోరుకోలేదు. ఒకవేళ అటువంటి పరిస్థితే వస్తే తన లైజనింగ్ ఉపకరిస్తుందని ఆశపడ్డాను. ఐ యామ్ వెరీ సారీ" అని సమంత ముఖంలోని డిజప్పాయింట్‌మెంట్ గమనించి, "మిమ్మల్ని యుఎస్‌కి పంపడంవల్ల నాకున్న అడ్వాంటేజెస్ ఏంటి?" అడిగాడు కాస్త బిడియంగానే. కర్కరే మాట్లాడేది అర్థమైంది సమంతకు. తనది ఫూలిష్‌నెస్ అనేది అర్థమైంది.

కర్కరే తనని ఆశించేప్పుడు అతడి సహకారంతో అబ్రాడ్ వెళ్ళడం ఎలా సాధ్యమవుతుంది? మాడిపోయిన ముఖంతో కర్కరే చాంబర్ నుండి బయటకు వచ్చింది. తన సీట్‌లోకి వెళ్ళి సమంత కూర్చునేటప్పుడు సమీర గమనిస్తూనే ఉంది. ఆమె ముఖం అప్రసన్నంగా ఉండడం గమనించింది. లంచ్ టైంలో అడిగింది.

"కర్కరే సర్ ఏమైనా అన్నారా?" అడిగింది సమీర. జరిగింది చెప్పింది సమంత. "నీకసలు మెదడు ఉందా? అబ్రాడ్ ఆలోచనలేంటి? శ్రీకర్ ఏం కావాలి? కర్కరే నీకు ఫేవర్ చేస్తాడని ఎందుకు అనుకున్నావు?" ప్రశ్నలు గుప్పించింది సమీర. "శ్రీకర్‌ని సంతోష పెట్టేందుకు నేను దుఃఖపడలేను. మధ్యే మార్గం కోసమే ప్రయత్నిస్తున్నాను..?" అంది సమంత. "పిచ్చిగా మాట్లాడకు" అంది సమీర. "ఇక్కడ ఉంటే నాకు పిచ్చెక్కడం ఖాయం. అతన్ని తృణీకరించలేను. అతడి కోరిక అంగీకరించలేను. నా తల్లిని సంతోషపెట్టడం ఎంత అవసరమని నేననుకున్నానో అతడి తండ్రిని ఆనందపర్చడం కూడా అంతే అవసరమని అతడనుకుంటున్నాడు. అతడి కోరిక నేను తీర్చలేను." "సమంతా, ఆడవాళ్ళందరూ నీలా ఆలోచిస్తే మానవజాతే ఉండదు కదా?" నిస్సహాయంగా అంది సమీర. "సమూ ఆంత్రోపాలజీ చెప్పొద్దు. నా సైకాలజీని అర్థం చేసుకో" అంది డెస్పరేట్‌గా సమంత. సమీర ఏదో మాట్లాడబోయింది. సమంత ఆ అవకాశం ఇవ్వకుండా పైకి లేచింది.

•••

ఆ రాత్రి శ్రీకర్ గుండెలపై చేరింది సమంత. ఇటీవలి కాలంలో ఆమె అంతప్రేమ చూపిన దాఖలాలు లేవు. "శ్రీ నాదొక చిన్న రిక్వెస్ట్" అడిగింది.

"రిక్వెస్టా" అన్నాడు ఆశ్చర్యంగా. ఎప్పుడూ ఆజ్ఞలు జారీ చేయడం తప్ప రిక్వెస్టుగా సమంత అడగడం వినలేదు.

"అవును. మీ నాన్నగారి కోరిక తీర్చడం ఆయన బిడ్డగా మీ బాధ్యత కదా? దానికి సహకరించడం నాకూ

## పరిణీతిని పక్కన పెట్టేశారు

ఇటీవలి దాకా మహేష్ బాబు కొత్త సినిమాలో పరిణీతి చోప్రా హీరోయిన్ అని ప్రచారం జరిగింది. దాదాపు ఈ పేరు ఖరారైనట్టే అన్న వార్తలు కూడా వచ్చాయి. కానీ ఉన్నట్టుండి ఆమెను పక్కన పెట్టేశారని అంటున్నారు. కారణం తెలుగు ప్రేక్షకులు పరిణీతిని ఎంత వరకూ రిసీవ్ చేసుకుంటారన్న అనుమానమేనట! దీపికా, కత్రినా తెలిసినంతగా తెలుగు ప్రేక్షకులకు పరిణీతి గురించి తెలియదు. దానికి తోడు ఆమె అడుగుతున్న రెమ్యునరేషన్ కూడా దర్శకనిర్మాతలకు చుక్కలు చూపించేటట్టే ఉందట! అంత ఇచ్చి ఆమెను తీసుకునే బదులు టాలీవుడ్‌లో టాప్‌రేస్‌లో ఉన్న రకుల్‌ని తీసుకుంటే ఎలా ఉంటుందన్న ఆలోచనలో యూనిట్ ఉందని సమాచారం. మొత్తానికి పరిణీతి పేరయితే తెర వెనుకకు వెళ్ళింది అన్నది మాత్రం పక్కా సమాచారం అంటున్నారు.

బాధ్యత కదా" అంది. సమంత ఏం చెప్పబోతోందో చూచాయగా అర్థమైంది శ్రీకర్‌కి.

"ఏమంటావ్?" అడిగాడు. "మీరు మరొకరిని పెళ్ళి చేసుకోండి. చట్టబద్ధమైన హక్కు మీకు సంక్రమిస్తుంది" అంది. దెబ్బతిన్నట్టు చూశాడు శ్రీకర్. "నిన్నొక సైకియాట్రిస్ట్‌కి చూపించాల్సిన అవసరం ఉందని భావిస్తున్నా" అన్నాడు కోపంగా. "చూపించండి. అతడికి మన అగ్రిమెంట్ పేపర్లు చూపిస్తా. ఆయన అవసరం నాకో మీకో ఆయనే చెబుతారు" అంది. శ్రీకర్ మూడ్ జారిపోయింది. క్షురకుడు సొరుగులోంచి కత్తి తీసినట్టు ప్రతిసారీ అగ్రిమెంట్ గురించి ప్రస్తావించడం ద్వారా సమంత ఏం సాధించదలచుకుందో అర్థం కావడంలేదు. సమంతను మార్చడం తనవల్లకాదని అర్థమవుతోంది. ఆ మరుసటిరోజు సమంత ప్రపోజల్ గురించి రమణకు చెప్పాడు శ్రీకర్. "సమంత నిన్ను ప్రేమిస్తోంది కాబట్టే ఇంతకూల్‌గా తన అభిప్రాయం చెబుతోంది. నిజానికి తను నిన్ను వదులుకోవాలనుకుంటే, నీ అనుమతి అవసరం లేదు. లీగాలిటీగా చేసుకునే వివాహంద్వారా నీ వంశం నిలబడాలన్న ఉద్దేశాన్నే తను వ్యక్తం చేస్తోంది. నిన్నూ నీ పరిస్థితినీ అర్థం చేసుకుంది కాబట్టే సహకరిస్తానంటోంది. నిజానికి సమంత సై అంటే కర్కరే ఆమెతో సహజీవనానికి సిద్ధంగా ఉన్నాడు" చెప్పాడు రమణ. "నన్ను కన్ఫ్యూజ్ చేస్తుందో తను కన్ఫ్యూజ్ అవుతోందో అర్థం కావట్లేదు" డెస్పరేట్‌గా అన్నాడు శ్రీకర్.

'తనలో ఏ మాత్రం కన్ఫ్యూజన్ లేదు. తను నిర్దేశించుకున్న రేఖలను దాటిరావడం లేదు. నువ్వే వర్రీ అవుతున్నావు. కొన్నాళ్ళు పిల్లల ప్రస్తావన తీసుకురాకు. ప్రేమతో ఆమెను జయించు. కాలం అన్ని ప్రశ్నలకూ సమాధానం చెబుతుంది" చెప్పాడు రమణ.

శ్రీకర్ ఆలోచనలో పడ్డాడు.

●●●

"వ్వాట్" అరిచినంత పని చేశాడు కర్కరే.

"ఆర్ యూ సీరియస్" తనే అన్నాడు.

"సీరియస్‌గానే చెబుతున్నా సర్, శ్రీకర్‌తో నా అగ్రిమెంటు రద్దు చేసుకోదలిచాను" అంది సమంత. "మరి దానికి నా సహకారమేమైనా అవసరమా?" ఆత్రుతగా అడిగాడు కర్కరే.

"అవును సర్...ప్రాజెక్ట్ వర్క్ మీద యుఎస్‌కి పంపండి" అభ్యర్థించింది. కర్కరే ముఖంలోకి మళ్ళీ కోపం వచ్చింది. "అది సాధ్యం కాదని చెప్పా గదా" అన్నాడు. "ఒక్కదానిగా వెళ్ళడం సాధ్యం కాకపోవచ్చు సర్, మీతో వెళ్ళడం సాధ్యమే కదా" అంది సమంత. ఆశ్చర్యం, ఆనందం కలగలిసిన గొంతుతో, "వ్వాట్" అన్నాడు.

"అవును సర్ మీరు కూడా యుఎస్ ప్రాజెక్టులోకి వస్తే ఆఫీసులోనూ, ఇంట్లోనూ తోడుగా ఉంటా" చెప్పింది.

"అన్వర్..." దరిదాపు అరిచినట్టే పిలిచాడు. చాంబర్ బయట ఉన్న అన్వర్ "సార్" అంటూ వచ్చాడు. "సమంత మేడమ్‌కి మ్యాంగో జ్యూస్ పట్టుకురా.." దరిదాపు అరిచాడు. తన బాస్ ఎగ్జైట్‌మెంట్ దేనికో అన్వర్‌కి అర్థంకాలేదు. "వద్దు సార్..నో థాంక్స్" అంది. "మై ప్లెజర్ సమంతాజీ" అన్నాడు మర్యాద మరింత ఉట్టిపడే స్వరంతో. "ఈ నిర్ణయం సీరియస్‌గానే తీసుకుంటున్నారా?" అడిగాడు తనని తాను గిల్లుకుంటూ. "ఎస్ సర్, శ్రీకర్‌కి కొన్ని కంపల్షన్‌లున్నాయి. అవి అతడు ఫిల్ చేయలేకున్నాడు. నిజానికి అతడి మీద నాకు ఉన్నది లిప్ సింపతీ కాదు" అంది. "సానుభూతితో వదులుకుంటున్నారా?" అడిగాడు కర్కరే. "ఒకవిధంగా అటువంటిదే సార్" చెప్పింది సమంత. "థాంక్స్ సమంతా నేను సీరియస్‌గా ఎఫర్ట్ పెడతా. ఐ వాంట్ యూ" అన్నాడు కర్కరే సమంత అందాన్ని కళ్ళతో జుర్రుకుంటూ.




●●●

"పిచ్చి పిచ్చిగా మాట్లాడకు. ఆ ముసలాడికి దసరా పండగ అవసరమా?" అరిచింది సమీర. "అతడి వయసుతో నాకు పనిలేదే. ఇక్కడ టార్చర్ భరించలేకపోతున్నాను. నా వల్ల ఎవరూ సఫర్ కావడం నాకిష్టం లేదు" చెప్పింది సమంత.

"స్టుపిడ్‌లా మాట్లాడకు. శ్రీకర్ నీ దేహాన్ని మాత్రమే ప్రేమించలేదు. నిన్ను నిన్నుగానే కోరుకున్నాడు. అతడు నిన్ను వదులుకుంటాడని నేను అనుకోవడం లేదు" అంది సమీర.

"అతడు వదులుకోవలసిన అవసరం లేదు. వదిలేది నేనే కదా" అంది.

చెంప చెళ్ళుమనిపించింది సమీర. "జీవితమంటే బొమ్మలాట అనుకుంటున్నావా?" అంది కోపంగా.

"శ్రీకర్ కూడా నన్నెప్పుడూ ఇలా కొట్టలేదు కదే" అంది చెంప రుద్దుకుంటూ సమంత. వెనువెంటనే సమంతను కౌగిలించుకుని ఏడ్చేసింది సమీర. సమంతలో కూడా కన్నీళ్ళు తిరిగాయి. "ప్లీజ్ ట్రైటూ అండర్ స్టాండ్ మీ" అంది సమంత.

"ఛీ పోవే" అంటూ విసవిసా బయటకు నడిచింది సమీర. నేరుగా ఇంటికి వెళ్ళింది. ఇంట్లో రమణ లేడు. సెల్ తీసి నెంబర్ నొక్కి "రమణా నువ్వు వెంటనే రా" అంది.

"కొంచెం వర్క్ ఉంది మీరా?" అన్నాడు రమణ

సమీరకు కోపం వచ్చింది. "నోరు మూసుకొని రా, అవసరమైతే ఉద్యోగానికి రాజీనామా చేసిరా" అంతే కోపంగా అంది. "సమ్‌థింగ్ రాంగ్" అనుకున్నాడు రమణ. "ఓకే..ఓకే..రా కూల్...వస్తున్నా" చెప్పాడు. సమీర కన్సీవ్ అయి ఉంది. ఎమోషనల్ అయితే అబార్షన్ అవుతుందనీ, జాగ్రత్తగా చూసుకోమని చెప్పింది డాక్టర్. అదే గుర్తొచ్చింది అతడికి. సమీర ఎమోషన్‌కి సమంత సమస్యే కారణమని సగం ఊహించాడతను. "తన గురించి వర్రీ కాకు" అని అతడెన్నిసార్లు చెప్పినా సమంతగురించి ఆలోచించకుండా ఉండలేదు సమీర. సమంతతో ఉన్న అటాచ్‌మెంట్ అటువంటిది.

సమీర తన గురించి ఆలోచించే సమయం కంటే సమంత గురించి ఆలోచించే సమయమే ఎక్కువ అనుకున్నాడు రమణ. తన స్నేహితురాలు జీవితాన్ని ధ్వంసం చేసుకుంటుందన్న బెంగ సమీరలో ఎక్కువైంది. "ఎమోషన్ కాకు మీరా" అని అతడెన్నిసార్లు చెప్పినా తను ఎమోషన్ కాకుండా మాత్రం ఉండలేకపోతోంది. మళ్ళీ కొత్తగా ఏం ఉపద్రవం ముంచుకొచ్చిందా అన్న విషయం అతడికి అర్థం కాలేదు. ఆలోచనల మధ్యే రమణ ఇంటికి చేరాడు. దారిలో ఒకసారి శ్రీకర్‌కి ఫోన్‌చేశాడు. "ఏమైనా విశేషాలున్నాయా?" అని అడిగాడు ఆరా తీస్తూ. "ప్రత్యేకంగా ఏమీలేవురా...ప్రాజెక్టు వర్క్ మీద ఉన్నాను. కాల్ బ్యాక్ ఆఫ్టర్ సమ్‌టైమ్" చెప్పాడు. రమణను చూడగానే ఏడ్చేసింది సమీర.

"ఏమైందిరా.." అడిగాడు లాలనగా దగ్గరకు తీసుకుంటూ. జరిగింది చెప్పింది. రమణకూ కోపం వచ్చింది. "తనకేమైనా మెంటలా?" అన్నాడు కోపంగా. "అటువంటిదే, మొండితనం, పెంకితనం ఎక్కువ" అంది కోపం నిస్పృహ కలిగినస్వరంతో.

"ఇప్పుడేం చేద్దాం" అడిగాడు రమణ.

"సమంత అమ్మా మావయ్యలకి చెబుదాం" అంది.

"దానివల్ల ఏం ప్రయోజనం ఉంటుంది. శ్రీకర్‌తో సరిపడకే కర్కరేతో వెళుతున్నా అంటుంది అంతే కదా" అన్నాడు రమణ.

"మరి ఇప్పుడేంచేద్దాం" అడిగింది ఆదుర్దాగా సమీర.

ఆలోచనల్లో పడ్డాడు రమణ.

"ఏదో అద్భుతం జరిగితే తప్ప తన నిర్ణయం మారదు" నిస్పృహతోనే అంది సమీర. "ఈ విషయం శ్రీకర్‌కి తెలుసా?" అడిగాడు రమణ. "బహుశా తెలిసి ఉండదు. అది కర్కరేని కలిసిన తర్వాత నేరుగా నాతోనే ఈ విషయం చెప్పింది" సమీర అంది. "ఈ విషయం బయటకు చెప్పకు, శ్రీకర్ తట్టుకోలేడు" అన్నాడు రమణ శ్రీకర్‌ని తలుచుకుంటూ. చేత్తో తలకొట్టుకుంది సమీరా. "మీరా... ప్లీజ్ డోంట్ బి ఎమోషనల్.." అన్నాడు అనునయంగా రమణ. "సాధ్యం కావట్లేదు రమణా" అంది సమీర కన్నీరు ధారాపాతమవుతుండగా.

(ఇంకా వుంది)






## LORD SHIVA THE SYMBOL OF PERFECT C E O

**D.Rambabu**

Price 199 Rupees
Pages 190
For copies
Srivari publications,
Chennai. phone no.
09841045892

**ఒ**క సంస్థ లేదా కంపెనీ లేదా అతి పెద్ద వ్యవస్థ ఒడిదుడుకులు లేకుండా పది కాలాలు సక్రమంగా కొనసాగాలంటే కావాల్సింది కార్యనిర్వహణాదక్షత. పద్ధతి ప్రకారం ఈ కార్యనిర్వహణ చేయగలవాడికి ఎంతో ఏకాగ్రత, చిత్తశుద్ధి, ఆత్మవిశ్వాసం అవసరం. అలాంటి దీక్షాదక్షతలున్న వాడు, సర్వాంతర్యామి పరమశివుడే. సంపూర్ణమైన, నిర్దోషమైన ప్రధాన కార్యనిర్వాహకుడతడు. నేటి ఆర్థిక సమాజంలో కీలక వ్యవస్థల నిర్వహణకు అవసరమైన గుణగణాలను శివుడినుండి స్వీకరించాలని పేర్కొంటూ, సమర్థుడైన సి ఇ ఓ కు అతణ్ణి ఒక ప్రతీకగా ఈ పుస్తకంలో చూపించారు రచయిత. విజయగ్రూపు హాస్పిటల్స్ జనరల్‌మేనేజర్ బాధ్యతలు నిర్వహిస్తున్న డి.రాంబాబు చేసిన ఈ రచనను ఆవిష్కరించిన ఏ.పి.ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు ఈ రచనను ఎంతగానో ప్రశంసించారు. ఒక సి ఇ ఓ లో ఉండాల్సిన గొప్ప గుణగణాలు, విభిన్న దృక్కోణాలను ఆ పరమశివుడిలో చూపించారు. ఒక వ్యవస్థను ఎంతో చక్కగా, విజయవంతంగా నిర్వహించడానికి ఇలాంటి లక్షణాలు ఎలా దోహదం చేస్తాయో వివరించారు రచయిత రాంబాబు.

---

## క్రైస్తవం అండ్ జెన్

**మూలం** ఓషో
**అనువాదం** భరత్
**ధర:** 225 రూపాయలు
**పేజీలు:** 200
**ప్రతులకు:** విశాలాంధ్ర, నవచేతన, ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు.

**మ**తాతీత భావవాది ఓషో. అస్తిత్వవాదానికీ, స్వీయ కర్తృత్వ వాదానికీ కట్టుబడిన ఫిలాసఫర్. మనం నమ్మలేని ఎన్నో చారిత్రక సత్యాలకు, ఓషో భావాలకు ప్రతీక ఈ రచన. మనం కోల్పోతున్న జీవితాన్ని, విస్మరిస్తున్న సత్యాలను ఆవిష్కరించిన పుస్తకమిది. ఇది చదివాక మతం గురించి మనం తప్పకుండా లోతైన ఆలోచనలో కూరుకుపోతాం. అనువాదకుడు భరత్ ఎలాంటి సంక్లిష్టతా లేకుండా సరళంగా పాఠకులకు ఈ రచన అందించారు.



---



## అజరామరం

ఎమ్వీ రామిరెడ్డి కవిత్వం
**ధర:** 80 రూపాయలు
**పేజీలు:** 104
**ప్రతులకు:** ప్రముఖ పుస్తక కేంద్రాలు

**సా**హితీలోకానికి సుపరిచితుడు రామిరెడ్డి. ఆయన సజీవ దృశ్యాల సమ్మేళనం ఈ కవితా సంపుటి. మనిషంటే నాకు మహా ఇష్టం, మనిషితనం అజరామరం అని 39 కవితల ఈ సంపుటిలో పేర్కొంటూ తన కవిత్వ చిరునామా ప్రకటించారిందులో.

## స్వీకారాలు

**పాశుపతం** (ఇంటర్నేషనల్ స్పై థ్రిల్లర్)
మంచాల శ్రీనివాసరావు
**ధర:** 100 రూపాయలు, **పేజీలు:** 104
**ప్రతులకు:** సాయి వెంకటరమణ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, హైదరాబాద్
సెల్ 9676799500, ప్రధాన పుస్తక కేంద్రాలు

**సైన్స్ పద్ధతి కొన్ని సిద్ధాంతాలు**
డాక్టర్ కె.బి.గోపాలం
**ధర:** 20 రూపాయలు, **పేజీలు:** 40
**ప్రతులకు:** విజ్ఞాన ప్రచురణలు (జనవిజ్ఞాన వేదిక), నెల్లూరు-04 ఫోన్ 94405 03061

**కాలుతున్న పూలమొగ్గలు**
కవితల సంకలనం
**ధర:** అమూల్యం
**పేజీలు:** 34
**ప్రతులకు:** భూపాల్, రాయల్ స్క్వైర్ అపార్ట్‌మెంట్, 5 ఫేస్, కే.పి.హెచ్.బి.కాలనీ, హైదరాబాద్-72

*-లలితాత్రిపురసుందరి*

# సత్యం-అసత్యం

## నోబెల్ కథలు

-సిగ్రిడ్ అండ్సెట్



*సిగ్రిడ్ అండ్సెట్ 20 మే 1882న డెన్మార్క్‌లో జన్మించారు. 1928లో సాహిత్యంలో నోబెల్ బహుమతి అందుకున్నారు. 67వ యేట 10 జూన్ 1949న నార్వేలో మరణించారు.*

**సత్యం, అసత్యం ఇద్దరూ అన్నదమ్ములు. తండ్రి లేడు. ఎలాంటి ఆస్తిపాస్తులూ లేవు. పూటగడవడమే కష్టంగా ఉండేది. అయినా తల్లి ఆపనీ ఈపనీ చేస్తూ, పిల్లల్ని పెంచి పెద్దచేసింది. సత్యం ఎప్పుడూ మంచిపనులు చేస్తూ అందరికీ తలలో నాలుకలా మెలిగేవాడు. అసత్యం అన్నకు పూర్తిగా భిన్నం. ఎప్పుడూ అబద్ధాలు చెబుతుండేవాడు. అన్నీ పనికిమాలిన పనులే. అందుకే అతని మాటలు ఎవరూ నమ్మేవాళ్ళు కాదు. కొడుకులు పెద్దవాళ్ళవ్వగానే జీవనాధారం వెతుక్కోమంటూ తల్లి వాళ్ళను బయటకు పంపేసింది. ఇద్దరూ చెరొక మూటలో ఆహారం తీసుకుని ఇంటినుంచి బయలుదేరారు.**

అలుపూసొలుపూ లేకుండా నడక సాగించారు. సాయంత్రమైంది. అడవిలోకి ప్రవేశించారు. కాసేపు విశ్రాంతి తీసుకుందామని గుబురుగా ఉన్న ఓ చెట్టునీడన చేరి, ఆహారం మూటలు తీశారు. రోజంతా ప్రయాణం చేయడంతో అప్పటికే వాళ్ళు చాలా ఆకలితో ఉన్నారు.

"నువ్వేమనుకోనంటే నేనొకమాట చెప్పనా! ముందు నీ మూటలో ఉన్న ఆహారాన్ని ఇద్దరం తినేద్దాం. అది పూర్తిగా అయిపోయిన తర్వాత నా మూటలో ఆహారం తిందాం" అన్నాడు అసత్యం.

దానికి సత్యం సంతోషంగా ఒప్పుకున్నాడు. ఇద్దరూ సత్యం మూటలోదే తిన్నారు. అన్న మూటలోని ఆహారాన్నంతా ఆబగా నోటకుక్కుకున్నాడు. కొంత ఆహారం తీసుకుని సర్దుకున్నాడు సత్యం. మర్నాడు ఉదయం, మధ్యాహ్నం కూడా వాళ్ళు సత్యం మూటలో ఆహారాన్నే తిన్నారు. సత్యం మూట ఖాళీ అయిపోయింది. రాత్రి వరకూ నడిచిన తర్వాత వాళ్ళు మళ్ళీ ఆహారం కోసం ఆగారు. అసత్యం మూటలో ఆహారాన్ని సత్యం తీసుకోబోతుండగా అసత్యం అడ్డుకున్నాడు. ఆ ఆహారం అంతా తన ఒక్కడిదేనని, అది తనకు మాత్రమే సరిపోతుందని అన్నాడు.

"మరి నా మూటలోని ఆహారం పూర్తిగా అయిపోయేంత వరకూ నువ్వూ తిన్నావుగా" అని అడిగాడు సత్యం.

"నీ ఆహారాన్ని నీ కళ్ళముందే ఇంకొకడిని తిననిచ్చిన మూర్ఖుడివి. సరిగ్గా తినడం కూడా చేతకానివాడివి. నీకు తిండి కూడా అనవసరం. ఇక్కడే కూర్చొని ఆకలికి మాడి చావు" అన్నాడు అసత్యం.

"సరేకానీ, నువ్వు పేరుకు తగ్గట్టే అసత్యానివి. నీ బుద్ధి కూడా వంకర బుద్ధే. ఇంక నువ్వు మారవా. జీవితాంతం నీ బుద్ధి ఇలాగే ఉంటుందా?" అని మందలించాడు సత్యం.

సత్యం అలా అనగానే అసత్యం కోపంతో ఊగిపోయాడు. అన్న దగ్గరికి వచ్చి అతని రెండు కళ్ళూ పెరికివేశాడు.

"ఇప్పుడు జనాన్ని చూసి వాళ్ళు అసత్యవాదులు అవునో కాదో తెలుసుకో గుడ్డివెధవా" అంటూ అన్నని వదిలిపెట్టి పారిపోయాడు. పాపం సత్యం కళ్ళు కనిపించక ఆ అడవిలో ఎటువెళ్ళాలో దిక్కుతోచక అల్లాడిపోయాడు. చేతులతో తడుముకుంటూ వెళుతున్నప్పుడు అతని చేతికి ఒక నిమ్మచెట్టు కాండం తగిలింది. అడవిలోని క్రూరమృగాల బారినుండి తప్పించుకోడానికి ఆ రాత్రి చెట్టు మీద గడిపి తెల్లవారుజామున పక్షుల కిలకిలా రావాలు వినిపించగానే తిరిగి ప్రయాణం ప్రారంభించాలని అనుకుని సత్యం చెట్టెక్కి కూర్చున్నాడు. అతను కూర్చున్న కొద్దిసేపటికే చెట్టుకింద అలికిడి వినిపించింది. అడవిలోని జంతువులు కొన్ని సెయింట్‌జాన్ ఉత్సవం జరుపుకోవడానికి ఒకటొకటే చెట్టు కిందకు చేరుకుంటున్నాయి.

ఎలుగుబంటి, తోడేలు, నక్క, కుందేలు...జంతువులన్నీ చెట్టుకింద చేరాయి. అవి తింటూ తాగుతూ కాసేపు ఆనందంగా గడిపాయి. తిన్నతర్వాత కాసేపు ముచ్చటించుకుంటూ కూర్చున్నాయి.

"మనలో ప్రతి ఒక్కళ్ళూ ఏదన్నా చిన్నకథ చెబితే బాగుంటుంది కదా" నక్క అంది.

మిగిలిన జంతువులన్నీ దానికి ఒప్పుకున్నాయి. అది మంచి సరదా కాలక్షేపమని అవి అన్నాయి. మొదట ఎలుగుబంటి కథ మొదలు పెట్టింది.

"ఇంగ్లాండు రాజుకి దృష్టి లోపం ఉంది. అడుగు ముందున్న దానిని కూడా చూడలేడు. అయితే ఆయన పొద్దున్నే ఈ నిమ్మచెట్టు దగ్గరికి వచ్చి ఆకుల మీద ఇంకా మంచుబిందువులు ఉండగానే ఆ మంచుతో కళ్ళను రుద్దుకుంటే ఆయనకు మళ్ళీ ఎప్పట్లా చూపువస్తుంది" చెప్పింది ఎలుగుబంటి.

"అవునవును. అంతేకాదు. రాజుకి ఒక మూగ, చెవిటి కూతురు ఉంది. అయితే నాకు తెలిసింది ఆయనకు తెలిస్తే ఆయన కూతుర్ని బాగుచేసుకోగలడు. పోయిన ఏడాది ఆమె చర్చికి వెళ్ళింది. అప్పుడు ఆమె నోట్లో నుంచి ఒక రొట్టెముక్క కింద పడిపోయింది. ఒక పెద్దకప్ప ఆ రొట్టె ముక్కను మింగేసింది. వాళ్ళు చర్చి గర్భస్థలంలో తవ్వితే అక్కడ ఆ పెద్ద కప్ప కనిపిస్తుంది. కప్పను చంపి, దాని నోట్లో ఇరుక్కుపోయిన రొట్టె ముక్క తీసుకువచ్చి రాజకుమార్తెకు ఇస్తే ఆమె మళ్ళీ అందర్లా మాట్లాడగలదు, వినగలదు" అంది తోడేలు.

"అదంతా సరే. ఇంగ్లాండు రాజుకి నాకు తెలిసిన విషయం తెలిస్తే చాలా ఉపయోగం. రాజభవనంలో మంచినీటి కొరత ఉంది. రాజభవనం ఆవరణలో ఉన్న పెద్దరాతిని తొలగిస్తే దానికింద స్వచ్ఛమైన మంచినీటి ఊట ఉంది. కానీ ఈ విషయం రాజుకి తెలియాలిగా" అంది నక్క.

"ఇంగ్లాండు రాజుకి ప్రపంచంలో అందరికన్నా మంచి తోట ఉంది. అయితే అక్కడి చెట్లు సరిగా కాయవు. పూయవు. తోటలో ఒకచోట పెద్దబంగారు గొలుసు మూడు చుట్టలు చుట్టుకుని నేలలో కూరుకుపోయి ఉంది. దాన్ని తవ్వితీస్తే దేశం మొత్తం మీద అంత చక్కటితోట ఇంకొకటి ఉండదు" కుందేలు అంది.

"సరే సరే, ఇప్పటికే పొద్దుపోయింది. మనం ఇంటికి వెళ్ళిపోవడం మంచిది" నక్క అంది.

జంతువులన్నీ దేని దారిన అవి వెళ్ళిపోయాయి.

సత్యం చెట్టుమీదే నిద్రపోయాడు. తెల్లవారిన తర్వాత పక్షుల కిలకిలారావాలకు అతనికి మెలకువ వచ్చింది. సత్యం నిమ్మాకుల మీది మంచును తీసుకుని కళ్ళమీద రుద్దుకున్నాడు. వెంటనే అతనికి ఎప్పట్లా చూపు వచ్చేసింది. అప్పుడు అతను సరాసరి ఇంగ్లాండు రాజభవనం వద్దకు వెళ్ళి ఏదన్నా పని ఇప్పించవలసిందని కోరాడు. వెంటనే అతనికి పని దొరికింది.

ఒకరోజు రాజు రాజభవనం ముందున్న తోటలోకి వచ్చాడు. ఒక నాలుగడుగులు నడిచాడో లేదో

**పిల్లలిద్దరినీ ఎంతో కష్టపడి పెంచి పెద్దచేసింది ఆ తల్లి. జీవనాధారం వెతుక్కోమని పంపింది. అన్నదమ్ములిద్దరూ దేశాటనకు బయలుదేరారు. అడవిమార్గంలో ప్రయాణిస్తూ అలసిపోయారు. ఆకలేసింది. విశ్రాంతికోసం ఆగిన ఆ సాయంత్రం, ఆ రాత్రి పొద్దుపోయాక ఆ అడవిలో ఏం జరిగింది? అన్నదమ్ములిద్దరూ ఏం చేశారు? వారికి మంచి జీవనాధారం దొరికిందా? లేదా?**

ఆయనకి దాహమనిపించింది. అక్కడే ఉన్న పంపు లోంచి నీళ్ళు పట్టుకుని తాగుదామనుకున్నాడు. ఆ రోజు ఎండ బాగా కాసింది. రాజుకి విపరీతంగా దాహంగా ఉంది. అయితే పంపులోంచి వచ్చిన నీళ్ళు మురికిగా వాసనతో ఉన్నాయి. రాజు విసిగిపోయాడు.

"రాజభవనంలో ఉన్నంత నీటి కటకట ఇంకెక్కడా ఉంటుందనుకోను. ఈ మురికి నీటినే కొండల్లోంచి పైపుల ద్వారా తెచ్చుకోవలసి వచ్చింది. ఇదే దౌర్భాగ్యమంటే" రాజు నిట్టూర్చాడు.

"మహారాజా! మీరు నాకు కొందరు మనుషుల్ని సాయంగా పంపితే ఈ ఆవరణలో ఉన్న పెద్ద రాతిని తొలగిస్తాను. ఆ రాయి కింద స్వచ్ఛమైన నీరు ఉంది" సత్యం చెప్పాడు.

రాజు అందుకు అంగీకరించాడు. ఆవరణలోని రాయిని తొలగించగానే స్వచ్ఛమైన జల ఆకాశంలోకి ఎగిసింది. అంత స్వచ్ఛమైన నీరు ఇంగ్లాండులో ఇంకెక్కడా లభించదు. తర్వాత కొన్ని రోజులు గడిచిపోయాయి.

ఒకరోజు రాజు రాజభవనంలో పచార్లు చేస్తుండగా ఒక గద్ద వచ్చి కోడిపిల్లల్ని ఎత్తుకుపోవడానికి చూసింది. అందరూ చప్పట్లుచరిచి దాన్ని తోలేయడానికి చూశారు.

"అదుగో గద్ద అక్కడ ఉంది" అంటున్న పరిచారకుల మాటలు విని రాజు తుపాకితో దాన్ని కాల్చబోయాడు. అయితే చూపు సరిగా ఆనకపోవడంతో దాన్ని కాల్చలేక నిరాశపడిపోయాడు.

"నా కళ్ళు బాగవడానికి ఎవరైనా మార్గం చెబితే బాగుండు. నేను త్వరలోనే పూర్తిగా అంధుడిని అయిపోతానని భయంగా ఉంది" అని రాజు అన్నాడు.

"నేను మీకు ఒక ఉపాయం చెప్పగలను" అంటూ సత్యం తన కళ్ళు ఎలా బాగయ్యాయో రాజుకి చెప్పాడు. రాజు అదేరోజు మధ్యాహ్నం నిమ్మచెట్టు దగ్గరికి బయలుదేరి వెళ్ళాడు. మర్నాడు ఉదయం నిమ్మచెట్టు ఆకులపై ఉన్న మంచుతో కళ్ళు రుద్దుకోగానే ఆయనకు చూపు వచ్చేసింది. ఆ రోజు నుంచీ రాజుకి సత్యం అంటే అభిమానం పెరిగిపోయింది. రాజు ఇంట్లో ఉన్నా, బైటకు వెళ్ళినా సత్యాన్ని తన వెంటే ఉంచుకోసాగాడు.

ఒకరోజు రాజు, సత్యం తోటలో తిరుగుతున్నప్పుడు రాజు తోట పరిస్థితి చూసి దిగులు పడ్డాడు. "ఇంగ్లాండులో తోటల మీద నేను ఖర్చుపెట్టినంత ఇంకెవ్వరూ పెట్టరు. అయినా నా తోటలో చెట్లకి కాయలు కాయడం లేదు. పూలు పూయడం లేదు" అన్నాడు.

"మీ తోటలో నేల అడుగున చుట్టలు చుట్టుకుని ఉన్నదాన్ని నాకు ఇవ్వడానికి ఒప్పుకుని నేలను తవ్విస్తే మీ తోట విరగకాస్తుంది" సత్యం చెప్పాడు.

రాజు అందుకు అంగీకరించాడు. మనుషుల్ని పిలిపించి తోట తవ్వించాడు. నేలలో చుట్టలు చుట్టుకుని ఉన్న పెద్ద బంగారు గొలుసు బైటపడింది. దానితో సత్యం ఒక్కసారిగా ధనవంతుడయ్యాడు. ఎంత అంటే రాజుని మించిపోయేంత! అయినప్పటికీ రాజు చాలా సంతోషించాడు. ఆయన ప్రాణానికి ప్రాణమైన తోట విరగకాస్తోంది. కాయల బరువుతో కొమ్మలు నేలను తాకుతున్నాయి. అంత తియ్యటి యాపిల్స్‌ని, రేగుపళ్ళని జనం రుచి చూసి ఎరుగరు.

మరొకరోజు రాజు, సత్యంతో కలిసి తోటలో పచార్లు చేస్తుండగా యువరాణి ఎదురుపడింది. రాజు ఆమెని చూసి విచారంగా తలదించుకున్నాడు.

"రాజ్యమంతా యువరాణి అందం గురించి మాట్లాడుకుంటారు. కాని ఏం లాభం? యువరాణి మాట్లాడలేదు, వినలేదు. ఇంతకంటే దౌర్భాగ్యం ఏముంటుంది?" అన్నాడు సత్యంతో.

"మీరు దిగులు చెందకండి రాజా, దానికి కూడా ఒక మార్గం ఉంది" సత్యం అన్నాడు.

రాజు అది విని రాజకుమార్తె తిరిగి మామూలుగా అయితే సత్యానికి ఆమెనిచ్చి పెళ్ళిచేసి అర్థ రాజ్యం కానుకగా ఇస్తానని మాట ఇచ్చాడు. సత్యం కొంతమంది మనుషుల్ని పంపించి చర్చి గర్భస్థలంలో తవ్వించాడు. దానికింద ఉన్న పెద్దకప్పను చంపి దాని నోట్లో ఉన్న రొట్టెముక్కను తెచ్చి రాజకుమార్తెకు ఇచ్చాడు. ఆ క్షణం నుంచీ ఆమె అందరిలా మాట్లాడడం మొదలు పెట్టింది.

రాజు సత్యానికి యువరాణినిచ్చి వివాహం చేశాడు. వివాహం సందర్భంగా గొప్ప విందు ఏర్పాటుచేశారు. అంతకుముందు అలాంటి విందు గురించి ఎవరూ కనీవినీ ఎరుగరు. రాజ్యం అంతటా ఆ విందు గురించే చెప్పుకోసాగారు. వివాహం అనంతరం నృత్య ప్రదర్శన జరుగుతుండగా ఒక బికారి వచ్చి గుప్పెడు మెతుకులు పెట్టమని ప్రాధేయపడసాగాడు. అతని దుస్తులు చీలికలై మాసిపోయి ఉన్నాయి. సత్యం అతనిని చూసి గుర్తుపట్టాడు. అతను సత్యం సోదరుడు అసత్యం.

"నువ్వు నన్ను ఎరుగుదువా?" సత్యం అతన్ని అడిగాడు.

"నాలాంటివాడు మీవంటి ప్రభువును ఎరగడం సాధ్యమా?"

"నువ్వు నన్ను ఇంతకుముందు చూశావు. సంవత్సరం కిందట నా కళ్ళు పెరికివేసి, అడవిలో వదలిపోయావు. నన్ను గుర్తుపట్టావా?" అని ప్రశ్నించాడు. అయోమయంగా చూశాడు అసత్యం.

"నేను సత్యాన్ని. నీ పేరు అసత్యం. నీ ప్రవర్తనా అసత్యం. ఇదేమాట నేను అంతకుముందే నీకు చెప్పాను. ఇప్పుడూ అంటున్నాను. అయితే నువ్వు నా సోదరుడివి. నీకు ఆహారం తప్పక దొరుకుతుంది. అందుకు నువ్వో పని చెయ్యాలి. పోయిన ఏడాది నువ్వు నన్ను అడవిలో వదిలిపెట్టి పోయిన ప్రాంతంలో ఉన్న నిమ్మచెట్టు దగ్గరికి వెళ్ళు. నీకు మంచి జరుగుతుంది. నీ అదృష్టం పండుతుంది"



అంటూ అన్నీ వివరంగా చెప్పాడు సత్యం.

అసత్యం రెండోసారి చెప్పించుకునేంత వరకూ ఉండలేదు. "సత్యం చెట్టుమీద కూర్చొని ఒక్క ఏడాదిలోనే ఇంగ్లాండు అర్థభాగానికి రాజయ్యాడు. అదే పని నేనూచేస్తే నాకు ఇంకెంత అదృష్టం పడుతుందో!" అనుకున్నాడు. అందుకే అడవికి వెళ్ళి నిమ్మచెట్టు ఎక్కి కూర్చున్నాడు. ఎక్కువసేపు కాకముందే అడవిలోని జంతువులన్నీ అక్కడికి చేరుకుని సెయింట్‌జాన్ ఉత్సవాన్ని జరుపుకోవడం మొదలు పెట్టాయి. తినడం, తాగడం పూర్తయ్యాక "ఇక కథల కార్యక్రమం మొదలుపెడదామా" అని నక్క అడిగింది. అసత్యం చెవులు రిక్కించి వినడానికి సంసిద్ధుడయ్యాడు.

అయితే ఎలుగుబంటి తల పైకెత్తి చిన్నగా అరిచింది.

"గత సంవత్సరం మనం చెప్పుకున్న కథలన్నీ ఎవరో విన్నారని నాకు అనిపిస్తోంది. అందుకనే కథలూ వద్దు ఏం వద్దు. మనం మనకు తెలిసిన విషయాల గురించి నోరిప్పి ఏం మాట్లాడవద్దు. ఎవరి దారిన వాళ్ళం ఇళ్ళకి పోదాం" ఎలుగుబంటి అంది.

దానితో జంతువులన్నీ సెలవు తీసుకుని వాటి దారిన అవి పోయాయి. అసత్యం అంతకుముందు ఎలా ఉన్నాడో అంతే దురదృష్టవంతుడిగా మిగిలిపోయాడు. ఎందుకంటే అతనిపేరే అసత్యం కనుక! అతని స్వభావం కూడా దానికి తగినట్టు ఉండేదే కనుక!

అనువాదం: జి.లక్ష్మి e-mail: guttalakshmi62@gmail.com

బికినీ భామలంటే ఇష్టపడని మగమహారాజులుండరేమో! శరీరం పై భాగంలో ఒక చిన్న బట్ట, కింద భాగంలో మరో బట్ట ఆచ్ఛాదనంగా ఉండే బికినీ అంటే మగవారికే కాదు కొందరు స్త్రీలకూ మోజే! తమ అందాలను యదేచ్ఛగా ప్రదర్శించడానికి దీన్నో సాధనంగా కొందరు మహిళలు ఎంచుకుంటారు కూడా! ఇప్పుడు మనకు దర్శనమిస్తున్న బికినీలను వందల సంవత్సరాల కిందటే ధరించేవారు. కాలక్రమంలో ఎన్నో మార్పులకు చేర్పులకు గురవుతూ ఇప్పుడు రెండు చిన్నచిన్న పీలికల రూపంలో మారిందీ బికినీ. అందుగలదిందులేదను సందేహము వలదు అన్నట్టు ప్రపంచవ్యాప్తంగా చాలా ప్రాంతాల్లో కనువిందు చేస్తున్న బికినీ గురించి....

# బికినీ కహానీ

## పురాతనమైన చరిత్ర

రోమన్ చరిత్రను ఒకసారి పరిశీలిస్తే మహిళలు బికినీలను అప్పట్లోనే ధరించిన ఆధారాలు కనిపిస్తాయి. 17వ శతాబ్దంలో అప్పటి క్రీడాకారిణులు బికినీలు వేసుకుని పోటీల్లో పాల్గొన్న ఆధారాలు ఉన్నాయి. అయితే అప్పుడు కేవలం క్రీడాకారిణులు మాత్రమే బికినీలు ధరించేవారట. మిగతా మహిళలు దీన్ని చూసి భయపడేవారట కూడా! 1951లో జరిగిన ప్రీమియర్ మిస్ వరల్డ్ పోటీలో విజేతగా నిలిచిన స్వీడన్‌కు చెందిన కికి హాకన్సన్ (Kiki Håkansson) బికినీ ధరించి టైటిల్‌ను అందుకుంది. దీనిమీద బోలెడంత వివాదం కూడా చెలరేగింది. ఆ విధంగా టైటిల్‌ని అందుకున్న మొదటి మహిళ, చివరి మహిళ ఆమే అయింది. ఆ తరువాత జరిగిన పోటీల్లో కూడా బికినీని ప్రవేశపెట్టాలని చూసినా, సాంప్రదాయ వాదులు అడ్డు చెప్పడంతో విజేతలు ఎవరూ బికినీ ధరించి టైటిల్ అందుకోవడానికి సాహసించలేదు.

## ఎన్నో మార్పులు చేర్పులు

ప్రారంభంలో బికినీలు పైన గౌనులా, కింద మోకాళ్ళ పై దాకా ప్రాకులా ఉండేవి. సంవత్సరాలు గడుస్తున్న కొద్దీ వాటి సైజు తగ్గుతూ రెండు పీలికల దాకా వచ్చింది. 1930లో పొట్టి నిక్కరు పై భాగాన్ని సన్నని బట్ట కవర్ చేస్తూ ఉండేలా బికినీ సైజు ఉండేది. ఆ తరువాత నలభై సంవత్సరాలకు దాని రూపం చాలావరకూ మారిపోయింది. బికినీలు పురాతనమైనవే అయినా అవి బాగా ప్రాచుర్యంలోకి రావడానికి సుమారు 70 సంవత్సరాలు పట్టింది. ఏడు దశాబ్దాల కిందటి నుంచే అన్ని వర్గాల మహిళలు వీటిని ధరించడం ఓ ఫ్యాషన్ కింద మార్చుకున్నారు.

## బహిరంగ సమావేశంలో....

బికినీలు ధరించడం అనేది పురాతన కాలం నుంచి ఉన్నా, మొట్టమొదటి సారిగా ఫ్రెంచ్‌కి చెందిన మైఖేలెన్ బెర్నార్డిని 1946లో ఓ స్విమ్మింగ్ పూల్ వద్ద నిర్వహించిన సమావేశంలో బికినీ ధరించి పాల్గొంది. అప్పటివరకూ మహిళలు ఎవరూ బహిరంగ సమావేశాల్లో బికినీ ధరించి పాల్గొనక పోవడంతో ఆమె చర్య చర్చనీయాంశమయింది. మొట్టమొదటిసారిగా బహిరంగ సమావేశంలో బికినీ వేసుకున్న మహిళగా ఆమె నిలిచింది. అయితే ఆ తరువాత ఎవరూ కూడా అలా బికినీ ధరించి సమావేశంలో పాల్గొన్న సంఘటనలు దాదాపు వెలుగు చూడలేదు.

## క్రీడాపోటీల్లో బికినీలు...

మొదట్లో సముద్రం ఒడ్డున, స్విమింగ్‌పూల్ వద్ద మాత్రమే బికినీలు ధరించేవారు. బయట మరెక్కడా ఇవి కనపడేవి కావు. కాని మొట్టమొదటి సారిగా ఓ మహిళా క్రీడాపోటీల్లో క్రీడాకారిణులు వీటిని ధరించారు. 90వ దశకంలో ఇంటర్నేషనల్ వాలీబాల్ ఫెడరేషన్ వారు బీచ్ వాలీబాల్ పోటీల్లో మహిళలు బికినీ ధరించి ఆడాలని నిర్దేశించారు. ఫెడరేషన్ నిర్ణయం మేరకు ఆ పోటీలో పాల్గొన్న మహిళలందరూ శాండ్ రిలీజ్ సిస్టమ్ కలిగిన బికినీలను యూనిఫామ్‌గా ధరించారు.

## బోలెడంత గిరాకీ...

ప్రపంచంలో జీన్సు, స్కర్టులు, చీరలు ధరించని మహిళలున్న దేశాలు ఉండవచ్చేమో కానీ బికినీలు ధరించని మహిళలు ఉండే దేశం లేదని ఇటీవల నిర్వహించిన ఓ సర్వేలో తేలింది. వెయ్యి మంది జనాభా ఉండే చిన్నపాటి నగరం నుంచి అత్యధిక జనాభా కలిగిన చైనా వరకూ అందరికీ బికినీ సుపరిచితమే! దీన్ని ధరించడం అన్నది అవసరంగా కాకుండా ఫ్యాషన్‌గా మార్చుకున్న దేశాలు కూడా ఉన్నాయంటే ఆశ్చర్యం కలగక మానదు.

## ఖరీదైన బికినీ

సుశాన్ రోజాన్ అనే డిజైనర్ అత్యంత ఖరీదైన స్విమ్ సూట్ రూపొందించాడు. 30 మిలియన్ డాలర్ల ఖరీదు చేసే ఈ బికినీ రూపకల్పనలో 150



డైమండ్స్, 30 ఎమర్లాల్డ్స్ (ఆకుపచ్చ రాళ్ళు) ఉపయోగించాడు. అయితే దీని గురించిన వివరాలు ఒక పత్రికలో ప్రచురించడంతో ఈ ఖరీదైన బికినీ గురించి బయట ప్రపంచానికి తెలిసింది.

## శాకాహార ప్రచారంలో...

కొన్ని రకాల ప్రచారాల్లో బికినీని ఉపయోగించినట్టు ఆధారాలు ఉన్నాయి. 'మాంసాహారం వద్దు... శాకాహారమే ముద్దు' అన్న స్లోగన్ ఎప్పటి నుంచో ప్రచారంలో ఉంది. కొన్ని సంవత్సరాల క్రితం బికినీ ధరించి ఈ విధమైన ప్రచారం చేసినట్టు ఆధారాలున్నాయి. క్యాబేజీ, కొన్ని ఆకుకూరల నమూనాలతో తయారు చేసిన బికినీలను ఇద్దరు మోడల్స్ ధరించి 'శాకాహారులుగా మారండి' అనే ప్లేకార్డుతో ప్రచారాన్ని నిర్వహించారు. వారి తరువాత ఇలాంటి ప్రచారాన్ని మరెవ్వరూ చేయలేదు.

## భారతదేశంలో...

సంప్రదాయాలకు పెద్ద పీట వేసే భారతదేశంలో కూడా బికినీ సంస్కృతి రోజురోజుకీ పెరిగిపోతోందన్న విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి సర్వేలు. గతంలో బికినీ అనే మాట కూడా వినడానికి కొందరు ఇష్టపడే వారు కాదు. ఇప్పుడు ఆ పరిస్థితి లేదు. బికినీ వేసుకుని బహిరంగంగా తిరిగినా పెద్దగా పట్టించుకోని పరిస్థితి నెలకొంది. ఈ మార్పుకి మారుతున్న పరిస్థితులు ఒక కారణమైతే సినిమాలు మరో కారణమవుతున్నాయి. సినిమాల్లో అవసరం ఉన్నా లేకపోయినా హీరోయిన్లు బికినీలు వేసుకుని తెర మీద దర్శనమిస్తుండడంతో ఇవి కూడా ఫ్యాషన్‌లో ఓ భాగమే అన్న అభిప్రాయాన్ని కొందరు వ్యక్తం చేస్తున్నారు.

## సినిమాల్లో బికినీ

1967 సంవత్సరంలో మొదటిసారి సినిమాలో బికినీ దృశ్యం తెర మీద దర్శనమిచ్చింది. ఆ సంవత్సరం విడుదలైన 'ఏన్ ఈవెనింగ్ ఇన్ పారిస్' సినిమాలో షర్మిలాఠాగూర్ బికినీలో కనిపించింది. అదే సంవత్సరం మొట్టమొదటిసారిగా ఫిలింఫేర్ కవర్ మీద షర్మిలా ఠాగూర్ బికినీతో దర్శనమిచ్చింది. ఆ తరువాత, డింపుల్ కపాడియా తదితర హీరోయిన్లు బికినీల్లో కనిపించారు. మరాఠి సినిమాల్లో మీనాక్షి శిరోద్కర్ అనే నటి మొదటిసారి బికినీలో కనిపించింది. ఇక దక్షిణాది సినిమాల్లో బికినీ దృశ్యాలు సర్వసాధారణమైపోయాయి. బికినీ వేసినందుకు ప్రత్యేకంగా కొంత రెమ్యునరేషన్ వసూలు చేసే స్థాయికి కొందరు తారలు చేరుకున్నారు.

## భవిష్యత్తులో బికినీ...

పరిణామ క్రమంలో బికినీ ఎన్నో మార్పులకు చేర్పులకు గురై రెండు పీలికల డ్రస్‌కి చేరుకుంది. భవిష్యత్తులో ఇది మరిన్ని మార్పులకు గురికావచ్చన్న ఊహాగానాలు వినవస్తున్నాయి. శరీరంలో కింది భాగంలో తప్ప పై భాగంలో ఎలాంటి ఆచ్ఛాదన లేకుండా ఉండే బికినీలు కూడా రావచ్చని అంటున్నారు. అంటే టాప్ లెస్ బికినీలదే ఫ్యూచర్ అని ఫ్యాషన్ రంగ నిపుణుల అంచనా.

-దేవి

## బికినీ విశేషాలు - వివాదాలు

- 1946లో ఫ్రెంచ్ మోడల్ ధరించిన టూ పీస్ బికినీ మీద పెద్ద రాద్ధాంతమే జరిగింది.
- స్పెయిన్, ఇటలీ, పోర్చుగల్ తదితర దేశాల వారు కొన్ని సంవత్సరాల పాటు బికినీని తమ దేశాలలో నిషేధించారు. అనంతరం కొన్ని షరతులకు లోబడి వాటిని అనుమతించారు. అయినా ఇప్పటికీ కొన్ని దేశాలలో బికినీ ధరించడం మీద కఠిన నిబంధనలు ఉన్నాయి.
- కొద్దిగా లావుగా ఉండే ఆష్లే గ్రాఫమ్ అనే మోడల్ బికినీ ధరించి ఓ పత్రిక కవర్ పేజీ మీద దర్శనమివ్వడం కొద్దిగా వివాదాస్పదమే అయినా, బికినీ, స్విమ్‌సూట్‌లు సన్నగా ఉండే వారికి మాత్రమే కాదు, లావుగా ఉన్నవారు కూడా వీటిని ధరించవచ్చు అన్న స్ఫూర్తిని ఆమె కలిగించింది. లావుగా ఉండే మహిళల్లో ఆత్మ విశ్వాసాన్ని పెంచడానికే తను బికినీ ధరించి కవర్ పేజీకి ఫోజు ఇచ్చినట్టు ఆమె చెప్పడం విశేషం.
- అతి కురచ దుస్తులుగా పేరు తెచ్చుకున్న వీటి మీద అభ్యంతరాలు ఎన్ని ఉన్నా వీటి అమ్మకాలు రోజురోజుకీ పెరుగుతున్నాయే తప్ప తగ్గడం లేదన్న విషయం ఇటీవల నిర్వహించిన ఓ సర్వేలో వెల్లడైంది.
- ఇప్పుడు కూడా కొన్ని దేశాలలో క్రీడాకారిణులు ఆట సమయంలో బికినీ ధరిస్తారు.
- ప్రపంచంలో ప్రతి పదిమంది మహిళల్లో ఒకరు బికినీని ధరించడానికి ఆసక్తి చూపుతున్నారట. ఈ కారణంగానే మామూలు ఫ్యాషన్ దుస్తుల అమ్మకాల కన్నా వీటి అమ్మకాలు బాగా పెరిగినట్లు గణాంకాల ద్వారా వెల్లడవుతోంది.
- బార్సిలోనియా దేశం వీధుల్లో బికినీ ధరించి తిరగడాన్ని నిషేధించింది. అలా తిరిగిన వారు 300 యూరోలు ఫైన్ కింద చెల్లించాల్సి ఉంటుంది. అక్కడ ప్రభుత్వం కొన్ని ప్రదేశాలలో మాత్రమే బికినీ ధరించడానికి అనుమతి ఇచ్చింది.

5

# హావేలీ

-ఎస్. ఘటికాచలరావు సెల్:90031 41474



**మరుసటిరోజు ఉదయం ఐదు గంటలకే మెలకువ వచ్చిందతనికి. లేచిచూస్తే చుట్టూ చిమ్మచీకటి. గదిలో రాత్రి బెడ్ లైట్ వెయ్యకుండా పడుకున్నాననిపించింది. లేచి మెల్లగా తడుముకుంటూ వెళ్ళి లైట్ వేశాడు.**

**ఒక్కసారిగా గదినిండా వెలుతురు కమ్ముకోవడంతో కళ్ళు రెండుక్షణాలు మూసి తెరిచాడు. కళ్ళు తెరిచిన అతను ఉలికిపడ్డాడు. తరువాత ఆశ్చర్యపోయాడు. మూలగా ఉన్న అతని బ్యాగ్ ఎవరోవచ్చి మొత్తం చెక్ చేసినట్టుగా చిందరవందరగా పడి ఉంది. గట్టిగా తల విదిలించి చూశాడు. సందేహం లేదు. ఎవరో వచ్చారు. కానీ ఎలా సాధ్యం? గది తలుపులు లోపలి నుంచి మూసి ఉన్నాయి. ఎవరైనా లోపలికి రావడం అసాధ్యం. అలాంటిది ఈ పని ఎవరు చేసి ఉంటారు?**

గబగబా వెళ్ళి బ్యాగ్ మొత్తం ఒకసారి చూసుకున్నాడు. అందులో వస్తువులన్నీ సక్రమంగానే ఉన్నాయి. కాసేపు జుట్టు పీక్కున్నాడు. ఏమిటిది? ఏం జరుగుతోంది? ఎవరు చేస్తున్నారుఇదంతా? వెంటనే బయటికి వెళ్ళి తండ్రీ కూతుళ్ళను అడిగేద్దామని ఆవేశంగా తలుపువద్దకు వెళ్ళాడు. అంతలోనే ఠక్కున ఆగిపోయాడు. లోపలి వైపు నుంచి తలుపువేసి ఉంటే అదెలా సాధ్యం అని వాళ్ళడిగితే తన వద్ద సమాధానం లేదు. ఏదైనా నిదానించి చెయ్యాలి. కాసేపు ఏమీతోచక మెదడు మొద్దుబారినట్టనిపించింది.

నిదానంగా వెళ్ళి లైట్ ఆర్పేసి మళ్ళీ పడుకున్నాడు. కంటిమీద కునుకు రాలేదు. ఆలోచనలు తీవ్రమయ్యాయి. అలా ఆలోచిస్తూనే ఆరు గంటల వరకూ పడుకున్నాడు.

### జరిగిన కథ

అరకులోయ మార్గంలో ఉన్న కుగ్రామానికి వెళ్ళే తోవలోనే ఉంది పాడుబడిన హవేలీ ప్రశాంత వాతావరణంలో చదువుకుని ఐ పీ ఎస్ పరీక్షకు సిద్ధమయ్యేందుకు ఆ ఊరికొస్తాడు విష్ణు. హవేలీ పూర్వకథ తెలుసుకుంటాడు. రాజా విజయేంద్రవర్మ, అతడి నమ్మినబంటు, అతడి కూతురు, రాజా వారి కుమారుడు..ఇలా ఒకరి తరువాత ఒకరు ఆ ప్యాలెస్ నుండి జాడతెలియకుండా పోతారు. అదో అంతుచిక్కని రహస్యంగా మిగులుతుంది. ఆ పాడుబడిన ప్యాలెస్ నుండి అర్ధరాత్రిళ్ళు ఆర్తనాదాలు వినిపిస్తూ ఉండటం విష్ణును ఆశ్చర్యపరుస్తుంది. ఆ ప్యాలెస్‌లో ఉన్న రహస్యమేంటో కనిపెట్టాలని నిర్ణయించుకుంటాడతను. ఆ తర్వాత.....

సరిగ్గా ఆరుగంటలకు లేచి తలుపుతీశాడు. బ్రెష్ తీసుకుని బాత్రూంకెళ్ళి పళ్ళు తోముకుని వచ్చాడు. అప్పటికే గోపాలరావు లేచి ఉన్నాడు.

రాధ కాఫీ తెచ్చింది. దాన్నందుకుని సిప్ చేస్తూ గోపాలరావు వంక చూశాడు. అయితే అతనెటో చూస్తున్నాడు. రాధ వంక చూశాడు. ఆమె ఎందుకో నవ్వుతున్నట్టనిపించింది. ఆమె నవ్వు దేన్ని సూచిస్తోందో అర్థం కాలేదు.

కాఫీ తాగడం ముగించాక ఆమె కప్పు అందుకోడానికి వచ్చి "మీకు నిద్రలో నడిచే అలవాటుందా?" అనడిగింది కిసుక్కున నవ్వుతూ.

ఉలికిపడ్డాడు విష్ణు. "లేదే" అన్నాడు అయోమయంగా. అలాంటి అలవాటేదైనా ఉంటే ఇంట్లో వాళ్ళు ఈపాటికే చెప్పి ఉండేవాళ్ళు గదా?

ఆమె తండ్రివైపు చూసింది. అతనింకా ఎటో చూస్తూ ఉన్నాడు. అప్పుడుచూస్తే అతని చేతికి చిన్నగాయమై కట్టుకట్టుకుని ఉన్నాడు.

"ఆయన్ని చూశారా. నిన్న రాత్రి మీరు చేసిన రాద్ధాంతం అంతా ఇంతా కాదు. మీ బ్యాగ్‌లోని వస్తువులన్నీ చిందరవందరగా పీకేశారు. మిమ్మల్ని ఆపబోయి మా నాన్న దెబ్బలు తగిలించుకున్నాడు" అన్నది.

"లేదు. నాకలాంటి అలవాటేదీ లేదు. అయామ్ పర్ఫెక్ట్‌లీ ఆల్‌రైట్. నన్ను నమ్మండి" అన్నాడు స్థిరంగా.

"మీ బ్యాగ్ భుజానికి తగిలించుకుని గది



తలుపు తీసి, మెయిన్ తలుపు తీసి బయటికి వెళ్ళేందుకు ప్రయత్నించారు. ఆయన అడ్డుకోవడంతో మీ బ్యాగ్‌తో ఆయన్ను కొట్టారు. బ్యాగ్‌లోని వస్తువులన్నీ ఆయన మీదికి విసిరేశారు" అన్నది. ఆమె ఇంకా నవ్వుతూనే ఉంది.

"నేను నమ్మను" అన్నాడు మరేమనాలో తెలియక.

ఆపై ఆమె ఇంకేమీ మాట్లాడలేదు. ఇద్దరి వంకా అయోమయంగా చూస్తూ ఖాళీ కప్పు ఆమె చేతిలో ఉంచాడు విష్ణు. ఎప్పటిలాగే తొమ్మిది గంటలకు గోపాలరావు డ్యూటీకి వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళగానే విష్ణు "నేను వెళ్ళి ఈరోజు పేపర్ తెచ్చుకుంటాను" అన్నాడు బయలుదేరడానికి సిద్ధమై. ఆమె అతనివైపు అదోలా చూసింది.

క్రితం రోజు ఎలాగో ఆపగలిగింది. ప్రతిరోజూ ఏదో ఒక కారణం చెప్పాలంటే ఏ కారణాలు దొరుకుతాయి. ఆ కోవలోనే ఈరోజు ఏం చెప్పాలో తెలియని పరిస్థితి. అతనలా అడుగు తాడని ముందే ఊహించిఉంటే అందుకు తగ్గట్టుగా ఏదైనా ఆలోచించుకుని సిద్ధంగా ఉండి ఉండొచ్చు కానీ సమయం మించిపోయింది. ఇప్పుడేమీ చేయలేని స్థితి. ఆమె సమ్మతికోసం ఎదురుచూడకుండా బయటికి అడుగులు వేశాడు.

బయటికి రాగానే ఏదో స్వాతంత్ర్యం లభించినట్టు ఫీలయ్యాడు. 'ఇరవై నాలుగ్గంటలూ ఇంట్లోనే ఉండి మగ్గిపోవడం ఇబ్బందిగా ఉంది. అక్కణ్ణుంచి బయటికి రావాలంటే ఇంత కష్టపడాలా?' అనుకున్నాడు.

మెల్లగా కొండమీదికి చేరుకునేసరికి దాదాపు అరగంట పట్టింది. రెండురోజుల క్రితమే చూసినందువల్ల ఆ హోటల్‌వాడు ఇతన్ని గుర్తుపట్టి సలామ్ చేశాడు. అదీగాక ఆరోజు ఇతని బోణీ కారణంగా వ్యాపారం జోరుగా సాగినట్టుంది. అందువల్ల మర్చిపోలేదు. ఒక టీ ఇవ్వమని చెప్పి ఆ రోజు పేపర్ కొనుక్కున్నాడు విష్ణు.

ఫ్రంట్‌పేజీలో సాధారణంగా దేశ రాజకీయాలకు సంబంధించి ముఖ్యవిషయాలు వేస్తారు. తరువాతి పేజీల్లో ఇతర వార్తలు ఒక్కొక్కటిగా చూస్తూ నాలుగో పేజీలోనో ఐదో పేజీలోనో ఠక్కున ఆ వార్త దగ్గర ఆగిపోయాడు. అది చూస్తే నమ్మశక్యం కాలేదు.

'ఇది ప్రాంతీయంగా ముఖ్యమైన వార్తైతే నిన్నటి వార్తల్లో టీవీలో వచ్చుండాలే'.



తన అనుమానం మనసులోనే ఉంచుకుని వార్తను పూర్తిగా చదివాడు.

'రెండు రోజుల క్రితం కనుమరుగైన ప్రముఖ పారిశ్రామికవేత్త కుమారుడి ఆచూకీ ఇంకా తెలియ రాలేదు. అన్నివైపులా గాలింపు చర్యలు జరుగుతున్నాయి. దీంతో ఇప్పటివరకూ కనిపించకుండా పోయిన ప్రముఖుల సంఖ్య ఆరుకు చేరుకుంది. కనిపించకుండాపోయిన ఈ ఆరుగురు ప్రముఖుల విషయంలోనూ పోలీసులకు ఎటువంటి ఆధారమూ లభించక పోవడంతో దిక్కుతోచకుండా ఉంది. కారణం ఏమై ఉంటుందని వాళ్ళ కుటుంబీకులను అడిగినా జవాబు దొరకలేదు. ఈ కేసులో ఎలా ముందుకు సాగాలో అర్థంకాక పోలీసులు సతమతమౌతున్నారు'.

టీ తాగడం ముగించి పేపర్ చేతబట్టుకుని అక్కణ్ణుంచిలేచి నిదానంగా మళ్ళీ పల్లెదారి పట్టాడు. ఉదయం పది గంటలకు కొండమీది నుంచి పచ్చదనంతో నిండుకుని పల్లె చాలా బాగా కనిపిస్తోంది. పల్లెకు కొద్ది దూరంలో 'హవేలీ' కూడా పాడుబడిఉన్నా చాలా స్పష్టంగా కనబడుతోంది. రెండురోజుల క్రితం చూసిన దానికీ ఇప్పటికీ ఏదో తేడా ఉంది. బహుశా అది తన మైండ్ సెట్ అయి ఉండవచ్చేమో, అప్పుడది కొత్తగా చూడడంవల్ల ఒక మాన్యుమెంట్‌లా అనిపించింది. మరి ఇప్పుడు కథంతా తెలిశాక దాన్ని చూస్తే దెయ్యాల కొంప చూసినట్టనిపిస్తోంది.

అలా ఆలోచిస్తూ గ్రామం చేరుకుని ఇంట్లోకి వెళ్ళే ముందు ఠక్కున ఆగిపోయాడు. ఏదో ఆలోచన వచ్చినవాడిలా తలుపుతట్టకుండా ఇంటి వెనుకవైపుకెళ్ళాడు. సరిగ్గా తన గది కిటికీ వద్ద ఉన్న జిల్లేడు పొదలమధ్య నిశితంగా గమనించాడు. కాసేపటికి తన కంటపడ్డదాన్ని చూసి ఒక్కక్షణం స్తంభించాడు. అక్కడ నిన్నరాత్రి అతను విన్న అరుపునకు ఆనవాలుగా ఒక కుక్క అక్కడ పడిఉంది.

'అంటే ఆ సమయంలో అక్కడేదో జరిగింది. తన భ్రమ కాదు. ఎవరో అక్కడికి వచ్చారన్న మాట. తమ రాకను పసిగట్టిన కుక్కను మట్టుబెట్టారు. సందేహం లేదు. ఈ పరిసరాల్లోనే ఏదో మిస్టరీ ఉంది' అనుకుంటూ ముందుకు వచ్చి తలుపు తట్టాడు.

తలుపు వెంటనే తెరుచుకుంది. అతని చేతిలోని పేపరు చూసిన రాధ ఎందుకో కొద్దిగా అప్‌సెట్టైనట్టు కనిపించింది.

ఆమె ముఖంలో భావాలు చదవడానికి ప్రయత్నిస్తూ లోపలికి ప్రవేశించాడు.

"ఏమైంది? అదోలా ఉన్నారు" అనడిగాడు. ఆమె ప్రతి కదలికనూ నిశితంగా గమనిస్తూ ఉన్నాడు విష్ణు.

"మా నాన్నేమో మిమ్మల్ని బయటికి పంపవద్దని చెప్తున్నారు. మీరేమో మాటవినరాయె. మీరేమీ చిన్నపిల్లలు కాదు చెప్తే అర్థం కాకపోవడానికి. ఒకవేళ శారీరకంగా మీ కన్నా శక్తిమంతురాలినైతే మిమ్మల్ని బలవంతంగా కట్టిపడేసేదాన్ని. మీ ఇద్దరి మధ్యా నలిగిపోతున్నాను. గత రెండ్రోజులుగా మా నాన్నగారు ఇంటికిరాగానే అడిగే మొదటి ప్రశ్న 'అతను బయటికెళ్ళాడా?' దీనికి నేనేమని సమాధానం చెప్పాలి?" బాధపడింది.

**అతడి బ్యాగ్‌ను చిందరవందరచేశారెవరో. రాత్రి తలుపులు మూసి పడుకున్నాడుకదా, ఎవరైనా లోపలికెలారాగలరు? ఆ తండ్రీ కూతురూ క్రితం రాత్రి తనను ఇంట్లో బంధించి ఎక్కడికి వెళ్ళినట్టు? అతడిలో ఎన్నో సందేహాలు. పైగా ఆ ప్రాంతంలో ఆరుగురు ప్రముఖుల అదృశ్యం అతణ్ణి కలవరపెట్టింది. చీకటిపడగానే ఇక ఆలస్యం లేకుండా బయలుదేరాడతను. ఇంతకీ ఎక్కడికి అతని ప్రయాణం? ప్యాలెస్‌లోకేనా?**

"వెళ్ళాడనే చెప్పండి. ఎంతసేపూ ఇంట్లోనే మగ్గిపోలేను. అసలు ఈ ప్రశాంతమైన పల్లె వాతావరణంలోకి వచ్చింది ఆరుబయట వెళ్ళి చదువుకోవాలనే. అలా తోటకెళ్ళి చదువుకుంటే ఎంత బాగుంటుంది? అయినా ఎవరికో మన మెందుకు భయపడాలి? ఏం జరుగుతుందో జరగనివ్వండి. మీకిష్టం లేకపోతే చెప్పండి. ఈరోజే నేను వెళ్ళిపోతాను".

ఆ మాట అన్నాడేగానీ ఆ తరువాత ఎందుకు నోరు జారానా అనిపించిందతనికి. 'మాటలు జాగ్రత్తగా ఉపయోగించాలి. ఒకవేళ నిజంగానే వెళ్ళమంటే ఎక్కడికెళ్ళాలి?' అనుకున్నాడు. తరువాత కాసేపటికి మెల్లగా "క్షమించండి. ఇక ముందు మీకు ఇబ్బంది కలిగించను" అన్నాడు.

ఈ రెండురోజుల్లోనే ఆమె ప్రవర్తన, అందం, ఆమెలోని సౌమ్యత అతన్ని బాగా ఆకట్టుకున్నాయి. ఆమెలో ఏదో తెలియని ఆకర్షణ ఉందనిపించింది. ఆమె చేతివంట అమృతప్రాయం. మాటలు కూడా ఎంతో మృదుమధురం.

ఆరోజు మధ్యాహ్నం విష్ణు నిద్ర పోలేదు. గోపాలరావు ఆ రోజు సాయంత్రం రోజూ కన్నా కాస్త ఆలస్యంగా వచ్చాడు. ఎప్పటిలాగే అతనడిగిన ప్రశ్నకు ఆమె యధాలాపంగా జవాబు చెప్పింది. చిన్నగా నిట్టూర్చాడు గోపాలరావు.

ఆరోజు రాత్రి భోజనాల తరువాత గదిలోకి వెళ్ళేముందు గోపాలరావు కిటికీ తెరవొద్దని చెప్పలేదు.

గదిలోనికి వెళ్ళగానే విష్ణు మనసు మళ్ళీ

# రకూల్ పెళ్ళి పీటలెక్కుతుందా?

అప్పుడెప్పుడో ఓ ఇంటర్వ్యూలో మహేష్‌బాబు పక్కన చేసిన తరువాత నచ్చినవాడిని చేసుకుంటానని చెప్పింది. ఇప్పుడు అదే విషయాన్ని గుర్తు చేసుకుంటున్నారు టాలీవుడ్ జనాలు. ప్రస్తుతం మహేష్‌బాబు పక్కన రకూల్ చేయబోతోందన్న వార్తలు వస్తుండడంతో...ఈ సినిమా తరువాత రకూల్ పెళ్ళి చేసుకుంటుందా? అన్న అనుమానాలు కూడా వ్యక్తం చేస్తున్నారు. కాకపోతే రకూల్ చేతి నిండా సినిమాలు ఉండడంతో ఇప్పుడప్పుడే చేసుకోవడం కుదరదేమో అని కూడా కొందరు అంటున్నారు.

హవేలీ మీదికి మళ్ళింది. 'ఔను, తన మనసుకు తోచింది తను చేస్తాడు. ఇందులో ఒకరి పర్మిషన్ తీసుకోవాల్సిన అవసరం ఏమిటి? అసలు బయటి కెళ్ళేందుకు వీళ్ళకు ఎందుకు చెప్పాలి? తనేమైనా ఈ ఇంటి నౌకరా? చెప్పకుండా వెళ్తే ఏమౌ తుంది'?

ఆలోచిస్తుండగా ఒక అద్భుతమైన ఆలోచన వచ్చింది. 'అలా చేస్తే' అనిపించింది. కాసేపటికి 'అవును. అదే సరి' అన్న నిర్ణయానికి వచ్చేశాడు.

'తండ్రీకూతుళ్ళే మార్గదర్శకులు' అనుకుని తలుపులు మూసి పడుకున్నాడు.

ఉదయం పేపర్లో చదివిన వార్త కళ్ళముందు నిలిచింది.

'ఒకవేళ ఆ వార్తకూ ఈ హవేలీకి సంబంధం లేదు కదా'.

ఆ ఆలోచనరాగానే దిగ్గున లేచి కూర్చు న్నాడు. ఒక్క క్షణం ఏం చెయ్యాలో తోచలేదు. అయితే ముందుగా తననుకున్నట్టు చెయ్యడమే మంచిదనిపించింది.

అప్పుడు సమయం రాత్రి పదిగంటలు. ఆ రోజు రాత్రి కిటికీ తలుపు తెరవలేదు. క్రితం రోజులాగా బయట టీవీ శబ్దం రావడం లేదు. బహుశా నిద్రపోయి ఉంటారనుకుని పదకొండు గంటల వరకూ తనుకూడా అలాగే పడుకుని సరిగ్గా ఆ సమయానికిలేచి బ్యాగ్ భుజానికి తగి లించుకుని తలుపు గడియ తీశాడు. తన గదిలో లైట్ వేయలేదు.

ఒకవేళ వాళ్ళెవరైనా అడ్డు తగిలి అడిగితే తాను నిద్రలో నడుస్తున్నట్టు భావిస్తారు. తాను కూడా అలాగే నటించాలి. అదీ అతని ఉపాయం.

హాల్లో బెడ్‌లైట్ వెలుగుతోంది. చూస్తే అక్కడ ఎవరూ లేరు. కించిత్ ఆశ్చర్యపోయాడు. రాధ బహుశా వేరే గదిలో పడుకుంటుందేమోనను కున్నాడు. అయితే మరి గోపాలరావు ఎక్కడికెళ్ళి నట్టు? ఉన్నదే రెండు గదులు. ఒకదాంట్లో తను న్నాడు. మెల్లగా వెళ్ళి ఆ గదిలో కూడా చూశాడు. అయితే అక్కడకూడా ఎవరూ లేరు. విష్ణుకు మిస్టరీగా అనిపించసాగింది.

ముఖద్వారం వద్దకు వచ్చాడు. ఆశ్చర్యం. ఆ తలుపు లోపలి వైపునుంచి గడియ పెట్టలేదు. లాగి చూశాడు. తెరుచుకోలేదు. అంటే... బయట గడియపెట్టుకుని ఎక్కడికో వెళ్ళారు. అంత కంతకూ మిస్టరీ అధికం కాసాగింది. పెరటి వైపు తలుపుచూస్తే అది గడియపెట్టి ఉంది. గబగబా వెళ్ళి గడియతీసి తలుపులాగాడు. అయితే అది తెరు చు కోలేదు. అంటే... వెనకవైపు కూడా తలుపు బయట గడియవేసి వెళ్ళిపోయారన్న మాట.

మెల్లగా అతని ఆలోచనలు ఒక రూపు సంతరించుకోసాగాయి. తను ఊహించినట్టుగానే అంతా జరుగుతున్నట్టు అనిపించసాగింది.

అంతలో బయట దూరంగా ఏదో వాహనం చప్పుడు వినబడింది. అయితే అది ఏదో ఆటో శబ్దం లాగుంది. ఈ గ్రామంలో ఆటో ఎక్కణ్ణుంచి వచ్చిందో అర్థం కాక అంతలోనే కూరగాయల ఆటోలు రెండు అక్కడ చూసిన జ్ఞాపకం వచ్చింది.

ప్రస్తుతం ఇంట్లోనుంచి బయట పడాలంటే ఏమిటి మార్గం? నిస్సహాయ స్థితిలో మళ్ళీ తన గదిలోకి వచ్చి బ్యాగ్ కిందపెట్టి మెల్లగా కిటికీ తలుపులు తెరిచాడు.

నిన్నటికన్నా వెన్నెల వెలుగు తక్కువ. కాస్త మసకగా కనబడుతోంది హవేలీ.

అతను తలుపు తెరవబోయే సమయానికి భీకరమైన ఆర్తనాదం. నిస్సహాయస్థితిలో అసహ నంతో తల పంకించాడు విష్ణు. కిటికీ తలుపు మూసేశాడు. ఆ అరుపులు ఎవరివి? ఏం జరు గుతోందా హవేలీలో?

నెర్వస్‌గా పక్కమీదవాలాడు. తను వచ్చిన పనేమిటి? చేస్తున్నదేమిటి? అని ఒకసారి ప్రశ్నిం చుకుని అంతలోనే ఆ ఆలోచనకు అక్కడితో ఫుల్ స్టాప్ పెట్టాడు.

సరిగ్గా ఒకగంట గడిచాక ఇంటి తలుపులు తెరుచుకున్న శబ్దం వినిపించింది.

వెంటనే బయటికివెళ్ళి 'అతిథులను ట్రీట్ చేసే పద్ధతి ఇదేనా?' అని అడిగేద్దామనుకున్నాడు. తొందరపాటు మంచిదికాదని మిన్నకున్నాడు. అర్థరాత్రిపూట తానెందుకు బయటికి వెళ్ళదల్చు కున్నాడో చెప్పాల్సిన పరిస్థితి వస్తే ఇబ్బందిగా ఉంటుందనిపించింది. 'ఈ ఇంట్లో ఉండగా తను బయటికి వెళ్ళలేడు. బయట ఉంటేనే ఆ హవేలీ గురించి తెలుసుకోగలడన్నది మాత్రం సత్యం' అనుకున్నాడు.

ఆలోచనలతో సతమతమౌతూనే నిద్రలోకి జారుకున్నాడు.

ఉదయం ఆరుగంటలకు లేవగానే బయటికి వచ్చిన అతనికి కేవలం గోపాలరావు మాత్రమే కనిపించాడు.

అతని వంక చూసిన విష్ణుతో "రాత్రి అమ్మా యికి విపరీతమైన కడుపునొప్పి వస్తే డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళాల్సి వచ్చింది. వేరే దారిలేక కూరగాయల ఆటోలో అమ్మాయిని తీసుకెళ్ళాను. ప్రస్తుతం అమ్మాయి లేవలేకుంది. ఈ పూటకు సెలవుపెట్టి ఇంటిపట్టునే ఉంటున్నాను. మధ్యాహ్నం ఆ కొండమీది హోటల్ నుంచి క్యారియర్ తెప్పిం చేస్తాను" అన్నాడు గోపాలరావు గబగబా.

వెంటనే రాత్రివిన్న ఆటో శబ్దం గుర్తు కొచ్చింది. తాను తొందర పడనందుకు సంతోషిం చాడు విష్ణు. అయినా తను అడగకుండానే ఏదో సంజాయిషీ ఇచ్చుకుంటున్నట్టుగా అతను మాట్లాడ్డం విష్ణుకు వింతగా అనిపించింది.

తన మనసులో ఆలోచనలు మనసులోనే ఉంచుకుని "అంకుల్, అసలే కడుపునొప్పి అంటు న్నారు. అలాంటప్పుడు హోటల్ తిండి మంచి దేనా మీరే చెప్పండి. మీరేమీ దిగులు పడకుండా డ్యూటీకి వెళ్ళండి. అమ్మాయి సంగతి నాకొది లెయ్యండి. వంట నేనే వండుతాను. సామాన్లు ఎక్కడున్నాయో చెప్పండి".

గోపాలరావు అదోలా చూశాడు అతనివైపు. అతని ముఖంలో ఏదో అపరాధభావం కదలాడి నట్టనిపించింది. అతనెందుకలా చూశాడో అర్థం కాలేదు. దాని గురించి ఎక్కువగా ఆలోచించ కుండా గబగబా బాత్రూంలోకి వెళ్ళాడు.

దంతధావనం, స్నానాది కార్యక్రమాలు ముగించు కుని వంటింట్లోకి ప్రవేశించాడు.

అంతలో రాధ వచ్చి వారించింది. తనకి ఇప్పుడు బాగానే ఉందని చెప్పింది.

"మీరు మొహమాటపడక రెస్ట్ తీసుకోండి" అంటూ స్వతంత్రించి ఆమె చేతిని అందుకుని లోపలికి నడిపించి మంచంపై కూర్చోబెట్టాడు. ఆమె ఇబ్బందిగా తండ్రివైపు చూసింది. ముందుగా కాఫీచేసి ఇద్దరికీఇచ్చి తాను తీసు కుని తరువాత వంటపని ప్రారంభించాడు.

అంతకన్నా ముందుగా తనకు బాగా వండడం తెలిసిన టిఫిన్ ఉప్మా చేశాడు. ఎని మిది గంటలకే టిఫిన్ తయారుచేసి గోపాలరావు డ్యూటీకి వెళ్ళేందుకు సిద్ధం చేశాడు. తొమ్మిది గంటలకు అతను వెళ్ళాక వంటపని ప్రారం

## అభిమానుల కోసం త్యాగం చేసిందట



*కేన్సర్ బాధితుల కోరిక మేరకు హీరో, హీరోయిన్లు వారిని కలవడం తెలిసిన సంగతే! అయితే వారి కోసం తన జుత్తునే త్యాగం చేసింది చార్మి. తన అభిమానులు ఇద్దరు కేన్సర్‌తో బాధపడుతున్నారని తెలిసి వారిని కలిసిన చార్మి వారి విగ్గులకోసం తన జుత్తును ఇచ్చిందట! సుమారు 18 అంగుళాల జుత్తును త్యాగం చేసి, బాబ్డ్ హెయిర్‌ని చేయించుకుంది. మొదట అందరూ చార్మి హెయిర్ స్టయిల్ మార్చిందేమో అనుకు న్నారు కానీ, తరువాత అసలు సంగతి తెలిసి చార్మి త్యాగాన్ని అందరూ మెచ్చుకుంటు న్నారు కూడా!*

భించాడు.

తాను తల్లి ద్వారా అప్పుడప్పుడూ తెలుసు కున్న కొన్ని వంటకాలు తయారు చేసే పద్ధతులు ఉపయోగించి ఇంట్లోఉన్న కూరగాయల తోనే క్లుప్తంగా గంటలో వంట పూర్తిచేశాడు.

"మాత్రలేవైనా ఇప్పుడు వేసుకోవాల్సినవి ఉంటే చెప్పండి. భోజనానికి ముందా తరువాతా" అంటూ అడిగాడు.

"ఉదయం, రాత్రి వేసుకోవాలి. ఇప్పుడు బాగానే ఉంది" అన్నది మాత్ర చేతిలోకి తీసుకుంటూ.

విష్ణు మనసులో హవేలీ మెదిలింది. అంత కన్నా ముఖ్యంగా కొండమీదికెళ్ళి ఆరోజు పేపర్ తెచ్చుకోవాలి. ఆమెతో చెప్పి బయలుదేరాడు.

బయటికి వెళ్తున్న అతనివైపు బేలగా చూసింది. ఆమె చూపుల్లో వెళ్ళవద్దన్న అభ్యర్థన ఉంది. తండ్రి రాగానే అడుగుతాడన్న దిగులు ఉంది.

దాని గురించి పట్టించుకోకుండా బయటికి నడిచాడు.

కొండమీదికి చేరుకుని పేపర్ తీసుకుని ఆత్రుతగా తిరగేశాడు. అతనికి కావలసినది నిన్నటి సమాచారానికి కొనసాగింపు. కనబడ కుండా పోయిన ఆ వ్యక్తుల గురించిన వేరే సమాచారం ఏదైనా ఉందేమోనన్న ఉత్సుకత!

అతననుకున్నట్టుగానే నాలుగో పేజీలో ఆ వార్త చదివి ఉలికిపడ్డాడు. అందులో ఒకరు చని పోయారన్న వార్త చూసి తల విదిలించాడు. అంత కన్నా గగుర్పాటు కలిగించే సమాచారం ఏమిటంటే అతని శరీరం వాళ్ల ఇంటి ఆవరణలోనే పడేసి వెళ్ళడం!

అన్యమనస్కంగా కొండ దిగాడు. దిగుతూండగా ఈ హవేలీ పరిసర ప్రాంతంలో జరుగుతున్న సంఘటనలకూ పేపర్లో జరిగిన సంఘటనలకూ ఏదైనా దగ్గరి సంబంధం ఉందేమోనన్న అనుమానం కలిగింది.

గోపాలరావు నుంచి ఏ విధమైన సమాచారమూ లభించడం లేదు. అక్కడ ఉండడం కన్నా బయటపడడం మంచిదని నిర్ణయించు కున్నాడు. తన మనసులోని అనుమానాలు నివృత్తి చేసుకునేందుకు అదొక్కటే మార్గమని తోచింది.

ఇంటికి వెళ్ళేదాకా ఆలోచించి, వెళ్ళగానే రాధతో విషయం చెప్పేశాడు.

"రాధగారూ, ఇంటినుంచి ఫోన్ వచ్చింది. ఏదో ఇంటర్వ్యూకు పిలుపొచ్చిందట. వెంటనే వెళ్ళాలి. సాయంత్రం అంకుల్ రాగానే బయలు దేరతాను. మళ్ళీ బహుశా రెండు మూడు రోజుల్లో వచ్చేస్తాను" అన్నాడు.

అతనివైపు సందేహంగా చూసింది రాధ. 'వెళ్ళాల్సిందేనా' అన్నట్టున్నాయి ఆమె చూపులు.

గదిలోకివెళ్ళి బ్యాగ్ సర్దుకున్నాడు. ఒకసారి గదంతా కలయజూశాడు. తరువాత బయటికి వచ్చి హాలంతా కలయజూశాడు.

ఆ సమయంలో ఆమె గదిలో ఉంది. ఒక సారి తృప్తిగా తలాడించి పుస్తకం చేతిలోకి తీసు కున్నాడు. అక్కడే హాల్లో కూర్చుని టీవీ ఆన్ చేశాడు.

క్రితంరోజు పెట్టుకున్న వార్తల ఛానల్ పెట్టాడు. వార్తలేవో వస్తున్నాయి. దానిమీద మనసు లగ్నం కాలేదు. అయినా పేపర్లో వార్తకు సంబంధించిన వివరాలేవైనా వస్తాయేమోనని చూశాడు. అవేవీ ప్రసారం కాలేదు. ఇంత ప్రముఖమైన వార్త ఎందుకు ప్రసారం చెయ్యడంలేదో అర్థంకాక కొద్దిసేపు అయోమయంలో పడిపోయాడు. మరోమారు తన చేతిలోని న్యూస్‌పేపర్ తీసి దానిలోని వార్త మరోమారు చదువుకున్నాడు.

'ఇదెలా సాధ్యం? ఇంత ముఖ్యమైన వార్త ప్రసారం చేయక పోవడం ఉంటుందా? చీమ చిటుక్కుమన్నా కెమెరాలతో పరుగులెత్తేవాళ్ళు ఇంతఘోరం జరుగుతున్నా మిన్నకుండడం సాధ్యమేనా?' వెంటనే టీవీ కట్టేశాడు. గబగబా బయటికి వచ్చింది రాధ.

"ఏమైంది? టీవీ రావడం లేదా?"

"వస్తోంది. పేపర్లో ఇంత ముఖ్యమైన వార్త ఉంటే అది మాత్రం టీవీలో రావడంలేదు. అన్నీ అసందర్భంగా ఉన్నాయి. ఇవాళ్టి న్యూస్ ఇంత హాట్‌గా ఉంటే దాన్ని ప్రసారం చెయ్యకుండా ఏవేవో ప్రసారం చేస్తున్నారు. ఇంతకన్నా ముఖ్యమైన జాతీయ, అంతర్జాతీయ విషయాలకే కవరేజ్ ఇవ్వలేక సతమతమైపోతున్నారేమో" అన్నాడు అసహనంతో తల పంకిస్తూ.

రాధ అతనివైపు కొద్దిగా భయంగా చూసింది. అయితే అతను దాన్ని గమనించలేదు. సమయం చూస్తే ఇంకా పదకొండు గంటలు. సాయంత్రం వరకూ వేచి ఉండడం చాలా కష్టంగా తోచింది, కానీ తప్పదు.

సాయంత్రం ఐదున్నరకు గోపాలరావు రాగానే విషయం చెప్పి బయలుదేరతానన్నాడు. అతను రాధవైపు చూశాడు. వాళ్ళ చూపులేవో మాట్లాడు కున్నాయి. అది విష్ణు దృష్టిని దాటిపోలేదు. చిన్నగా నవ్వుకున్నాడు.

రాధ ఇద్దరికీ కాఫీ ఇచ్చింది. కాఫీ తాగి ఒక గంట సేపాగి తన బ్యాగ్ భుజానికి తగిలించు కుని బయలుదేరాడు విష్ణు. అప్పుడు సమయం రాత్రి ఏడుగంటలు.

కొద్దిదూరం వెళ్ళాక వెనక్కు తిరిగి చూస్తే రాధ చూపులు ఏవో మాట్లాడుతున్నట్టు అని పించింది. బహుశా చీకట్లో సరిగ్గా కనబడలేదో లేక అది తన భ్రమో అనుకుని తల విదిలించి ముందుకు అడుగువేశాడు. వీధి చివర టీ కొట్టు లోని ఇద్దరు మనుషులు విష్ణువైపు గుటకలు మింగుతూ చూశారు. వాళ్ళతన్ని చూసి భయ పడుతున్నట్టనిపించింది.

పది నిమిషాలకు వాళ్ళందరూ కనుమరుగయ్యారు.

కొండమీదికి చేరుకునేసరికి ఏడున్నర. టీ కొట్టులో మళ్ళీ ఒక టీ తాగాడు. తదుపరి మజిలీ హవేలీ. హవేలీలోకి ప్రవేశించడానికి సర్వసన్నద్ధంగా వచ్చాడతను. అయితే రాత్రి పదిగంటల వరకూ ఎక్కడ కాలం గడపాలన్నది అతని ముందున్న ప్రశ్న.

ఆ టీ కొట్టు కం హోటల్ బయటికి వచ్చి చూస్తే చీకటి పడినందువల్ల కొండపై నుంచి గ్రామం సరిగ్గా కనబడడం లేదు. వెన్నెల అంత ఎక్కువగా లేదు. హవేలీ మసగ్గా కనిపిస్తోంది. దాని పక్కన మామిడితోపు చెప్పుకోదగ్గ వైశాల్యంలోనే ఉంది.

'ఆ మామిడితోపులోకి వెళ్తే అక్కణ్ణుంచి ఎలాగైనా హవేలీ లోకి ప్రవేశించవచ్చు' అను కున్నాడు

మళ్ళీ టీ కొట్టు పాకలోకి వచ్చి ఉస్సూరంటూ కూర్చున్నాడు.

"తినడానికేదైనా ఉందా" అనడిగాడు.

కొట్టులో ఉన్న ఐటమ్స్ అన్నీ ఏకరువు పెట్టాడు దుకాణదారు.

రాత్రికి కాస్త లైట్‌గా ఉండాలనుకుని ఇడ్లీలే ఆర్డర్ చేశాడు. నాలుగిడ్లీలు తిని మళ్ళీ మరో టీ తాగి హోటల్ బయటికి వచ్చాడు.

**(ఇంకా వుంది)**




## సదా నీతోనే

కలిసిన ప్రతిసారీ వెళ్ళొస్తానని నువ్వనగానే
బెంగతో నీ చేతిని
పట్టుకుంటూ
మరొక్క ఐదు
నిమిషాలంటాను.



నీలోని వాక సంశయపు
జంకుగుసగుస నా
అరచేతుల్లో మంచుపొగలా...
సందిగ్ధభరిత ప్రేమని వెలిగించే
వెచ్చని మనసుని సహనంతో
సంసిద్ధపరుచుకొంటూ....

-కుప్పిలి పద్మ

## సరదాగా

### సుఖం

బతికున్నంతకాలం భర్తను పట్టించుకోనేలేదు ఆండాళ్ళు. ఈ మధ్యనే పైకెళ్లిపోయాడు భర్త శ్యామసుందరం. అప్పటి నుంచి అతను లేని లోటు ఆండాళ్ళుకు బాగా అనుభవంలోకి వచ్చింది. చేసిన తప్పులకు బాధపడింది. ఎలాగైనా సుందరాన్ని క్షమించమని అడగాలనుకుంది. ఉగ్రానంద స్వామి సహాయంతో సుందరం ఆత్మతో మాట్లాడగలిగింది.

"ఏవండీ, నేను ఆండాళ్‌ని, మిమ్మల్ని చాలా బాధపెట్టాను. క్షమించండి. నాతో ఒక్కసారి మాట్లాడండి."

"చెప్పు ఆండాళ్ళు... ఎలా ఉన్నావు?"

"మీరు వెళ్ళాక ఇక్కడ నాకు ఏమీ బాగాలేదు. మీరెలా ఉన్నారు?"

"నేను బానే ఉన్నాను."

"ఇక్కడ ఉన్నప్పటి కంటే బాగున్నారా?"

"నాకు ఇక్కడ చాలా బాగుంది."

"అంటే స్వర్గంలో సుఖాలు అనుభవిస్తున్నారా?"

"లేదు నరకకూపంలో!"

### ఒక ప్రశ్న?

**పింకీ**కి పదేళ్ళ వయసు. తిరునాళ్ళలో వాళ్ళ తాతయ్య ఆమెకో గులాబీరంగు కిడ్డీబ్యాంకు కొనిచ్చాడు. అప్పటినుంచి ప్రతి పుట్టినరోజున 250 రూపాయలు అందులో వేయటం మొదలుపెట్టింది. పింకీకో చెల్లెలుంది. పేరు స్వీటీ. బాగా అల్లరి చేస్తుంది. స్వీటీ దృష్టంతా అక్క కిడ్డీబ్యాంకు మీదే. పింకీ తన కిడ్డీబ్యాంకుని ఎవరికీ అందనిచ్చేది కాదు. అంతేకాదు స్వీటీ ప్రతి పుట్టినరోజుకి, పింకీ తన కిడ్డీబ్యాంకులోంచి యాభై రూపాయలు తీసి ఇస్తుండేది. ఇలా ప్రతి సంవత్సరం జరుగుతోంది. పింకీ, స్వీటీ ఇద్దరూ పెద్దవాళ్ళయ్యారు. పెళ్ళిళ్ళయ్యాయి. వాళ్ళకీ పిల్లలు. అయినా కూడా కిడ్డీ బ్యాంకు తతంగం నడుస్తూనే ఉంది. చివరికి పింకీ యాభై ఏళ్ళ వయసులో కేన్సర్ కారణంగా చనిపోయింది. కార్యక్రమాలన్నీ పూర్తయ్యాక పింకీ కిడ్డీబ్యాంకు తెరిచింది స్వీటీ. అందులో 500 రూపా యలు మాత్రమే ఉన్నాయి. ఇది ఎలా సాధ్యం? ప్రతి పుట్టినరోజుకి 250 రూపాయలు వేసి 50 రూపాయలు తీస్తున్నప్పుడు కేవలం 500 రూపాయలు మాత్రమే ఎలా ఉంటాయి? ఇదీ ప్రశ్న? ఛేదించండి.

### సమాధానం

పింకీ పుట్టినరోజు ఫిబ్రవరి 29. అంటే లీప్ సంవత్సరంలో ఆమె తన పుట్టినరోజుని సెలబ్రేట్ చేసుకుంటుంది. పింకీ 10 సంవత్సరాల నుంచి కిడ్డీబ్యాంకులో డబ్బులు వేయడం మొదలుపెడితే, ఆమె చనిపోయేనాటికి కేవలం 10 సార్లు మాత్రమే 250 రూపాయల చొప్పున వేయగలిగింది. అంటే మొత్తం 2500 రూపాయలు. స్వీటీ సాధారణ రోజునే జన్మించడం వల్ల ప్రతి సంవత్సరం పుట్టినరోజుని సెలబ్రేట్ చేసుకునేది. స్వీటీకి ప్రతి సంవత్సరం 50 రూపాయల చొప్పున ఇస్తే, 40 సంవత్సరాలకు 2000 రూపాయలు కిడ్డీబ్యాంకులోంచి తీసినట్లు. ఇక మిగిలింది 500 మాత్రమే! లెక్క సరిపోయింది కదా!

Jayadev

# అడపా దడపా నవ్వబ్బా

మిగతా బండెక్కడా?

వీధి చివర గుంత.. చూస్కోలేదు!

ఏ వీధి గుంత? ఎవరా పిల్ల!!

అల్లుడొస్తున్నాడు.. గుంత లోతు చూస్తున్నాం!!




# నలుపు

**మార్నింగ్‌వాక్ చేస్తున్నవారు ఆహ్లాదకర వాతావరణంలో నవ్వుతూ, తుళ్ళుతూ నడుస్తున్నారు. అప్పుడప్పుడు పడే చినుకులు వారికి మరింత ఆనందం కలుగజేస్తున్నాయి. వీచే చల్లనిగాలి ఆ హాయిని రెట్టింపు చేస్తోంది. 'అరే. అక్కడేదో నిప్పు రాజుకుంటున్నట్టుంది' అన్నాడో వ్యక్తి వేలుతో ఆ వైపు చూపుతూ. దారికి ఇరువైపులా దట్టంగా చెట్లు. ఓ వైపు చెట్ల నడుమ ఏదో కాలుతున్నట్టు కనిపిస్తోంది.**

నడుస్తున్న వాళ్ళు దిశను మార్చి ఆ వైపు వెళ్ళారు. దగ్గరగా వెళ్ళినవాళ్లు ఆ మండుతున్న దాన్ని చూసి ప్రాన్పడి నిలిచిపోయారు.

●●●

'ఎవరో హత్యచేసి ముక్కలు చేసి నిప్పంటించినట్టున్నారు' సగం బూడిదలా పడిఉన్నదాన్ని చూస్తూ అన్నాడు ఇన్‌స్పెక్టర్ విజయ్.

బహుశా రాత్రంతా సన్నని చినుకు పడుతుండటంవల్ల హంతకుడు ఊహించినట్టు మొత్తం కాలి బూడిదైపోలేదు. చేతివేళ్ళు బూడిదగుట్టలో కనిపిస్తున్నాయి. ఎముకలు, కాలీకాలని చర్మం తెలుస్తున్నాయి.

తలాడించాడు డిటెక్టివ్ శరత్. మౌనంగా తనపనిలో నిమగ్నమయ్యాడు.

ముందుగా బూడిదగుట్టలో ఆధారాలుగా అనిపించిన వాటిని సేకరించాడు. తరువాత పరిసరాలను పరిశీలించటం ప్రారంభించాడు.

రాత్రంతా సన్నగా చినుకుపడుతుండడంతో భూమి తడిగా ఉంది. నేలను జాగ్రత్తగా పరిశీలించటం ప్రారంభించాడు శరత్.

బూడిదగుట్ట నుంచి మెయిన్‌రోడ్డు వరకూ అణువణువూ పరిశీలిస్తూ వెళ్తున్న శరత్ దృష్టి కారు టైర్ల గుర్తు దగ్గర ఆగిపోయింది.

చుట్టూ చూశాడు.

కారు అక్కడ ఆగింది. అటునుంచి రివర్స్ తీసుకుని నగరంవైపు రోడ్డులో వెళ్ళినట్టు గుర్తుల్ని బట్టి తెలుస్తోంది. మరోసారి టైర్ల గుర్తుల్ని జాగ్రత్తగా పరిశీలించాడు. అటునుంచి బూడిదగుట్ట వరకూ మరోసారి జాగ్రత్తగా పరిశీలిస్తూ వెళ్లాడు.

ఈసారి అక్కడక్కడా బూటు గుర్తులు కనబడసాగాయి. వాటిని ఫోటో తీసుకున్నాడు. జాగ్రత్తగా పరిశీలించాడు. బూడిదగుట్ట దగ్గర మట్టిలో కూరుకుపోయిన కాల్చిన సిగరెట్ పీక కనిపించింది. అంటే, హంతకుడు తాను కోసి తెచ్చిన శరీర భాగాలను కాల్చటానికి సిగరెట్ అంటించిన అగ్గిపుల్లనే వాడుకున్నాడు! శవం మండుతున్నంత సేపూ సిగరెట్ తాగుతూ నిలబడి, తరువాత సిగరెట్ పారేసి కాలితో నలిపి వెళ్లిపోయాడన్నమాట. దీర్ఘంగా నిట్టూర్చాడు శరత్. అడుగులను చూస్తుంటే హంతకుడు ఒంటరిగానే పని చేసినట్టు తెలుస్తోంది. అక్కడ ఉన్న మిగతా అడుగుల గుర్తులు వాకర్లవి, పోలీసులవి. ఎవరికీ చెందని అడుగులు కారు నుంచి బూడిద వరకు ఉన్నాయి. మళ్లీ వెనక్కు ఉన్నాయి.

●●●

పోస్ట్‌మార్టమ్ డాక్టర్ ఫణి, ఫోరెన్సిక్ ఎక్స్‌పర్ట్ ఫ్లెమింగ్ ఇద్దరూ శరత్‌వైపు చూశారు. కాంప్లికేటెడ్ కేసు. నిప్పు అన్నిటినీ బూడిద చేస్తుంది. దేని ఆనవాళ్లు మిగల్చదు. వర్షం కూడా అంతే. పైగా శరీరాన్ని ముక్కలుగా కోసి కాల్చాడు. దాంతో అందిన ఆధారాలను అనుసరించి మొత్తం శరీరాన్ని రీకన్‌స్ట్రక్ట్ చేసి చూడాల్సి వస్తుంది' చెప్పాడు ఫణి.

కానీ ఈ సృష్టిలో ప్రతి దానికీ తనదైన ప్రత్యేక ముద్ర ఉంటుంది. నిప్పు అన్నిటినీ బూడిద చేసినా, తనదైన ప్రత్యేక పద్ధతి ప్రకారం చేస్తుంది. ఒకవేళ నిప్పు కాల్చేకన్నా ముందే ఏదైనా గాయం ఉంటే, అక్కడ కాలే పద్ధతి వేరుగా ఉంటుంది. దాని ఆధారంగా శరీరంలో కాలేముందు గాయం ఎక్కడ ఉందో తెలుసుకోవచ్చు' అన్నాడు ఫ్లెమింగ్.

'నా పరిశోధనల ప్రకారం ఇది మహిళ శవం. అంతేకాదు, ఆఫ్రికన్ మహిళ అని తెలుస్తోంది' చెప్పాడు ఫణి. ఈమె మెదడులోంచి తుపాకీ గుండు దూసుకుపోవడం వల్ల మరణించింది. తర్వాత ముక్కలు చేసి కాల్చారు. శరీరం మీద గాయాలు లేవు.

●●●

'మన దేశానికి వచ్చిన వాళ్లందరూ వాళ్ళ పేర్లు, వివరాలు రిజిస్టర్ చేసుకోవాలి. అలా రిజిస్టరైన ఆఫ్రికన్ మహిళల వివరాలివి. అయితే, ఈ మధ్యకాలంలో ఆఫ్రికన్ అమ్మాయి మిస్సింగ్ రిపోర్టులేమీ లేవు' శరత్‌కి వివరాలు అందిస్తూ చెప్పాడు అసిస్టెంట్ రాము.

'ఎవరో మిస్సై ఉండాలి. టూరిస్టుల వివరాలు సేకరించావా?' అడిగాడు శరత్. 'యెస్ బాస్. అందరూ సవ్యంగా, దివ్యంగా ఉన్నారు' చెప్పాడు రాము. 'ఇక్కడ స్థిరపడిన వారిలో ఎవరిదో అయి ఉంటుంది శవం. భారతీయ పౌరసత్వానికి అప్లై చేసిన వాళ్ళు, పౌరసత్వం పొందిన వాళ్ల జాబితా తెచ్చావా?'

'తెచ్చాను బాస్' అంటూ రాము ఇచ్చిన జాబితా పరిశీలించాడు శరత్.

ఆ ప్రకారం ఒకటొకటిగా ఫోను నెంబర్లు కలపటం ఆరంభించాడు.

●●●

'మొత్తం 15 కుటుంబాలు పౌరసత్వానికి అప్లై చేశాయి . వీరిలో ఆఫ్రికా దేశాల భార్యాభర్తలు పదిమంది. ఆఫ్రికన్ మహిళలను పెళ్ళి చేసుకుని ఇక్కడికి తెచ్చిన వారు అయిదుగురు. వారిలో ఇద్దరు హనీమూన్‌లో ఉన్నారు. ఇంకో ఇద్దరు ఇక్కడే ఉన్నారు. ఒక కుటుంబం వారు ఫోను ఎత్తటం లేదు. సెల్‌ఫోన్లు స్విచాఫ్ వస్తున్నాయి. విషయం ఏమిటో తెలుసుకోవాలని వెళ్తున్నాను. వస్తావా?' అడిగాడు శరత్.

'ష్యూర్' అన్నాడు విజయ్.

●●●

'ప్రదీప్ కొన్నాళ్లు ఆఫ్రికాలో ఉన్నాడు. అక్కడ అతడికి 'యారా' పరిచయమైంది. ఆమెను పెళ్ళి చేసుకుని అక్కడ అయిదేళ్లున్న తర్వాత మన దేశం వచ్చారు. వాళ్లకి ఓ పాప' కారు డ్రైవ్ చేస్తూ విజయ్‌కి వివరాలు చెప్పాడు శరత్.

కారును వాళ్లు వెళ్ళాల్సిన ఇంటి దగ్గర ఆపాడు శరత్. చూడగానే ఇంటికి తాళం తెలుస్తోంది. ఇంటి చుట్టూ తిరిగి చూశాడు. ఇంట్లో కనీసం వారం నుంచి ఎవరూ ఉంటున్నట్టు లేదు. వార్తాపత్రికలు కాంపౌండ్‌లో గాలికి ఎగుర్తూ చెల్లాచెదురుగా ఉన్నాయి. పక్కింటి తలుపు తట్టాడు శరత్. 'ప్రతిరోజూ ఎవరో ఒకరు పూజ టైమ్‌లోనే వచ్చి తలుపు కొడతారు. మీరంతా రాక్షసులా? పూజ సమయంలో డిస్ట్రబ్ చేస్తారు?' తలుపుతీసిన ముసలాయన కొట్టినట్టు

**చినుకులతో వాతావరణం ఆహ్లాదంగా ఉంది. మార్నింగ్ వాకర్లు రెట్టింపు ఉత్సాహంతో ఉన్నారు. వారిలో ఒకరికి దూరంగా చెట్ల మధ్య మంటలు కనిపించాయి. వాకర్స్‌లో కొందరు ఆ దిశగా వెళ్ళారు. ఆక్కడి దృశ్యం చూసి ప్రాన్పడిపోయారు. శవాన్ని ముక్కలు చేసి నిప్పు పెట్టారెవరో. చినుకులు పడుతూ ఉండటం వల్ల పూర్తిగా బూడిదైపోలేదు. కాలీకాలని చర్మం, ఎముకలు కనిపిస్తున్నాయి. డిటెక్టివ్ శరత్ రంగ ప్రవేశం చేశాడు. ఆ ప్రాంతాన్ని నిశితంగా పరిశీలించాడు. ఇంతకూ ఆ శవం ఎవరిది? అక్కడ ఏం జరిగింది?**

అడిగాడు.

తనని తాను పరిచయం చేసుకున్నాడు శరత్. 'ప్రదీప్ గారు కావాలి'. ముసలాయన కళ్లల్లో కుతూహలం కనిపించింది. 'ఎందుకు? ఏదైనా నేరం చేసిందా అమ్మాయి?'

'అమ్మాయి నేరం ఎందుకు చేస్తుంది?'

'నల్లవాళ్లు కదూ? వాళ్లని చూస్తే నేరస్థులో, గూండాలుగానో అనిపిస్తారు'. 'ఏం లేదు. వాళ్ల పౌరసత్వం కోసం అప్లై చేశారు, తనిఖీకి వచ్చాం' చెప్పాడు శరత్.

'వారంగా కనబడటం లేదు. ఎవరికీ చెప్పలేదు కూడా, ఎటువెళ్లారో తెలుసా?'

'తెలియదు'.

ఇంతలో రాము నుంచి ఫోను వచ్చింది. 'బాస్... ఇక్కడ సెటిలైన ఆఫ్రికన్స్ అందరినీ ప్రశ్నించాను. యారాతో పరిచయం ఉన్నవాళ్ళు వారంగా కన బడటం లేదట. ఫోనూ ఎత్తటం లేదట. వారూ ఆందోళనలో ఉన్నారు'.

ఫోను పెట్టి విజయ్‌వైపు చూశాడు శరత్. 'ప్రదీప్ పనిచేసే ఆస్పత్రికి వెళ్దాం' అన్నాడు.

'వారం నుంచీ ఆస్పత్రికి రావటం లేదండి, కారణం కూడా చెప్పలేదు. ఫోన్లు స్విచాఫ్ వస్తు న్నాయి. పేషెంట్లు అల్లాడిపోతున్నారు' ఆ చెప్పిన వ్యక్తి కోపంగా ఫిర్యాదు చేసినట్టుగానే అన్నాడు.

'అతనికి జీతం బ్యాంకులో వేస్తారు కదా, ఆ ఎకౌంట్ వివరాలు కావాలి'.

విజయ్ వైపు ఓసారి చూసి ఎకౌంటెంట్‌ని పిలిచాడు. ప్రదీప్ ఆధార్ కార్డు, బ్యాంకు ఎకౌంట్ వివరాలు నిమిషాల్లో శరత్ చేతికి వచ్చాయి.

●●●

'ప్రదీప్ నిన్నరాత్రి బెంగళూరులో మెజిస్టిక్ సెంటర్ దగ్గర ఏటీఎం నుంచి డబ్బులు డ్రా చేశాడు' చెప్పాడు బ్యాంకు మేనేజర్.

'బాస్.... ఆధార్ ద్వారా తెలిసిన ప్రదీప్ కారు నెంబరు ఇదిగో' అందించాడు రాము.

వెంటనే బెంగళూరు పోలీసులకు ఫోనుచేసి ప్రదీప్ కారు నెంబరు ఇచ్చాడు విజయ్.

'అతని క్రెడిట్ కార్డు బ్లాక్ చెయ్యమంటారా?'

'వద్దు. పోలీసులు దర్యాప్తు చేస్తున్నట్టు అత డికి అనుమానం వస్తుంది' అన్నాడు శరత్.

●●●

శరత్, విజయ్ బెంగళూరు చేరుకున్నారు.

'మీరు చెప్పినకారు హోటల్ హండర్డ్ వద్ద ఉంది. అక్కడే ప్రదీప్ పేరున రూమ్ కూడా ఉంది'.

'అతడితో పాప ఉందా?'

'ఉందట'.

'చలో విజయ్' అన్నాడు శరత్ లేస్తూ.

'కానీ అతడే నేరం చేశాడని నిరూపించే ఆధారాలు మన దగ్గర లేవు, ఎలా?' అడిగాడు విజయ్ సందేహంగా.

'ప్రదీప్‌ని కలిసి అనుమానం తీర్చుకుందాం. అతడు కాకపోతే మరో కోణంలో దర్యాప్తు ఆరం భిద్దాం' అన్నాడు శరత్.

●●●

'ఎవరు కావాలి?' పెరిగిన గడ్డం, నిద్రలేని కళ్ళతో తలుపు తెరిచి ప్రశ్నించాడు ప్రదీప్.

'మీరు వారంగా ఆస్పత్రికి రావటం లేదని, మీరు ఎక్కడ ఉన్నారో తెలుసుకోమని పంపారు మీ ఆస్పత్రి అధికారులు' లోపలకు వస్తూ చెప్పాడు శరత్.

'నాకు ఆస్పత్రికి సంబంధం లేదు. నేను ఆఫ్రికా వెళ్లిపోతున్నా' చెప్పాడు ప్రదీప్.

'మీ భార్య యారా. ఏది?'

'యారా... నన్ను మోసం చేసింది. నా వల్ల సంతృప్తి లేదని మరో నీగ్రోతో పారిపోయింది. ఆమెని వెతుకుతూ నేనూ ఆఫ్రికా వెళ్తున్నాను. నా కూతురుని ఆమెకి అప్పగించేస్తాను. ఈ నల్లటి నీగ్రోలాంటి కూతురు నాకు వద్దు' మంచం మీద పడుకుని ఉన్న పాపని చూపిస్తూ చెప్పాడు ప్రదీప్.

పాప దగ్గరకు నడిచాడు శరత్. ఆమె పడు కున్నతీరు. అనుమానం కలిగించింది. పక్కన ఉన్న డ్రా సొరుగులో ఇంజక్షన్ బాటిల్ ఉంది. తీసిచూశాడు శరత్.

'పాపకు మత్తుమందు ఎందుకు ఇస్తు న్నావు?' అడిగాడు.

'అది నీకు అనవసరం. నేను ఆస్పత్రికి రానని చెప్పండి, గెటౌట్ అరిచాడు ప్రదీప్.

'యారా ఏది?' అడిగాడు శరత్.

'చెప్పాగా... ఆఫ్రికా పారిపోయింది'.

'లేదు, చెప్పు ఎక్కడుంది?' అడిగాడు విజయ్. ప్రదీప్ కళ్లు చిన్నవయ్యాయి. ఒక్క దూకులో పాపను చేరుకున్నాడు. జేబులోంచి తుపాకీ తీసి పాప మెదడుదగ్గర పెట్టాడు. 'మీరు పోలీసులేగా, కదిలితే పాపను కాల్చేస్తా. ఎప్పుడో దీని పీడా కూడా వదిలించుకోవాల్సింది. పాపను చంపటం ఇష్టంలేక మత్తుమందు అధికంగా ఇస్తూ వచ్చాను. ఇవాళో రేపో ఇదీ పోతుంది' నవ్వుతూ ఏడుస్తూ పిచ్చిగా మాట్లాడుతున్నాడు ప్రదీప్.

అడుగుముందుకు వేసి ప్రదీప్ చెంపమీద గట్టిగా కొట్టాడు శరత్. అతడిచేతిలో తుపాకీ ఎగిరి పడింది. అప్పటికే విజయ్ అంబులెన్స్‌కి ఫోను చేశాడు. ప్రదీప్ ఏడుస్తూ ఏదో మాట్లాడు తూనే ఉన్నాడు. 'అసహ్యంగా ఉన్నారు. నల్లగా ఉన్నారు. నా జీవితాన్ని నరకం చేశారు. ఇండి యన్లు అందమైనవారు. ఆఫ్రికా వెళ్లిపొమ్మంటే వెళ్లనంది. డబ్బులిస్తానన్నా వెళ్లలేదు. నాకు వీళ్ళ నలుపు చూస్తుంటే అసహ్యం వేస్తోంది' అంటూ మాట్లాడుతున్న ప్రదీప్ చేతులకు సంకెళ్లు వేశాడు విజయ్.



**-కస్తూరి మురళీకృష్ణ**

**సెల్: 98496 17392**




# ధీరా.. ధీరా...

మంథా భానుమతి

**సుధీర నాయక్‌కి ఎంత ఆపుకుందామన్నా కన్నీరు ఆగట్లేదు. ఉండుండి కళ్లు చెమరుస్తూనే ఉన్నాయి. భుజం మీదున్న తువ్వాలు ముక్కతో కళ్లు తుడుచుకుంటూ భోజనాల బల్ల, కుర్చీలు శుభ్రంగా తుడుస్తున్నాడు. కొంచెం దూరంలో సోఫాలో కూర్చుని పేపర్ చదువుతున్న ప్రకాశ్ మధ్య మధ్యలో అతన్ని గమనిస్తూనే ఉన్నాడు.**

**"ధీరా... ధీరా!"**

**"వస్తున్నానమ్మా!" పరుగు పరుగున వెళ్లాడు సుధీర నాయక్. కన్నీళ్ళు బయటికి రాకుండా మింగేసి, అమాయకంగా నవ్వుతూ.**

"పట్టుకో... పెద్దాయన జారిపోతున్నాడు"

ఒక చెయ్యి మోకాళ్ళకింద, ఒక చెయ్యి వీపు కింద వేసి, మంచం మీది నుంచి జారిపోతున్న పెద్దాయన్ని బలమైన చేతులతో పట్టుకున్నాడు సుధీర. సునాయాసంగా మంచంమీద సర్ది కూర్చోపెట్టి, ఫ్యాన్ వేసి ఒళ్లంతా వేడి వేడి నీళ్ళల్లో ముంచిన బట్టతో తుడిచి, పౌడర్ వేసి, ఇస్త్రీ బట్టలు వేశాడు. అక్కడే నిల్చుని చూస్తున్న రజని మెచ్చుకోలుగా చూసింది.

ఆ ఇంట్లో ప్రతీవారి నోటా మెలకువగా ఉన్నంతసేపూ ధీరా అనే పిలుపు వినిపిస్తూనే ఉంటుంది. ఒక్క పెద్దాయన తప్ప. ఆయన కూడా పిలుస్తూనే ఉండేవాడేమో... పక్షవాతంతో నోరూ, కుడి చెయ్యీ, కాలూ పని చెయ్యక పోవడంతో కళ్ళతోనే కోపాన్నీ సంతోషాన్నీ చూపిస్తుంటాడు.

"ధీరా! నన్ను స్కూల్లో దింపాలి పద" ఐదేళ్ళ బబ్లూ... వాడే ఆ పేరు పెట్టింది. తన చిన్ని చేతి వేళ్ళు విప్పి సుధీర చేతిలో చాక్లెట్ పెట్టి, చెయ్యి పట్టుకుని లాక్కుపోయాడు. బబ్లూని చూస్తే సుధీర నాయక్‌కి ప్రత్యేకమైన అభిమానం. ఇంట్లో ఉన్నంతసేపూ ఒక్క క్షణం కూడా బబ్లూని వదలడు. వాడు దగ్గరకి రాగానే అప్రయత్నంగా కళ్ళు చెమ్మగిల్లుతాయి. మనసు కొన్ని వందల కిలో మీటర్ల దూరం ప్రయాణిస్తుంది.

•••

ఇంట్లోకీ వీధిలోకీ పరుగు పెడుతున్నాడు రెండున్నరేళ్ళ విష్ణు నాయక్.

"అయ్యా! ఇత్తీస్కో..." తన చిన్ని పిడికిలి మూసి తండ్రి ఎదురుగా నిల్చున్నాడు.

గుండ్రటి మొహం, చిన్ని కళ్ళు, కొద్దిగా వెడల్పుగా ఉన్న ముక్కు, సన్నని పెదవులు. పెదవులు బిగించి చెయ్యి ముందుకు చాచిన కొడుకుని ఎగరేసి ఎత్తుకున్నాడు సుధీర నాయక్. పిడికిలి విప్పితే అందులో బంక పట్టిపోయిన పటిక బెల్లం ముక్క. కన్న తండ్రి హృదయం కరిగి నీరైపోయింది. గట్టిగా హత్తుకుని కన్నీరు ఆపడానికి ప్రయత్నించాడు.

విష్ణు జర్రున జారి ఇంట్లోకి పరుగెత్తాడు.

ఇల్లంటే ఇల్లేం కాదు, నాలుగు రాటలు పాతి, పైన రెండు రేకులు వేసి, చుట్టూ టార్పాలిన్ కట్టిన గూడు.

రెండు నెలల క్రితం వరకూ కొంచెం గట్టి ఇల్లే ఉండేది. మిట్టమధ్యాహ్నం అందరూ కూలికి వెళ్ళిన సమయంలో ఆ వాడ వాడ అంతా అగ్నికి ఆహుతైపోయింది. కొంతలో కొంత నయం... ఇళ్ళల్లో ఎవరూ లేరు. ఎండవేడికి తట్టుకోలేక వయసు మీరిన వాళ్లంతా చిన్న పిల్లల్ని తీసుకుని రోజూ

చెరువు గట్టునున్న మర్రిచెట్టు కిందికి చేరుతూ ఉంటారు.

అయితేనేం... ఉన్న కాస్త కుక్కిమంచం, బట్ట... పాత్రలు అన్నీ బూడిదైపోయాయి. వండు కోడానికి మసి బొగ్గులైపోయిన సత్తు గిన్నెలు తప్ప ఏం మిగల్లేదు. రెండు, మూడు... కొన్ని రోజులు గగ్గోలు పెట్టి, మళ్లీ వాడలో జనం దిన చర్యలో పడిపోయారు.

అది శ్రీకాకుళం జిల్లాలో మారుమూల కుగ్రామం.

అక్కడికి ఓట్లకోసం వచ్చే నాయకులు ప్రభుత్వంతో దెబ్బలాడి ఇళ్ల నిర్మాణానికి డబ్బు తెచ్చారు. అందులో వారి "ఖర్చులు" పోను ప్రతీ ఇంటికీ పదివేలిచ్చారు. దాంతో ఏమి కొనాలి? ఏం తేవాలి?

మంటలు ఆకాశానికి ఎగసినప్పుడు చూస్తూ ఊరుకున్న ఆకాశం... జనం చెట్లకింద సర్దుకుని, సంభారాలు తెచ్చుకుందామనుకునేలోగా, వారి కన్నీళ్ళకి తోడున్నానంటూ ఆపకుండా మూడు రోజులు కుంభవృష్టి మొదలెట్టింది! వెంటనే, రాటలు, రేకులు కొనుక్కొచ్చి గూడు ఏర్పాటు చేసుకున్నారు.

పొయ్యికేం ఇబ్బంది లేదు. అమర్చుకోడానికి నేల తల్లిచ్చిన మూడేసి రాళ్ళు, పొయ్యిలోకి అడవి తల్లిచ్చిన కట్టెలు ఉండనే ఉన్నాయి. పొయ్యిమీద గిన్నెల్లోకే... బూడిద, ఇసక తప్ప ఇంకే లేదు. అడవిలోకెళ్లి, బలుసాకు, దుంపలు తెచ్చుకుని ఒక రోజు గడిపారు. అవి ఎంతమందికి సరిపోతాయి? దానికోసం దెబ్బలాటలు... ఏడుపులు, మొత్తుకోడాలు.

సరిగ్గా అప్పుడే, ఊరి సర్పంచ్ వచ్చాడు. ప్రభుత్వంతో మాట్లాడి అందరికీ బియ్యం, కందిపప్పు తెచ్చానన్నాడు. మనిషికి ఐదు కిలోల బియ్యం చొప్పున ఇచ్చాడు. తన సొంత ఖర్చుతో కొద్దిగా నూనె, ఉప్పు, చింతపండు కూడా ఇచ్చాడు.

ఇంకేం... అతను చెప్తే తలైనా తీసిచ్చేయడానికి తయారైపోయారు జనం.

సమయం చూసుకుని ఒకే ఒక్క మాట అందరికీ చేరేసి, పక్క పట్నంలో తనింటికి చెక్కేశాడు.

మూడురోజులయ్యాక కథ మామూలే! ఏటిలో నీరు కూడా ఇంకిపోతోంది. మగాళ్ళంతా సమావేశమయ్యారు. సర్పంచ్ చెప్పిందానికి ఒప్పుకోడానికే తయారయ్యారు. వెంటనే మూటా ముల్లే సర్దుకుని... నిజంగానే... సామెత కాదు. ఎవరో ధర్మప్రభువులిచ్చిన పాత పంచెల మూట... ముల్లుకర్ర చేత పట్టుకుని పదిమంది పట్నం ప్రయాణమయ్యారు. అందులో సుధీర నాయక్ ఒకడు.

విష్ణు నాయక్ అతని కొడుకే!

సుధీరకి కొడుకంటే పంచప్రాణాలు. పక్కింటి కేశవ్, ఎదురింటి ఈశుల్లాగ కూలి డబ్బులు తాగెయ్యకుండా ఇంట్లోకి సరుకులు తెచ్చేవాడు. పొలం మీదికి కూలికి వెళ్ళి వచ్చేటప్పుడు కోమటి కొట్లోంచి బెల్లమ్ముక్కో, చెరుగ్గడో తెచ్చి, కొడుకు

**రోజుకు మూడొందలు కూలీ గిడుతుందంటే సొంతూరు వదిలి ఎంతో దూరం వెళ్ళిపోయాడతను. నమ్ముకున్న కాంట్రాక్టరు కమిషన్ పేరుతో తన కాయ కష్టాన్ని దోచుకుంటుంటే చేసేదేంలేక కుమిలిపోయాడు. ఇరుకుగదిలో పది మందితో కలిసి హీనంగా బతికాడు. కన్న కొడుకునూ, భార్యనూ చూడాలనే తపన. వాళ్ళేమైపోయారో.. అనే తపన. అలాంటి పరిస్థితుల్లో ఏం జరిగింది? అతడి జీవితం ఏ మలుపు తీసుకుంది?**

ముద్దు మాటలు వింటూ ఆలితో కబుర్లు చెప్తాడు. తల్లీ తండ్రీ బోసి నవ్వులు చిలకరిస్తూ గర్వంగా చూస్తుంటారు.

ఆ వాడలో జనం యాభై ఏళ్ళు దాటేసరికే పళ్లూడిపోయి, నడుం వంగిపోయి ముసలివాళ్ళైపోతారు. వంగుని నాట్లుకట్టి ఆడోళ్ళు, కుప్పలు నూర్చి, బస్తాలు మోసీ మోసీ మగోళ్ళు... ఎముకలు నుజ్జు నుజ్జు అయిపోతాయి. సరైన ఆహారం ఉంటే అది వేరు... రోజుకి ఒక పూటైనా సరైన తిండి దొరకడమే గగనం. సుధీర నాయక్ తండ్రికైతే యాభై ఏళ్ళకే పక్షవాతం. కుడి కాలు, చెయ్యి ఈడుస్తూ నడుస్తాడు.

"సర్పంచ్ వచ్చేశారు, అందర్నీ ఊర్లోకి రమ్మంటున్నారొహో" డప్పు శీనుగాడు కుంటు కుంటూ ఇంటింటికీ వచ్చి అరుస్తుంటే... తప్పదు అన్నట్లు పొయ్యికోసం తెచ్చిన రాతిమీద కూర్చున్న సుధీర లేచాడు. శీనుగాడికి పోలియో రావడంవల్ల ఒక కాలెగరేసి నడుస్తాడు. డప్పు లేదుకానీ చప్పట్లు చరుచుకుంటూ ఎగుర్తాడు. ఆ ఊర్లో కబురందడానికి వాడే ఆధారం.

"నాకు కాల్లేదు కానీ నేకూడా ఎగిరిపోనూ! నా లక్ ఇంతే... ఏటి చేస్తాం..." శీను గట్టిగా నిట్టూర్చాడు.

"మా ఇంటోళ్లని నువ్వు కాచుకోవాల్రా! ఉన్న దాంట్లో నీక్కూడా బువ్వెడ్తారులే." సుధీర, శీనుని సముదాయిస్తూ విష్ణుని చంకనేసుకుని బయల్దేరాడు. అతనితో కూడా ఇంటిల్లిపాదీ నడిచారు... ఊర్లోకి. ఆ వాడ వాడంతా అక్కడే ఉంది.

•••

అక్కడున్న వాళ్ళందర్నీ సంతలో ఎద్దుల్ని చూసినట్లు చూశారు సర్పంచ్ నాయుడు, అతని కూడా ఉన్న తెల్లబట్టల దొర.

"మీరంతా ఇటేపుకి రండ్రా..." వారి కుడేపుకి చూపారు. చేతులు కట్టుకుని వెళ్లారు పదిమంది. వాళ్ళే కొంచెం ప్రాణం ఉన్న మనుషుల్లా ఉన్నారు.

మిగిలిన వారి కళ్ళల్లో నిరాశ... ఆకలితో కూడిన దుఃఖం.

"ఓహ్... ఏటయిందేటి... ఈసారికి చూద్దాం. రేయ్... మీరు మాత్రం ఉన్నపళంగా బయల్దేరాల్రా! ట్రాక్టర్ రెడీగా ఉంది. ఇగో... ఈ డబ్బుంచుకోండి... సాదరుకుంటాది రేయ్... మిగిలిపోయిన మీరంతా మా పొలంలో దుక్కి దున్నుదుర్లెండి..."

సుధీర తన చేతిలో డబ్బు తండ్రికివ్వబోయాడు. నాయుడు పరుగెత్తుకుంటూ వచ్చేశాడు.

"రేయ్... అదేం పనిరా! నువ్వు వెళ్లేది పెద్ద పట్నంలోకి. అక్కడ నీకు కాయా కసరూ ఏం దొరకదు. డబ్బిస్తేనే కాసిని నీళ్ళైనా కంఠం దిగుతాయి. నడ నడ"

సుధీర వెనక్కితిరిగి చూస్తూ ట్రాక్టరెక్కాడు. అందులో ఒక్కొక్కళ్ళకీ నుంచోడానికి మాత్రమే చోటుంది. పక్కకి తిరిగితే ఇంకోడి భుజమో, నడుమో కొట్టుకోక తప్పదు. పట్టుకోడానికేం లేదు.

"అల్లగే బాలన్సింగు చేసుకుంటూ జాగ్రత్తగా ఎల్లొచ్చెయండ్రా. నేను స్టేషన్ దగ్గర కలుస్తా" సర్పంచ్, తెల్లబట్టలాయన కారెక్కి తుర్రుమన్నారు. సుధీర నాయక్, అతని తోటి కూలీలు వెనక్కి చూస్తూ, చేతులూపుతుంటే... నిండు గర్భిణిలా కదిలింది ట్రాక్టరు.

"ఆ తెల్లబట్టలాయనెవర్రా?" ఈరేశు అడిగాడు, గుంటలో పడిన చక్రం ఎగరేస్తే సుధీర భుజం పట్టుకుని నిలదొక్కుకుంటూ.

"ఆయనే పట్నంలో మనకి పనిప్పించే కాంట్రాక్టరు. మన కూడా వచ్చి ఇల్లు అదీ ఇప్పింతాడట. మనం పెళ్లాం పిల్లల్ని పిలిపించుకోచ్చు" రాచుకుపోతున్న గొంతుతో ఎవరో అన్నారు.

"ముందు కొంచెం గంజన్నా పోయిత్తే



బాగుంండ్రా... పేగులు చుట్టుకుపోతున్నాయి"

అందరూ అవునన్నట్లు తలాడించారు.

●●●

"కాంట్రాక్టర్ బాబు మంచోడ్లాగే ఉన్నాడ్రా..." నీళ్ల సాంబారు అన్నం ఆఖరి మెతుకు కూడా ఊడ్చేసి అన్నాడు ఈరేశు.

సగం సగం నిండిన కడుపుల్ని స్టేషన్‌లో ఉన్న మంచినీళ్ళతో నింపుతూ అవునన్నట్లు తలా డించారు మిగిలినవాళ్ళు. సుధీరకైతే పొట్లంలో అన్నం ఎక్కడికో పేగుల అడుక్కి వెళ్ళిపోయింది. అతను మంచి తిండి పుష్టి కలవాడు. "కనీసం అదన్నా ఇప్పించారు... ప్రాణం నిలుపుకోడానికి" అనుకుంటూ పై గుడ్డతో మొహం తుడుచుకుని బెంచీ మీద వాలాడు.

ట్రాక్టర్ మీద నిలబడి, కాళ్ళు రోళ్ళైపోయాయి. బిగుసుకున్న కండరాల్ని వత్తుకుంటూ కనిపించిన చోటల్లా చతికిలపడ్డారు అందరూ.

సర్పంచ్ మాట విని, శ్రీకాకుళంలో తాము భోంచేశాక సాంబారన్నం పొట్లాలు కట్టించి తలో కటీ ఇచ్చాడు కాంట్రాక్టరు. అందరి మొహాలూ తేటగా ఉండటం చూసి అన్నాడు. "మంచి సలహా ఇచ్చావోయ్ నాయుడూ... లేపోతే మిల్లు కెళ్లేసరికి సగం మంది పోయేవారు"

"ఇంకా ఎంతస్సేప్పట్టుద్ది బండి రావడానికి?" పొగడ్తలు తనకి మామూలే అన్నట్లుగా మొహం పెట్టి సర్పంచ్ అడిగాడు.

"చాలా టైముంది. అర్ధరాత్రి దాటాక వస్తుంది బండి. బెజవాడెళ్ళేసరికి రేపు మిట్ట మధ్యాన్నం అవుతుంది. అందర్నీ ఓ కునుకు తియ్య మనవచ్చు" కాంట్రాక్టర్ మాట పూర్తికాకుండానే ప్లాట్‌ఫారం మీద సోలిపోయి గుర్రుపెట్టేస్తు న్నారు కూలీలంతా.

●●●

వీపు మీదున్న మూట కింద పడేసి, ఒక్క సారి నడ్డి విరుచుకుని పైకి చూశాడు సుధీర నాయక్. ఎక్కడా చంద్రుడు కనిపించట్లేదు. ఇవేళో రేపో అమావాస్య అనుకున్నాడు. అంటే తనొచ్చి అప్పుడే మూడు నెలలైంది. ఇరవై నాలుగు గంటలూ నడిచే జూట్ మిల్లులో పని. సగం రోజులు పగలు, సగం రాత్రిళ్ళు ఉంటుంది డ్యూటీ.

రోజుకి మూడు వందలు ఇస్తారు, రోజు కూలీ కింద అని చెప్పారు. "అమ్మో! అంతే! మా ఊళ్లో అయితే వంద కూడా వచ్చేది కాదు. ఇంకేం తొందరలో ఇల్లు చూసుకుని అందర్నీ..." సుధీర ఆలోచన అలాగే ఉంది, జీతం ఇచ్చే రోజున తెల్ల బట్టలాయన వచ్చేసి సగం తను పట్టేశాడు.

"ఇంత శ్రమపడి మిమ్మల్ని తీసుకొచ్చి వీళ్ళనీ వాళ్ళనీ కాళ్ళు పట్టుకుని ఉద్యోగాలిప్పించినందుకు నాకేం ఉండదా మరీ?" పాన్ నముల్తూ, వంకర నవ్వు నవ్వాడు.

"ఈ సంగతి ముందు చెప్పనే లేదు కదండీ... ఇంక ఇంటికేం అంపుతాం... మేమేం తింటాం..." సుధీర లో గొంతుతో అన్నాడు.,

"మీ నాయుడికి చెప్పాన్రా! మీరంతా ఒప్పుకున్నారన్నాడు. ముందస్తు అగ్రిమెంటే అది..."

"ఎన్నాళ్ళండీ?"

"మీరిక్కడ చేసినన్నాళ్ళూ సగం నాదే" నోట్లు లెక్కపెట్టుకుంటూ వెళ్ళిపోయాడు. పోతూ పోతూ పక్కనున్న గోడమీద తుపుక్కున ఉమ్మేసి మరీ...

సుధీర, ఈరేశు అక్కడే నేలమీద చతికిలబడి పోయారు. వాళ్లిద్దరే అక్కడి మిల్లులో చేరారు. మిగిలిన వాళ్లని, బెజవాడలో రైసు మిల్లుల్లో పెట్టాడు కాంట్రాక్టరు. అక్కడ కూలి కొంచెం తక్కువ. సుధీర, ఈరేశు బలంగా ఉన్నారని జూట్‌మిల్లుకి తీసుకొచ్చాడు.

నెలకొచ్చే నాలుగువేల ఐదొందల్లో వాళ్లు ఉండటానికీ, తిండికీ మూడు వేలవుతోంది. మిల్లు పక్కనే షెడ్డులో సుధీర లాంటి వాళ్లు పది మంది ఉంటున్నారు. బాత్రూం కమ్ లెట్రిన్ ఒకటే. దానికే నెలకి వెయ్యి రూపాయలు అద్దె. మిగిలిన దాంట్లో వాళ్లు తినాలి, ఇంటికి పంపాలి.

## నయన డిమాండ్ ఆ రేంజ్‌లో ఉందా?



*సెకండ్ ఇన్నింగ్స్‌లో త్రిష లాంటి హీరోయిన్లు సక్సెస్ సాధించడానికి కిందా మీదా పడుతుంటే నయన మాత్రం వరుస విజయాలతో దూసుకుపోతోంది. ఓ పక్క కుర్ర హీరోలతో మరో పక్క సీనియర్ హీరోలతో కూడా సినిమాలు చేసేస్తూ యమబిజీగా ఉన్న నయన ఓ సినిమాకోసం ఏకంగా నాలుగు కోట్లు అడిగిందట! అందులో కోలీవుడ్ సీనియర్ హీరో నటిస్తుండడంతో అంత ఇమ్మని అడిగిందట! నయన చెప్పిన రేటు విని దర్శక నిర్మాతలకు కళ్ళు తిరిగినంత పనైందట ! అయితే ఆ హీరో పక్కన నయన తప్ప మరో హీరోయిన్ సెట్ అవదనే ఉద్దేశంతో నయనతో రెమ్యునరేషన్ విషయంలో బేరసారాలు మొదలు పెట్టారట.*

నెలకి పదిహేను వందలు పంపేసరికి చుక్కలు కనిపిస్తున్నాయి. అక్కడ నలుగురు మనుషులు దాంతో ఏం సర్దుకుంటున్నారో. సుధీర కళ్ళు పొడారిపొయ్యాయి. ఎన్నాళ్ళిలా...

అనుకోకుండా ఆ నెలలోనే సుధీరకి మంచి అవకాశం వచ్చింది.

"మేనేజర్ సార్ పిలుస్తున్నారు" గోనె తాళ్ళని కట్టగా కడుతున్న సుధీర తలెత్తి ఆశ్చర్యంగా చూశాడు. తనతో ఆయనకేం పని... రేపట్నుంచీ మిల్లుకి రావద్దనడు కదా!

సుధీర అనుకున్నంతా అయింది. మిల్లుకీ తనకీ ఉద్వాసనైపోయింది.

"నీకు ఇక్కిడిచ్చినంతా ఇస్తాము... మా ఇంట్లో పని చేస్తావా? కొంచెం కష్టమైన పనే... మా నాన్నగారికి పక్షవాతం వచ్చింది. ఆయన పనంతా చేయాలి. అది కాక ఇంట్లోని పని కూడా" మేనేజర్ ప్రకాశ్ అడిగాడు.

సుధీర ఒక్క నిమిషం ఆలోచించాడు. "మరి నేను మీ దగ్గరున్నట్లు ఇక్కడోళ్లకి తెలుస్తే..." తెల్ల బట్టలాయన ఏవంటాడో!

"నీకే ఇబ్బందీ ఉండదు. ఇక్కడుంచడం తియ్యడం అంతా నా చేతిలో పని. కానీ నువ్వు మా ఇంట్లో చెయ్యగలవా అని..."

"చేస్తా సార్! మా నాయనకి పక్షవాతమొచ్చినప్పుడు ఈ చేతులమీదే మోసేవోణ్ణి. అదేం పెద్ద కష్టం కాదు" మొత్తం జీతం తనకే వస్తుంది. ఆనందంతో సుధీర మొహం విప్పారింది.

వచ్చిన రెండోరోజే బబ్లూకి బాగా చేరికైపోయాడు. బబ్లూలో విష్ణుని చూసుకోసాగాడు.

●●●

ప్రకాశ్ ఇంట్లో చేరి రెండేళ్ళైపోయింది. ప్రతీ నెల ఐదు వేలు ఇంటికి పంపి, నాలుగు వేలు సారుకే ఇచ్చి బ్యాంక్‌లో వెయ్యమన్నాడు. తన భోజనం సారింట్లోనే. ఉంటానికో మూల కూడా ఇచ్చారు. అందరూ కడుపునిండా తింటున్నారు, వంటినిండా బట్ట కట్టుకుంటున్నారు. కానీ అవేనా జీవితంలో కావలసినవి. ఒక్కసారి ఇంటి కెళ్లొస్తే బాగుండు... కానీ పెద్దయ్యగారు? సుధీరకి అడగడానికి నోరు రావట్లేదు. ఆ రోజు ఇంటిమీద బెంగ ఎక్కువైపోయింది. అప్పుడే కన్నీళ్ళు కారుస్తుంటే ప్రకాశ్ కంటపడ్డాడు.

బబ్లూని స్కూల్లో దించి ఇంట్లోకొస్తున్న సుధీర కాళ్ళు తడబడ్డాయి. వరండాలో ప్రకాశ్ బాబు, అమ్మగారు.. తీక్షణంగా తనవేపే చూస్తున్నారు! ఏదైనా తప్పు చేశాడా?

"ధీరా! ఇటురా..." ప్రకాశ్ గంభీరంగా పిలిచాడు. అతనిదే కొద్దిగా రంగు మారిన తెల్లని పొడవు చేతుల చొక్కా, వెలిసిపోయిన జీన్స్ పాంటు వేసుకుని ఆరోగ్యంగా ఉన్న సుధీర చేతులు కట్టుకుని నిలబడ్డాడు. పెదవులమీద సహజంగా ఉండే నవ్వు లేదు. కళ్ళల్లో భయం.

"ఏమయింది? ఇక్కడ నీకేమైనా ఇబ్బందిగా ఉందా? ఎందుకు బాధపడుతున్నావు?"

"అబ్బెబ్బే... ఏం లేదు సార్! బాగానే ఉన్నా. అంతా బాగా చూసుకుంటున్నారు" కంగారుగా

అన్నాడు సుధీర.

"మరి పొద్దుట్నుంచీ ఎందుకలా ఉన్నావు?" రజని అడిగింది.

"ఏం లేదమ్మా... ఈవేళ మా అబ్బాయి పుట్టిన రోజు... ఒకటే జ్ఞప్తికొస్తున్నాడు" పట్టి పట్టి మాట్లాడుతున్న సుధీర భాష విని నవ్వింది రజని. వాళ్ళింటి కొచ్చాక వాళ్ళలా మాట్లాడ్డానికి ప్రయత్నిస్తున్నాడు.

సామాజిక దృక్పథం కలిగిన ప్రకాశ్‌కి తన మీద తనకే కోపం వచ్చింది. ఇన్ని రోజులూ సుధీర చేత పని చేయించుకోవడమే కానీ అతని కుటుంబ విషయాలు అడగనందుకు. అతనూ మనిషే కదా! రాగద్వేషాలుంటాయి. అభిమానం, బాధ ఉండవా... మాను, మాకు, మెషీన్ కాదు కదా!

"ఎవరెవరుంటారు మీ ఊర్లో?"

సుధీర చెప్పుకొచ్చాడు.

"ఊరొదిలి వచ్చిన దగ్గర్నుంచీ ఒక్కసారి కూడా వెళ్ళలేదమ్మా! అందరూ బాగున్నార్ట... శీనుగాడు ఉత్తరాలేస్తున్నాడు. కానీ..."

"ధీరా! పెద్దయ్యగారు పిలుస్తున్నారు" పని మనిషి వచ్చి చెప్పింది.

"సర్లే... వెళ్లు. పెద్దాయనేం చేశాడో!" ప్రకాశ్ పేపర్లోకి తల దూర్చాడు. సుధీర గట్టిగా నిట్టూర్చి లోపలికెళ్లిపోయాడు. కంఠ శోష. ఎవరూ చేసేది ఏమీ లేదు.

●●●

"ధీరా!" గేటు చప్పుడు, అయ్యగారి పిలుపు విని పక్క సందులోంచి పరుగెత్తుకుంటూ వచ్చాడు సుధీర. అతను ఎప్పుడూ ఆ సమయంలో రాడు. ఏమయిందో.

"అయ్యగారేం చేస్తున్నారు?" సుధీర నవ్వు మొహం చూస్తూ అడిగాడు ప్రకాశ్.

"పండుకున్నారు సార్. ఇంకో గంటవరకూ లేవరు. అమ్మగారున్నారు హాల్లో... పిలవమంటారా?"

"వద్దు. నువ్వు నాతో రా... మళ్లీ గంటలోపే వచ్చెయ్యొచ్చు"

"అలాగే సార్... అమ్మగారికి చెప్పి వచ్చేస్తా." రెండు నిమిషాల్లో వచ్చి కార్లో డ్రైవర్ పక్కన కూర్చున్నాడు. ప్రకాశ్ వాళ్లిల్లు ఊరు చివర్లో ఉంటుంది.

ఇంటికి రెండు వీధులవతల ఇందిరమ్మ ఇళ్లు ఉన్న కాలనీ లోపలికి మళ్లింది కారు. ఇక్కడ అయ్యగారికేం పనబ్బా అనుకున్నాడు సుధీర. ఎప్పుడైనా ఏదైనా పార్టీలకి తీసుకెళ్లినప్పుడు పెద్ద పెద్దోళ్ళిళ్ళకి తీసుకెళ్ళేవోరు. కానీ ఇక్కడికి... కళ్లు పెద్దవి చేసి చుట్టూ చూస్తున్నాడు సుధీర. కారు ఆగింది. ప్రకాశ్, సుధీరకి సైగ చేసి తను కూడా కారు దిగాడు.

"అయ్యా!"

తన చెవులను తానే నమ్మలేకపోయాడు. ఎక్కడి నుంచో విష్ణు పిలుపు... అంతా తన భ్రమ.

నిజంగానే, నాలుగో నంబరు ఇంట్లోంచి విష్ణు నాయక్ పరుగెత్తుకుని వచ్చాడు. బాగా పొడుగు అయ్యాడు. వెనుకే వాడి తల్లి నవ్వుతూ.

"ధీరా!" అమ్మ పిలుపు. వెనుతిరిగాడు. కారు పక్కనుంచి వస్తున్నారు తల్లీ, తండ్రీ, కాలెగరేస్తూ శీనుగాడూ!

"సార్!" అక్కడే రోడ్డుమీదే ప్రకాశ్ కాళ్ళ మీద పడబొయ్యాడు సుధీర. విష్ణు కాళ్లు గట్టిగా పట్టేసుకుని ఆపాడు. రెండు చేతులూ ఎత్తి నమస్కారం చేశాడు. కన్నీళ్లు ఆపుకునే ప్రయత్నం ఏమీ చెయ్యలేదు. కళ్లు మసకలుగా అయి అందరూ ఇద్దరిద్దరు కనిపిస్తున్నారు.

●●●

"అయ్యగారు మిల్లులో అడిగి నీ అడ్రస్ తీసుకుని నన్ను పంపారు. నీ అకౌంట్‌లో ఉన్న డబ్బుకి తను కొంత కలిపి ఈ ఇల్లు నీ పేరు మీద తీసుకున్నారు. రేపే రిజిస్ట్రేషన్. మీ అబ్బాయికి స్కూల్లో సీటు కూడా..." ఆ సాయంత్రం పక్కింట్లో ఉండే ప్రకాశ్ డ్రైవర్ చెప్తుంటే కళ్ల ముందు శ్రీకాకుళం కూర్మనాథుడు కనిపించాడు సుధీరకి.

**సెల్: 9701215465**






**ధూమ్రాక్షుడు, వజ్రదంష్ట్రుడు, అకంపనుడు వరుసగా వానరుల చేతిలో హత మయ్యారు. ఓటమి ఎరుగని రాక్షసవీరులు యుద్ధరంగంలో నేల కూలారు. అది తెలిసి, తట్టుకోలేకపోయాడు రావణుడు. కన్నీరుపెట్టుకున్నాడు. తర్వాత ఆగ్రహావేశాలతో ఊగిపోయాడు. సైన్యాధ్యక్షుడు ప్రహస్తుణ్ణి కేకేశాడు. యుద్ధానికి వెళ్ళమని ఆజ్ఞాపించాడతన్ని. రాక్షసజాతికోసం, రాజుకోసం తన ప్రాణాల్ని బలిపెడతానంటూ బయల్దేరాడు ప్రహస్తుడు.**

# అబ్బురపడ్డ రాముడు:హడలెత్తించిన రావణుడు

ముందు మందిరానికి చేరుకున్నాడు. శుచి అయ్యాడు. హోమం చేశాడు. పెద్దలనూ, యోగ్యులనూ పూజించి వారి ఆశీస్సులందుకున్నాడు. తర్వాత అలంకరించుకుని, రథం దగ్గరకు చేరుకున్నాడు. ఆసరికి ఉత్తమాశ్వాలను పూన్చి, సర్పధ్వజం ఎత్తి రథం సిద్ధమై ఉంది. శస్త్రాయుధాలు కూడా సర్దిపెట్టారందులో. అన్నిటినీ గమనించి, రథాన్ని అధిరోహించాడు ప్రహస్తుడు. చుట్టూ చూశాడు. ఉపసేనానాయకులు సమున్నత, నరాంతక, మహాహను, కుంభహనులు అతని కనుసైగకోసం ఎదురు చూస్తూ యుద్ధోన్ముఖులై ఉన్నారు. క్షణంపాటు కళ్ళు మూసుకుని, కళ్ళు తెరిచాడు ప్రహస్తుడు. పదండి అన్నట్టుగా తలెగరేశాడు. శంఖ దుందుభులు మోగాయి. సైన్యం ముందుకు కదిలింది. అంతా తూర్పుద్వారం గుండా బయల్దేరారు. అంతలో ఆకాశంలోంచి వదిలిన బాణంలా కిందకి దిగి వచ్చి, సర్పధ్వజాన్ని చీల్చి వేసింది ఓ గద్ద. ఆకాశంలోని గ్రహాలు ఒకటినొకటి రాసుకున్నాయి. నిప్పులుమిశాయి. సారథి చేతిలోని చర్నాకోలా జారి పడింది. అన్నీ అపశకునాలే! అయినా లక్ష్యపెట్టలేదు ప్రహస్తుడు. భయపడలేదు. వానరసైన్యంలోనికి దూసుకు వచ్చాడు.

అపారసైన్యంతో వచ్చిన ప్రహస్తుణ్ణి దూరం నుంచి చూశాడు రాముడు.

"ఎవరది?" అడిగాడు పక్కగా నిల్చున్న విభీషణుణ్ణి.

"అతని పేరు ప్రహస్తుడు. సర్వసైన్యాధ్యక్షుడు. రావణునికి విశ్వాసపాత్రుడు" చెప్పాడు విభీషణుడు.

"సైన్యంలోని మూడవభాగం అతని అధీనం." చెప్పాడు మళ్ళీ.

రామ విభీషణుల సంభాషణ జరుగుతుండగానే సైన్యాలు రెండూ పోరాటానికి సిద్ధమయ్యాయి. పోరులో మునిగిపోయాయి. ఇరుపక్షాల్లోనూ సైనికులు లక్షల్లో మరణించారు.

ఓ పక్క చెట్లూ, రాతిగుండ్లను ఉపయోగించి యుద్ధం చేస్తూ, మరోపక్క దొరికిన రాక్షసుణ్ణి దొరికినట్టే దగ్గరగా లాక్కొని, వారి తలలు వంచి, జుత్తు పీకి, దంతాలతో కొరికి, గోళ్ళతో బరికి, పిడికిళ్ళతో గుద్ది, కాళ్ళు పట్టి గిరగిరా తిప్పి, నేలకు మోదసాగారు వానరులు. ద్వంద్వయుద్ధాలకు కూడా వెనుకాడలేదు. సముద్రం పొంగుతున్నట్టుగా వానర సైన్యం మీది మీదికొస్తోంటే వారిని శాయశక్తులా అడ్డుకున్నారు ఉపసేనాపతులు. అయితే వానర వీరులు దుర్ముఖ, తార, మైంద, జాంబవంతుల చేతిలో వరుసగా సమున్నత, కుంభహన, నరాంతక, మహాహనులు హతమయ్యారు. సహాయులు హతమవ్వడాన్ని హరాయించుకోలేకపోయాడు ప్రహస్తుడు. రెట్టించిన కోపంతో వానరసేనాసముద్రంలో మందరంలా నిలిచాడు. వేలకొలది బాణాలు ప్రయోగించి, కుప్పతెప్పలుగా వానరుల్ని కూల్చాడు. రక్తం ఏరులై ప్రవహించిందప్పుడు. అందులో ఈదుతూనే యుద్ధం చేయసాగాయి సైన్యాలు.

**సైన్యాధ్యక్షుడు ప్రహస్తుడు కూడా నేలకొరిగాడన్న వార్తవిని రావణుడు తీవ్ర ఆగ్రహాన్ని, ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశాడు. స్వయంగా యుద్ధానికి బయలుదేరి వెళ్ళాడు. దేవఅసురగణాల్లో ఇంతటి తేజోవంతుడు లేడుగాక లేడని రావణుణ్ణి చూసి అబ్బురపడ్డాడు రాముడు. అన్న అనుమతితో రావణునిపై యుద్ధానికి సన్నద్ధమయ్యాడు లక్ష్మణుడు. అంతలోనే ఊహించని సంఘటన జరిగింది. అదేమిటి?**

ప్రహస్తుని విజృంభణను అడ్డుకోదలచాడు వానరసేనాధ్యక్షుడు నీలుడు. అతనితో ముఖాముఖీ తలపడ్డాడు. ప్రహస్తుని బాణాలు నీలుణ్ణి తీవ్రంగా గాయపరిచాయి. బాణాలన్నీ నీలుని దేహంలోంచి ప్రయాణించి భూమిని గుచ్చుకుని నిలిచాయి. ముష్టియుద్ధానికి సిద్ధపడ్డాడు నీలుడు. చేతితో అందుకుందామంటే ప్రహస్తుడు అతనికి అందడం లేదు. పైగా తన దగ్గరకు రాకుండా నిలువరిస్తూ పరంపరగా బాణాలను ప్రయోగిస్తున్నాడతను. బాణాలను తప్పించుకుని, ఓ చెట్టును పెరికాడు నీలుడు. దానితో ప్రహస్తుణ్ణి మోదాడు. దెబ్బకి రక్తం కక్కున్నాడు ప్రహస్తుడు. అంతలోనే సింహనాదం చేస్తూ తేరుకున్నాడు. నీలుని మీద బాణ వర్షం కురిపించాడు. ఎటు చూస్తే అటు బాణాలు. కదలనీయడం లేదు. శరీరం అంతా చిల్లులు చేస్తున్నాడు. ఓర్చుకున్నాడు నీలుడు. అంతలో అటుగా ఏనుగు వచ్చింది. దానిని అడ్డుపెట్టుకుని వెళ్ళి, ఓ పెనువృక్షాన్ని పెరికి వేశాడు నీలుడు. దానితో ముందు ప్రహస్తుని గుర్రాలనూ, సారథినీ చంపాడు. తర్వాత రథంపైకి దూకి, ప్రహస్తుని చేతిలోని విల్లును అందుకున్నాడు. దాన్ని ముక్కలు చేశాడు. ద్వంద్వ యుద్ధానికి తలపడ్డాడు. భీకరయుద్ధం చేశారిద్దరూ. ఆఖరికి దగ్గరలో ఉన్న ఓ రాయిని అందుకుని దానిని ప్రహస్తునిపై విసిరేశాడు నీలుడు. ఆ దెబ్బకి తల చిట్లి, శరీరం చితికి నేల కూలాడు ప్రహస్తుడు. ఎప్పుడైతే ప్రహస్తుడు నేల కూలాడో అప్పుడు వానరవీరులంతా నీలుని చుట్టూ చేరి, జయజయధ్వానాలు చేశారు. రామలక్ష్మణ సుగ్రీవులు కూడా నీలుణ్ణి అభినందించారు. ప్రహస్తుని మరణంతో రాక్షసవీరులు దిక్కులేనివారయ్యారు. చేష్టలుడిగి, కన్నీరుపెట్టుకుని యుద్ధరంగం నుంచి పరుగుదీశారు. రావణుని చేరుకున్నారు. శోకిస్తున్న సైన్యాన్ని చూసి ప్రహస్తుడు మరణించాడని అర్థం చేసుకున్నాడు రావణుడు. అతనూ కన్నీరుపెట్టుకున్నాడు. కాసేపటికి తేరుకున్నాడు. కోపోద్రిక్తుడయ్యాడు. సింహాసనంపైనుంచి లేచి పైకి చూశాడు. వేలాడుతున్న లస్తరుని అందుకున్నాడు. కిందికి దిగలాగి దానిని వదిలేశాడు. పైకప్పుని అంటిపెట్టుకున్న లస్తరు, బలంగా రావణుడు దిగలాగి వదిలేయడంతో కింద పడి భళ్ళున పగిలిందది. అందులోని దీపాలు చెల్లాచెదురయ్యాయి.

"ఆశ్చర్యం! నమ్మలేకపోతున్నాను. దేవతల్ని సైతం భయభ్రాంతుల్ని చేసిన నా ప్రహస్తుణ్ణి, నా సర్వసైన్యాధ్యక్షుణ్ణి కోతిమూకలు కూల్చాయంటే విడ్డూరంగా ఉంది. తప్పు చేశాను. నర వానరులంటూ వారిని ఉపేక్షించి రాక్షసమహా... మహావీరులను పోగొట్టుకున్నాను. ఇక ఉపేక్షించేది లేదు. యుద్ధానికి నేనే సిద్ధమవుతాను. సిద్ధమయి, ఆ కోతిమూకల్నీ, ఆ రామలక్ష్మణుల్నీ నా బాణాలతో నేనే మాడ్చి మసి చేస్తాను." అన్నాడు రావణుడు.



"రథాన్ని సిద్ధం చెయ్యండి." అన్నాడు.

రాజాజ్ఞను అనుసరించి రథాన్ని సిద్ధం చేశారు రాక్షసులు. రావణుడు వచ్చాడక్కడికి. తలెత్తి రథపతాకను చూశాడు ముందు. తర్వాత పూన్చిన అశ్వాలను చూశాడు. చేతితో వాటిని కాసేపు నిమిరాడు. రథంలో వరుసగా పేర్చిన వివిధ ఆయుధాలను చూశాడు. తలెగరేసి, రథాన్ని అధిరోహించాడు రావణుడు. పౌరులు ఆశీర్వాదాలు అందజేశారు. శంఖ భేరీ ధ్వనులు మోగాయి. పిశాచగణంలా ఆయుధ ధారులైన రాక్షససైన్యం వెన్నంటి వస్తోంటే రావణుడు ఉత్తరద్వారాన్ని సమీపించాడు.

ఉత్తరద్వారం నుంచి లక్షలాదిగా తరలి వస్తున్న సైన్యాన్ని చూశాడు రాముడు. విభీషణుని అడిగాడిలా.

"వస్తున్నది ఎవరు విభీషణా?"

"ఇంకెవరు స్వామీ! యుద్ధానికి లంకాధీశుడు రావణాసురుడే వస్తున్నాడు. ఆ సైన్యం అతనిదే." అన్నాడు విభీషణుడు.

రావణుణ్ణి చూసేందుకు ముచ్చటపడ్డాడు రాముడు. సైన్యం మధ్య కనిపించని రావణుని కోసం మునికాళ్ళపై నిలిచాడు. అతని ఉద్దేశాన్ని గ్రహించిన విభీషణుడు అన్నాడిలా.

"రామా! అదిగో! వేయిసూర్యుల వెలుగుతో ఒప్పారుతున్న ఆ రథం రావణుడిదే! తళతళలాడుతున్న రత్నకుండలాలు, ఉజ్వలకిరీటం, చంద్రుడులాంటి ఛత్రంతో వింధ్యాచలంలా కనిపిస్తున్న ఆ దృఢకాయుడే రావణుడు. ఇంద్రునిసైతం పాదాక్రాంతం చేసుకున్న మహావీరుడతడే."

రావణుణ్ణి తేరిపార చూశాడు రాముడు.

సూర్యుడిలా ప్రకాశిస్తున్నాడు. విక్రమ తేజోపౌరుషాలతో శోభిస్తున్నాడు. దేవ అసురగణాల్లో ఇంతటి తేజోవంతుడు లేడుగాక లేడు అనుకున్నాడు రాముడు. ఆయుధాలతో రావణుణ్ణి అనుసరిస్తున్న శూరులు కూడా సాధారణమైనవారు కాదనుకున్నాడు. విభీషణుణ్ణి చూశాడు.

"మిత్రమా! నా అదృష్టం ఫలించింది. రావణుడు నా కంటబడ్డాడు. ఆనాడు సీతను అపహరించిన నేరానికి రాముడు ఈనాడు ఎలాంటి శిక్ష విధిస్తాడో చూడు." అన్నాడు రాముడు. ధనుస్సును ఎక్కుపెట్టాడు. తమ్మునిసహా యుద్ధరంగంలో నిలిచాడు.

దిక్కులు పిక్కటిల్లేలా సింహనాదం చేశాడు రావణుడు. వానరసేనాసముద్రాన్ని రెండుగా చీల్చి వేస్తున్నట్టుగా రథంపై దూసుకుని వచ్చి, సైన్య మధ్యంలో నిలిచాడు. ధైర్యంగా నిలిచిన రావణుణ్ణి ముందు సుగ్రీవుడు ఎదుర్కొన్నాడు. గురి చూసి, ఒక రాతిగుండును అతని పైకి విసిరాడు. తన బాణాలతో ఆ గుండును పిండిపిండి చేశాడు రావణుడు. తర్వాత వజ్రాయుధంలాంటి బాణాన్ని సుగ్రీవునికి గురి పెట్టి వదిలాడు. అది సుగ్రీవుని రొమ్ము చీల్చింది. ఆవలివైపునకు వచ్చి నిలిచింది. గుండెల్లో చెప్పలేనంత మంట కలిగిందేమో! పెద్దగా అరుస్తూ కిందపడిపోయాడు సుగ్రీవుడు. స్పృహ కోల్పోయాడు.

ఋషభ, జ్యోతిర్ముఖ, గవాక్షాది వానరవీరులు చూశారది. రావణుని నిలువరించే ప్రయత్నాలు చేశారు. పెద్దపెద్ద చెట్లను పెరికి, వాటిని రావణుని పైకి విసిరారు. వచ్చి పడుతున్న ప్రతి చెట్టునీ ముక్కలు ముక్కలు చేశాడు రావణుడు. తర్వాత నిశితవిశిఖాలు ప్రయోగించి, వారందరినీ స్పృహ కోల్పోయేలా చేశాడు. మహామహావీరులు స్పృహ కోల్పోయి, యుద్ధరంగంలో పడి ఉండడాన్ని చూసి, మిగిలిన వానరవీరులు భయపడిపోయారు. పరిగెత్తుకుని వచ్చి రాముని చాటుగా నిల్చున్నారు. వచ్చి నిలిచిన వానరవీరులకు అభయం ప్రసాదిస్తున్నట్టుగా రాముడు నారి సారించాడు. రావణునితో యుద్ధానికి సిద్ధమయ్యాడు. అలా సిద్ధమయిన రామునికి నమస్కరిస్తూ అడిగాడిలా లక్ష్మణుడు.

"అన్నా! ఆ రావణుణ్ణి చంపాల్సింది నువ్వే! కాకపోతే ముందుగా వాణ్ణి ఎదిరించే అవకాశాన్ని నాకు ఇవ్వు."

నవ్వుతూ సరేనన్నట్టుగా తలూపాడు రాముడు. అంతలోనే హెచ్చరికగా చెప్పాడిలా.

"లక్ష్మణా! రావణుడు గొప్ప యుద్ధనిపుణుడు. పరాక్రమవంతుడు. కాబట్టి జాగ్రత్తగా అతనితో యుద్ధం చెయ్యాలి. నీ లోపాలు అతనికి తెలియకూడదు. కాని అతని లోపాలు నువ్వు తెలుసుకోగలగాలి. కంటినీ, వింటినీ చాకచక్యంగా ఉపయోగించుకో."

"సరేనన్నా" అన్నాడు లక్ష్మణుడు. రామునికి సాష్టాంగ నమస్కారం చేశాడు. రావణుణ్ణి ఎదిరించేందుకు ధైర్యంగా ముందుకు నడిచాడు.

రావణుణ్ణి లక్ష్మణుడు ఎదిరించనేలేదు, హనుమ రావణునితో పోరాటానికి సిద్ధమయ్యాడు. రావణుని బాణాలను తోకతో అందుకుని విసిరేస్తూ, ఒక్క ఉదుటున అతని రథంపైకి చేరాడు. ఎర్రగా రావణుణ్ణి చూసి అన్నాడిలా.

"రావణా! నీ వరప్రభావంతో దేవ యక్ష గంధర్వులు నిన్నేమీ చెయ్యలేరుగాని, మా వానరులూ, నరులూ నీ అంతు చూడడం ఖాయం. కాచుకో! ఒకే ఒక గుద్దు! ఈ గుద్దుతో నీ పంచప్రాణాలూ గాలిలో కలిసిపోతాయి."

అవునా? అని ఆశ్చర్యంగా చూశాడు రావణుడు. తర్వాత పగలబడి నవ్వాడు.

"కొట్టు! ఒకే ఒక గుద్దుతో నన్ను చంపు! చంపి, రావణుణ్ణి చంపిన హనుమ అని కీర్తి ఆర్జించు. అయితే దానికి ముందు నా గుద్దు రుచి చూడు." అన్నాడు రావణుడు. అరచేతిని పిడికిలి చేసి, దానితో హనుమ రొమ్ముపై గట్టిగా గుద్దాడు. ఆ దెబ్బకి కళ్ళు తిరిగి హనుమ తూలిపోయాడు. రథంపై నుంచి కింద పడేవాడే! కాని గట్టిగా నిలదొక్కుకున్నాడు. రక్తం కళ్ళల్లో చిప్పిల్లుతోంటే...చేతిని బిగించి, పిడికిలిపట్టి రావణుని గుండెల్లో గట్టిగా పొడిచాడు హనుమ. ఆ పోటుకి రావణుడు గుటకలు మింగాడు. కంపించిపోయాడు. రథంలో కూలిపోయాడు.

అది గమనించిన దేవతలూ, ఋషులూ, వానరులూ హనుమను ఎంతగానో మెచ్చుకున్నారు. అంతలో రావణుడు తేరుకున్నాడు. తననే కోపంగా చూస్తున్న హనుమతో అన్నాడిలా.

"గొప్పదెబ్బ కొట్టావురా కోతీ! ఒప్పుకుంటున్నాను, నువ్వు మహావీరుడివే! మెచ్చుకుంటున్నాను, నీ భుజబలాన్ని."

"నువ్వు నన్ను మెచ్చుకోవడం కాదు నాకు కావాల్సింది. నా చేతిలో నువ్వు చచ్చిపోవాలి. నాకు కావాల్సిందదే." అన్నాడు హనుమ. ఆ మాటకి ఆగ్రహోదగ్రుడయ్యాడు రావణుడు. బలాన్నంతా కూడదీసుకుని, హనుమ కడుపులో పిడికిలితో గట్టిగా పొడిచాడు. దానికి గింగిర్లు తిరిగాడు హనుమ. రథం మీది నుంచి కిందికి జారిపడిపోయాడు. అదే అవకాశంగా రావణుడు, నీలునితో పోరాటానికి సిద్ధమయ్యాడు. కాసేపటికి హనుమ తేరుకున్నాడు. రావణునితో తలపడేందుకు చూశాడు. అయితే రావణుడు నీలునితో యుద్ధం చేస్తుండడాన్ని గమనించి, అతనితో యుద్ధాన్ని విరమించుకున్నాడు.

తనపై కొండల్ని విసురుతున్న నీలునిపై రావణుడు పావకాస్త్రం ప్రయోగించాడు. ఆ అస్త్రానికి నేలకూలాడు నీలుడు. మంటల్లో మాడి మసైపోతున్నట్టుగా బాధనుభవించాడు. అయితే అదృష్టవశాత్తు నీలుడు, పావకుని కుమారుడు కావడంతో అతడు మరణించలేదు.

-అరణి

# సౌభాగ్య చక్రం

జూలై 20 నుంచి
జూలై 26 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, వేడుకలు, ప్రేమానుబంధాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో కుటుంబ సభ్యుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. వేడుకలు, శుభకార్యాలకు ఏర్పాట్లు చేస్తారు. ఆర్థిక సంస్థలతో పనులు పూర్తవుతాయి. 23,24 తేదీల్లో దూరంలో ఉన్న ప్రియతముల కలయిక ఆనందం కలిగిస్తుంది. చిన్నారుల వైఖరి ఆవేదన మిగులుస్తుంది. 25,26 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రేమానుబంధాలు బలపడతాయి. పొదుపు పథకాలు లాభిస్తాయి. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, గృహరుణాలు, విద్యా విషయాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురు, శుక్రవారాల్లో వృత్తి, వ్యాపారాల్లో శుభపరిణామాలు చోటుచేసుకుంటాయి. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. ప్రముఖులతో సమావేశాలు లాభిస్తాయి. ఒక సమాచారం ఉల్లాసం కలిగిస్తుంది. 23,24 తేదీల్లో బంధుమిత్రులతో ఆనందంగా గడుపుతారు. కుటుంబ సభ్యుల కోసం ఖర్చుల అధికం. 25,26 తేదీల్లో వారసత్వ విషయాలకు అనుకూలం. గృహారంభ ప్రవేశాలకు అనుకూలం. కుటుంబ వ్యవహారాలు ఒక కొలిక్కి వస్తాయి



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, పెట్టుబడులు, విద్యా సంస్థలతో పనులు, ఇంటర్వ్యూలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో ఆర్థిక విషయాల్లో మీ అంచనాలు ఫలిస్తాయి. చర్చలు, సమావేశాలు, ఫలిస్తాయి. సంకల్పం నెరవేరుతుంది. 23,24 తేదీల్లో ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. పెద్దలతో సమావేశాలు ఫలిస్తాయి. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి ఒక సమాచారం నిరుత్సాహం కలిగిస్తుంది. 25,26 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సన్నిహితుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

అదనపు ఆదాయం, పొదుపు పథకాలు, ఫీజుల చెల్లింపులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో పెట్టుబడులు లాభిస్తాయి. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. గత స్మృతులు నెమరువేసుకుంటారు. బీమా, గ్రాట్యుటీ, పెన్షన్ వ్యవహారాలకు అనుకూలం. 23,24 తేదీల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. సంకల్పసిద్ధి కోసం అధికంగా శ్రమించాలి. 25,26 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

వేడుకలు, సమావేశాలు, ప్రయాణాలు ఆర్థిక నిర్ణయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో జనసంబంధాలు విస్తరిస్తాయి. భాగస్వామి వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. రాజకీయ సినీ రంగాల వారికి శుభప్రదం. ఎదుటివారి అంతరంగం తెలుసుకుని మసలుకుంటారు. 23,24 తేదీల్లో పెట్టుబడులపై దృష్టి సారిస్తారు. షాపింగ్, క్రయవిక్రయాలకు అనుకూలం. ఆరోగ్యం మందగిస్తుంది. ఆర్థిక విషయాల్లో తొందరపాటు తగదు. 25,26 తేదీల్లో సమావేశాలు, వేడుకల్లో పాల్గొంటారు. ఒక సమాచారం ఉల్లాసం కలిగిస్తుంది. సంకల్పం ఫలిస్తుంది.

### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

వృత్తిపరమైన సమావేశాలు, వేడుకలు, సమావేశాలు, సంస్మరణలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో సన్నిహితుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. వృత్తిపరమైన సమావేశాలు సత్ఫలితాలనిస్తాయి ఆర్థిక విషయాలు అనుకూలిస్తాయి. బంధుమిత్రులతో విందుల్లో పాల్గొంటారు. 23,24 తేదీల్లో వేడుకలు, శుభకార్యాల్లో పాల్గొంటారు. శ్రీవారు, శ్రీమతి అంతరంగం తెలుసుకుని మసలుకుంటారు. 25,26 తేదీల్లో ఉత్సవాలు, సంస్మరణల్లో పాల్గొంటారు. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ప్రేమానుబంధాలు, సమావేశాలు, షాపింగ్, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో పెద్దల సహకారంతో విద్యాసంస్థల్లో ప్రవేశం పొందుతారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. సృజనాత్మకంగా వ్యవహరించి వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. 23,24 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. విందు, వినోదాల్లో పరిమితి పాటించాలి. 25,26 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి విషయంలో శుభపరిణామాలు సంభవం. వేడుకల్లో పాల్గొంటారు. స్పెక్యులేషన్లు లాభిస్తాయి.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

ప్రముఖులతో సమావేశాలు, కొత్త ప్రాజెక్టులు, అదనపు ఆదాయం కోసం ప్రయత్నాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో విద్యార్థులకు వసతి లభిస్తుంది. సమావేశాలకు ఏర్పాట్లు చేస్తారు. బంధుమిత్రుల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. కీలక సమాచారం లభిస్తుంది. 23,24 తేదీల్లో సృజనాత్మకంగా వ్యవహరించి వృత్తి వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. ప్రియతములు, చిన్నారుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. 25,26 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

ఆర్థికపరమైన సమావేశాలు, దూరప్రయాణాలు, ఇంటర్వ్యూలకు సంబంధించిన అంశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. సమావేశాలు ఫలిస్తాయి. పూర్వ మిత్రులను కలుసుకుంటారు. బిల్లులు, చెక్కులు అందుకుంటారు. 23,24 తేదీల్లో బంధుమిత్రుల కలయికతో ఇల్లు సందడిగా ఉంటుంది. బదిలీలు, మార్పుల కోసం చేసే ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. 25,26 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రేమానుబంధాలు బలపడతాయి. ప్రియతముల నుంచి కీలక సమాచారం అందుకుంటారు.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, సంస్మరణలు, బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు, షాపింగ్‌లపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో స్పెక్యులేషన్లు, పెట్టుబడులు లాభిస్తాయి. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థికపరమైన సమావేశాలు ఫలిస్తాయి. 23,24 తేదీల్లో ఆర్థికపరమైన చర్చలు, ప్రయాణాలు ఫలిస్తాయి. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 25,26 తేదీల్లో గృహరుణాలు మంజూరవుతాయి. ఇంటికోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థిక విషయాలను సమీక్షించుకుంటారు.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

ఆరోగ్యం, వృత్తి, వ్యాపారాలు, వేడుకలు, జనసంబంధాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. కొత్త ప్రాజెక్టులు చేపడతారు. ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపిస్తారు. విందు వినోదాల్లో పాల్గొంటారు. 23,24 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. ప్రియతముల కోసం విలువైన వస్తువులు సేకరిస్తారు. స్పెక్యులేషన్లలో దూకుడు తగదు. 25,26 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. కీలక సమాచారం అందుకుంటారు. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు ఫలిస్తాయి.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, ఆరోగ్యం, బీమా, వృత్తిపరమైన సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు ప్రోత్సాహకరం. రహస్య సమాచారం తెలుసుకుంటారు. దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. 23,24 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. విందుల్లో పరిమితి పాటించాలి. 25,26 తేదీల్లో ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం లభిస్తుంది. హోటల్, వైద్యం, రిటైల్ రంగాల వారికి శుభప్రదం.




## నిర్మాత డబ్బులు ఎగ్గొట్టాడట!



నిర్మాత డబ్బులు ఇవ్వలేదంటూ ఆరోపించే దర్శకులు అరుదుగా కనిపిస్తుంటారు. ఇప్పుడు ఆ కోవలోకే చేరాడు నటుడు, దర్శకుడు రవిబాబు. రవిబాబు దర్శకత్వం వహించిన 'లడ్డూబాబు' రిలీజుకు ముందు అందరిలో ఆసక్తి రేకెత్తించినా విడుదల తర్వాత మాత్రం అట్టర్ ఫ్లాప్‌గా నిలిచింది. సినిమా కొత్తగా ఉన్నా దీనికి ప్రేక్షకులు కనెక్ట్ కాలేకపోయారు. ఇదంతా గతం. అయితే తాజాగా ఈ సినిమాకు సంబంధించి ఓ విషయాన్ని దర్శకుడు రవిబాబు తెరపైకి తీసుకు వచ్చాడు. ఈ సినిమాకు సంబంధించి రెమ్యునరేషన్ ఇవ్వకుండా ఆ నిర్మాత తనను మోసం చేశాడని చెప్పుకొచ్చాడు రవిబాబు. తన రెమ్యునరేషన్‌ను నగదు రూపంలో కాకుండా భూమి రూపంలో నిర్మాత ముట్టజెప్పాడనీ, అయితే ఆ భూమి గురించి విచారిస్తే అది ప్రభుత్వ భూమి అని తేలిందని ఆయన వాపోయాడు. ఇటు భూమీ పోయి, అటు డబ్బూ పోయి తాను మోసపోయానని అంటున్నాడు రవిబాబు.

## బోయపాటిని బాధపెట్టిన టీవీ న్యూస్



**బో**యపాటి శ్రీను 'దమ్ము'న్న దర్శకుడన్న సంగతి తెలిసిందే! 'దమ్ము' సినిమా తరువాత రెండు సంవత్సరాల పాటు బోయపాటి ఖాళీగా ఉన్నాడు. ఆ తరువాత ఓ సినిమా మొదలెట్టాడు. కారణాలు ఏవైనా ఆ సినిమా నుంచి బోయపాటి తప్పుకోవలసి వచ్చింది. ఆ విషయాన్నే బోయపాటి ఆ సినిమా హీరోతో మాట్లాడి ఇంటికి వచ్చి భోజనానికి కూర్చునే సరికి ఒక టీవీ ఛానెల్‌లో ఫ్లాష్ న్యూస్ కింద 'బోయపాటిని సినిమా నుంచి తప్పించారు' అంటూ ఇవ్వడం మొదలెట్టారట! ఆ సినిమా నుంచి తప్పుకున్న దానికంటే కూడా అలా టీవీలో ఫ్లాష్ న్యూస్ చూపించడం తనని విపరీతంగా బాధించిందని చెప్పుకొచ్చాడు. అయితే ఆ న్యూస్ ప్రసారం చేసిన ఛానల్ పేరు మాత్రం బోయపాటి బయట పెట్టలేదు.

## దర్శకుడు కాబోతున్న కామెడీ హీరో



**హీ**రోల్లో కామెడీకి కేరాఫ్ అడ్రస్ ఎవరూ అంటే టక్కున అల్లరి నరేష్ పేరే గుర్తుకు వస్తుంది. గత సినిమాల్లో ఆయన చేసిన కామెడీ ఇప్పటికీ 'కితకితలు' పెడుతూనే ఉంటుంది. అలాంటి కామెడీ హీరోకి ఇప్పుడు టైం పెద్దగా బాగున్నట్లు లేదు. వరుస ఫ్లాప్‌లతో ఇబ్బంది పడుతున్న నరేష్ మనసు దర్శకత్వం మీదికి పోయిందట! తన ఫాదర్ తనని దర్శకుడిగా చూడాలని అనుకున్నారట. అనుకోకుండా హీరో అయ్యాను. ఇప్పుడు నాన్నగారి కోరిక తీర్చాలనుంది అంటున్నాడు ఈ హీరో. మరో రెండు సంవత్సరాల తరువాత స్వంత బ్యానర్‌లోనే ఓ సినిమాను డైరెక్ట్ చేస్తానంటున్నాడు. దీనికి సంబంధించి పనులు కూడా మొదలయ్యాయట! మరి కామెడీ సినిమా తీస్తాడా? లేదా సీరియస్ మూవీ తీస్తాడా? అన్నది మాత్రం సస్పెన్స్!

## దటీజ్ ప్రకాష్‌రాజ్!



**ప్ర**కాష్‌రాజ్ చేతల మనిషే తప్ప మాటల మనిషి కాదు అంటున్నారు కొండారెడ్డి పల్లె ప్రజలు. ఆ గ్రామాన్ని ప్రకాష్ రాజ్ దత్తత తీసుకున్నప్పటి నుంచీ అక్కడ రకరకాల అభివృద్ధి పనులు చేస్తూనే ఉన్నాడు. కొత్తగా ఆ గ్రామంలో పాఠశాల భవనాన్ని శరవేగంతో పూర్తి చేయిస్తున్నాడు. మూడునెలల క్రితం ప్రారంభించిన పాఠశాల భవనం నిర్మాణం పనులను ప్రకాష్‌రాజ్ ఇటీవల స్వయంగా పర్యవేక్షించాడు. ఇందుకోసం రెండు రోజులు కొండారెడ్డిపల్లెలోనే ఉండిపోయాడు. ప్రకాష్‌రాజ్. సొంత సినిమా దర్శకత్వంలో ఎంత బిజీగా ఉన్నా, తమ గ్రామాన్ని మాత్రం మరిచిపోలేదని ఆ పల్లెజనం మురిసిపోతున్నారట! ఇప్పటి వరకూ డ్రైనేజీ, రహదారి వ్యవస్థలను మెరుగుపరిచిన ప్రకాష్‌రాజ్ త్వరలోనే మరి కొన్ని పనులు ప్రారంభిస్తానని గ్రామస్తులకు హామీ ఇచ్చాడట!

## 'బాహుబలి'ని దాటలేకపోయింది



**ఇ**ప్పుడు చాలా వ ంది 'సుల్తాన్' సినిమా గురించే మాట్లాడుకుంటున్నారు. ఆ సినిమా కచ్చితంగా ఇన్ని వందల కోట్లు వసూలు చేస్తుందని అంచనాలు వేస్తున్నారు. వసూళ్ళ పరంగా మంచి విజయాన్ని సాధిస్తున్న ఈ సినిమా ఓ సినిమాను దాటలేకపోయింది అంటున్నారు సినీ విశ్లేషకులు. ఆ సినిమానే 'బాహుబలి'. తెలుగు సినిమా సత్తా చాటిన ఈ సినిమాను వసూళ్ళలో 'సుల్తాన్' అధిగమిస్తుందని అందరూ అన్నారు కానీ, వాస్తవంలో అలా జరగలేదు. మొదటి రోజు 'బాహుబలి' 42.3 కోట్లు వసూలు చేస్తే 'సుల్తాన్' 37.2 కోట్లతో సరిపెట్టుకోవలసి వచ్చింది.

# ఆయనకి ఎంత ఓపికో!

-అనుష్క శర్మ



**బాలీవుడ్‌లో స్టార్ కాని స్టార్ హీరోయిన్ ఎవరూ అంటే టక్కున అనుష్క శర్మ పేరే చెబుతారు. దాదాపు స్టార్ హీరోలందరితోనూ అనుష్క నటించినా స్టార్ హీరోయిన్ అన్న ఇమేజ్‌కి మాత్రం ఆమడ దూరంలోనే ఉండిపోయింది. ముఖ్యంగా బాలీవుడ్‌లో ఖాన్ త్రయంతో నటించిన ఏకైక హీరోయిన్ అనుష్క శర్మ మాత్రమే! గతంలో అమీర్‌తో చేసిన 'పీకే' పాత రికార్డులను పీకేస్తే... ప్రస్తుతం 'సుల్తాన్' ఆ రికార్డును కూడా తుడిచేయడానికి సిద్ధమైపోయింది. గతంలో ఎన్నడూ లేని విధంగా 'సుల్తాన్'లో తన నట విశ్వరూపం చూపించిన అనుష్కతో...**

---

### 'సుల్తాన్'లో అవకాశం ఎలా వచ్చింది?

నిర్మాత ఆదిత్యా చోప్రా నాకు కథ చెప్పిన వెంటనే బాగా నచ్చింది. నేను మల్లయోధురాలిగా నటించగలనా? అన్న అనుమానం కొద్దిగా వచ్చింది. కానీ కథ నచ్చడంతో సినిమాను వదులుకోవాలని అనిపించ లేదు. అందుకే వెంటనే ఓకే చెప్పేశాను.

### మల్లయుద్ధంలో శిక్షణ పొందారా?

తీసుకున్నాను. సుమారు ఆరువారాల పాటు శిక్షణ పొందాను. పూర్తిగా నేర్చుకోలేదు కానీ సినిమాలో నా పాత్రకు అవసరమైనంత మేర శిక్షణ తీసుకున్నాను. ఆడుతూ పాడుతూ నేర్చుకునే విద్య మాత్రం కాదు. మనస్సూ, శరీరం దాని మీద పూర్తిగా లగ్నం చేస్తేనే దానిలో పూర్తి స్థాయిలో రాణించడానికి అవకాశం ఉంటుంది.

### మల్లయోధులకు సిక్స్‌ప్యాక్ ఉంటుందేమో కదా?

సిక్స్‌ప్యాక్ అని కాదు కానీ, బాడీ బిల్డింగ్ తప్పనిసరిగా కావాలి. నేను దాని జోలికి పోలేదు. బాడీ పెంచడం కొద్దిగా తేలికే కానీ, దాన్ని తగ్గించుకోవడానికి చాలా కష్టపడాలి. దర్శకనిర్మాతలు బరువు పెరగమని సూచించినా పెరగలేదు. శరీర బరువు పెరగకుండానే ఉన్న బరువుతోనే అవలీలగా నటించాను. ఈ పాత్ర కోసం నేను పడిన కష్టం సినిమాలో స్పష్టంగా కనిపిస్తుంది. ఇప్పుడు అందరూ చాలా బాగా చేశావని అంటుంటే చాలా సంతోషంగా ఉంది.

### ఈ సినిమాలో ఎక్కువగా కష్టపడిన సందర్భం?

మల్లయోధురాలిగానే కాకుండా భాష పరంగా కూడా కష్టపడ్డాను. హర్యానా లాంగ్వేజ్ మొదట్లో చాలా కష్టంగా అనిపించింది. దీని కోసం కూడా కొన్ని రోజులు ట్యూషన్ పెట్టించుకుని మరీ నేర్చుకున్నాను.

### ఖాన్ త్రయంతో నటించారు కదా? మిమ్మల్ని ఎవరు ఇన్‌స్పైర్ చేశారు?

ముగ్గురూ గొప్ప నటులే! ఒకరు గొప్ప ఒకరు కాదు అని చెప్పడం చాలా కష్టం. ఈ ముగ్గురి నుంచి చాలా విషయాలు నేర్చుకున్నాను. నా కెరీర్‌ను తీర్చిదిద్దుకునేందుకు వారు ఎన్నో సలహాలు, సూచనలు ఇచ్చారు.

### మీ కో స్టార్ సల్మాన్ ఖాన్ గురించి....

ఆయనకి ఎంత ఓపికో మాటల్లో చెప్పలేను. ముఖ్యంగా అభిమానులను ఎప్పుడూ నిరాశపరచడు. షూటింగ్ సమయంలో వందలాది మంది అభిమానులు చుట్టుముట్టేవారు. వారందరికీ ఓపికగా సమాధానాలు చెప్పేవాడు. వాళ్ళకి ఆటోగ్రాఫ్‌లు ఇవ్వడం, వారితో సెల్ఫీలు దిగడం చేసేవాడు. వాళ్ళంతట వాళ్ళు వెళ్ళిపోయే వరకూ వారితోనే ఉండి, ఆ తరువాత షూటింగ్‌కి వచ్చేవాడు. తన మూలంగా షూటింగ్‌కి అంతరాయం కలిగింది కాబట్టి మామూలు కన్నా ఎక్కువ సమయం ఉండి షూటింగ్ పూర్తి చేసేవాడు. ఆఖరికి ఇంటికి వెళ్ళిపోయే ముందు కూడా కొందరు అభిమానులు వచ్చేవారు. వారిని విసుక్కోకుండా మాట్లాడి పంపిచేసి తను ఇంటికి వెళ్ళిపోయేవాడు. ఇంత ఓపిక కొద్దిమందికి మాత్రమే ఉంటుంది. అందుకే ఆయన స్టార్ హీరో అయ్యాడు.

### హాలీవుడ్‌కి వెళ్ళే ఆలోచన ఉందా?

ప్రస్తుతానికి అయితే లేదు. భవిష్యత్తులో చెప్పలేను.

### దీపికా, ప్రియాంకా వెళ్ళారు కదా?

వాళ్ళిద్దరూ అక్కడ మంచి పేరు తెచ్చుకుంటున్నందుకు మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. అలాంటి అవకాశం అందరికీ రాదు. బాలీవుడ్ నుంచి చాలామంది హీరోయిన్లు హాలీవుడ్ సినిమాల్లో నటించినా, ఎక్కువ కాలం అక్కడ ఉండలేకపోయారు. కానీ వీరిద్దరూ మాత్రం అక్కడ నిలదొక్కుకోగలిగారు. అదీ వారి గొప్పతనం.

### నటిగా, నిర్మాతగా రెండు పడవల ప్రయాణం కష్టం అనిపించడం లేదా?

లేదు. సంతృప్తిగా కూడా ఉంది. నిర్మాతగా నా మనసుకు నచ్చిన సినిమాలు తీసే



అవకాశం నాకుంది. నటిగా నాకు ఆ అవకాశం తక్కువ.

**నిర్మాతగా మారాలన్న ఆలోచన ఎప్పుడు వచ్చింది?**

నాకు అన్ని భాషల సినిమాలు చూడడం అలవాటు. పరభాషలలో చాలా మంచి మంచి సినిమాలు వస్తున్నాయి. మన దగ్గర కొద్దిగా తక్కువే! ఇదే విషయం మా బ్రదర్‌తో డిస్కస్ చేసినప్పుడు 'ఇంతగా ఆలోచించే నువ్వు నిర్మాతగా ఎందుకు మారకూడదు?' అన్నాడు. తన మాటలు నన్ను ఆలోచింపచేశాయి. నిర్మాణ రంగం వైపు అడుగులు వేసేలా చేశాయి.

**పూర్తిస్థాయి నిర్మాతగా ఎప్పుడు మారతారు?**

చెప్పలేను. కానీ దానికి ఇంకా సమయం ఉంది.

**మీ రెండవ సినిమా ఎంత వరకూ వచ్చింది?**

ఇంకా మొదలు కాలేదు. అర్జున్‌కపూర్ హీరోగా చేయబోతున్నాడు. నా మొదటి సినిమా 'ఎన్‌హెచ్10' లాగే ఇది కూడా చాలా మంచి సినిమా అవుతుంది.

**నిర్మాతగా ఇబ్బంది పడిన సందర్భం?**

బడ్జెట్ పరంగా ఇబ్బంది పడింది లేదు. 'ఎన్‌హెచ్10'ను అనుకున్న బడ్జెట్‌లోనే పూర్తి చేయగలిగాం. కానీ ఈ సినిమా సెన్సార్ విషయంలోనే బోర్డు చాలా ఇబ్బంది పెట్టింది. అడల్ట్ సర్టిఫికెట్ ఇవ్వడంతో ఫలితం ఎలా ఉంటుందో అని కొద్దిగా టెన్షన్ పడ్డాను. కానీ ఈ సినిమాను అన్ని వర్గాల ప్రేక్షకులూ ఆదరించారు. సెన్సారు వాళ్ళు మంచి సినిమాలను కూడా ఇబ్బంది పెట్టడం మానుకోవాలి. అప్పుడే నిర్మాతలు మరిన్ని మంచి సినిమాలు చేయగలుగుతారు. కొందరు నిర్మాతలు సెన్సారు వాళ్ళకి భయపడి సినిమాలు నిర్మించడం తగ్గించుకున్నారు. ఇదే విషయాన్ని నా సినిమా సెన్సార్ సందర్భంగా చాలామంది పెద్దల దృష్టికి తీసుకు వెళ్ళాను. కానీ పరిస్థితిలో మాత్రం మార్పు రాలేదు. నిర్మాతలు అందరూ కలిసికట్టుగా బోర్డును ఎదిరిస్తే తప్ప సమస్య పరిష్కారం కాదు.

**ఎనిమిది సంవత్సరాలుగా సినిమాలు చేస్తున్నారు కదా? ఏ సినిమాలు చేయడం కష్టం అనిపించింది?**

అన్నిటికన్నా కష్టమైంది కామెడీ! కామెడీతో ప్రేక్షకుల్ని నవ్వించడం అంత సులభమైన విషయం కాదు. నా సినిమాల్లో కొన్ని సన్నివేశాలలో కామెడీ కోసం ప్రయత్నించాను కూడా! అంత వర్కవుట్ కాలేదు.

**విరాట్‌తో మీ మ్యారేజ్ ఎప్పుడు?**

నా వ్యక్తిగత జీవితం గురించి అందరితో చర్చించడం నాకు ఇష్టం ఉండదు. పెళ్ళి అనేది పూర్తిగా నా పర్సనల్. నేను పెళ్ళి చేసుకోవాలనుకుంటే మా ఫ్యామిలీకి చెబితే సరిపోతుంది. అందరికీ చెప్పవలసిన అవసరం లేదు. ఎప్పుడు పెళ్ళి చేసుకోవాలన్నది ఇంకా నిర్ణయించుకోలేదు.

**విరాట్ మీరూ ఓ అపార్ట్‌మెంట్ కొన్నారట కదా?**

ఆ అపార్ట్‌మెంట్ విరాట్ తన కోసమే కొనుక్కున్నాడు. అది పూర్తిగా తన స్వంతమే! దానితో నాకు ఎలాంటి సంబంధమూ లేదు.

**మీ తరువాతి సినిమాల గురించి...**

మూడు సినిమాలు ప్రారంభం కాబోతున్నాయి. ఒకదాని తరువాత మరొకటి ఉంటాయి. మా మేనేజర్ ఒక్కరోజు కూడా నాకు రెస్ట్ ఇవ్వకుండా డేట్లు అన్నీ అడ్జస్ట్ చేసేశాడు. చేయబోయే సినిమాలన్నీ పెద్ద ప్రాజెక్టులే! దాంతో మరో మూడునాలుగు నెలల వరకూ ఫుల్ బిజీ! ఆ తరువాత నా సొంత సినిమా నిర్మాణం ఉంటుంది. దాదాపు ఈ సంవత్సరం ఆఖరు వరకూ ఖాళీ అంటూ దొరకదు.

-చిన్ని

# గందరగోళంలో సమంత పెళ్ళి

సమంత, నాగచైతన్యల పెళ్ళి త్వరలోనే జరగబోతోందన్న వార్తలు బాగా వినపడుతున్న ఈ సమయంలో సమంత నోటి నుంచి వచ్చిన మాటలు అందరినీ అయోమయంలోకి నెట్టి వేస్తున్నాయి. అసలు వీరిద్దరి పెళ్ళి జరుగుతుందా? లేదా? అన్న అనుమానాలు కూడా వ్యక్తమవుతున్నాయి. ఇటీవల తనను కలిసిన మీడియా ప్రతినిధులతో వచ్చే సంవత్సరం వరకూ తాను సింగిల్‌గానే ఉండదలుచుకున్నట్టు మాట్లాడిందట సమంత! ఈ విషయాన్ని నేరుగా చెప్పకపోయినా అదే అర్థం వచ్చేట్టు మాట్లాడడంతో ఇప్పుడు ఆమె పెళ్ళి మీద అనుమానాలు వెల్లువెత్తుతున్నాయి. సినీ ప్రేక్షకులను తన మాయలో పడేసుకున్న సమంత కాబోయే వ్యక్తి ఫ్యామిలీ మనసు దోచుకోలేకపోయిందనీ, దీనికి కొంత సమయం కావాలి కనుక పెళ్ళి వాయిదా వేసుకుంటే బాగుంటుంది అన్న ఆలోచనలో సమంత ఉందని సినీ జనాలు అంటున్నారు. అయితే పెళ్ళి వార్తల మీదే సమంత క్లారిటీ ఇవ్వలేదు కనుక ఈ పెళ్ళి వార్తలు, వాయిదా వార్తలు అన్నీ పుకార్లే కావచ్చు అంటున్నారు సినీ జనాలు.





# ఇంటర్వ్యూ

నన్ను వాళ్ళనాన్నగారికి పరిచయం చేశాడు. ఈ విధంగా 'జగమొండి' చిత్రంతో నా సినీరంగ ప్రస్థానం ప్రారంభ మైంది. ఈ చిత్రంలో శోభన్‌బాబుగారు, తమిళ హీరో రాజ్‌కుమార్, నేను నటించాం. రతి అగ్నిహోత్రి హీరోయిన్. వి.మధుసూదనరావుగారి దర్శకత్వంలో 1981లో ఈ చిత్రం విడుదలైంది.

### రామదండు

సతీష్‌వేగేష్న దర్శకత్వంలో నిర్మించిన 'రామదండు' చిత్రంలో నేను నటించాను. మురళీమోహన్, సరిత, కృష్ణభగవాన్, అల్లురామలింగయ్య, నిర్మలమ్మ తదితరులు నటించారు. ఎం.ఎస్.విశ్వనాథన్ సంగీత దర్శకత్వంలో 1981లో ఈ చిత్రం విడుదలైంది. ఈ రెండూ నార్మల్ చిత్రాలే. నా నటనకు గుర్తింపు రాలేదు.ఈ రెండు చిత్రాలూ అంతగా విజయం సాధించక పోవడంతో మా నాన్నగారు నాకు 'లెఫ్ట్ అండ్ రైట్' ఇచ్చారు. సినిమా జీవితం వద్దని ముందే చెప్పాను కదా? చెబితే విన్నావా? అని కొంచెం గట్టిగానే అనడంతో నాకు కొంచెం సిగ్గనిపించింది.

### దశతిరిగింది

ఆ తర్వాత ఎడిటింగ్ అసిస్టెంట్‌గా పనిచేశాను. ఆ సమయంలో తమిళ దర్శకులు భారతీవాసుగారు 'పన్నీరుపుష్పంగళ్' చిత్రంలో అవకాశం ఇచ్చారు. అదొక యదార్థగాథ. ఊటీ హిల్‌స్టేషన్ స్కూల్ లొకేషన్‌లో తీశారు. ఇది శతదినోత్సవం చేసుకోవడంతో

# ఇప్పటి ప్రేక్షకులను మెప్పించడం అంత ఈజీ కాదు!

## -సురేష్

**స్పష్టమైన భావప్రకటన చేయగల నటుడు సురేష్. దాదాపు మూడున్నర దశాబ్దాలుగా 286 చిత్రాల్లో నటించి తెలుగు సహా తమిళ, మలయాళ, కన్నడ ప్రేక్షకులను కూడా రంజింపజేశారు. ఈనాటి హీరోలు ఎంతో కష్టపడుతున్నారు. ఎవరూ తక్కువ కాదు. కానీ ఎంతో తెలివైన ఈనాటి ప్రేక్షకుల్ని మెప్పించడం, సంతోషపెట్టడం అంత ఈజీ మాత్రం కాదు అంటున్న సురేష్ ఇంటర్వ్యూ......**

మా నాన్నగారు ఎం.ఎస్.గోపీనాథ్. ప్రముఖ సినీ దర్శకులు, నిర్మాత. అమ్మగారిపేరు రాధాదేవి. నేను చిత్తూరుజిల్లా శ్రీకాళహస్తిలో జన్మించాను. అది మా మాతామహుల ఊరు. మా తాతగారి ఊరు గూడూరు. నా పూర్తిపేరు మైసూర్ శేషయ్య సురేష్‌నాయుడు. సింపుల్‌గా సురేష్ అంటారు. మద్రాసులో ప్లస్ టూ తరువాత ఢిల్లీ బుందేల్‌ఖండ్ యూనివర్సిటీలో ఎం.ఏ., ఎం.బి.ఏ పూర్తిచేశాను.

### సినిమాల్లో చేరాలనే తపన

బాల్యం నుండీ సినిమాల్లో చేరాలనే తపన నాకు బాగా ఉండేది. నాన్నగారు దర్శకులు, నిర్మాత కావడంతో సహజంగానే ఇంట్లో ఆ వాతావరణం ఉండేది. ఆయన దాదాపు 18 చిత్రాలకు దర్శకత్వం వహించారు. సినిమాల గురించీ, సినిమా దర్శకత్వం గురించి నా చిన్నతనం నుండీ ఆయనపడే కష్టం గమనించేవాణ్ణి. ఆ విధంగా ఎన్నో విషయాలు తెలుసుకున్నాను. నటుణ్ణి కావాలనే కోరిక నాలో బలంగా నాటుకుంది.

### నాన్నగారికి ఇష్టంలేదు

నేను నటుణ్ణి కావడం నాన్నగారికి అస్సలు ఇష్టం ఉండేదికాదు. కానీ ఒక మంచినటుడుగా నన్నునేను ఋజువు చేసుకోవాలనే పట్టుదలతో ఉండేవాణ్ణి. 'జగమొండి' ప్రొడ్యూసర్ చటర్జీగారి అబ్బాయి క్రాంతి నాకు మంచి మిత్రుడు. దాంతో

హీరోగా నా దశ తిరిగింది. ఇక తిరుగులేదని పరిశ్రమలో నాపై అంతా అభినందనలు కురిపించారు. తెలుగులో 'మధురగీతం'గా ఈ చిత్రాన్ని డబ్బింగ్ చేశారు. ఓ మోస్తరుగా ఆడింది. ఇళయరాజా సంగీత దర్శకత్వంలో 1981లో విడుదలైంది.

ఆ తర్వాత సూరిగాడు, దొంగాట, పట్టుకోండి చూద్దాం, అమ్మోరు, అల్లరిపిల్ల, పుట్టింటి పట్టుచీర, తోడికోడళ్ళు... వంటి చిత్రాల్లో నటించాను. ఇవన్నీ జనం మెచ్చిన చిత్రాలే. ప్రార్థన, భవాని ఈ రెండు చిత్రాలు నా నట జీవితంలో మైలురాళ్ళవంటివి.

### మరువలేని సంఘటన

సినిమా షూటింగ్‌లో ఏవో గమ్మత్తులు జరుగుతూనే ఉంటాయి. కానీ మా నాన్నగారి విషయంలో జరిగిన ఒక సంఘటన మాత్రం మరచిపోలేను. నేను బెస్ట్ యాక్టర్ అవార్డు తీసుకుంటే చూడాలన్నది

నాన్నగారి కోరిక. నేను నటించిన భవాని చిత్రం విడుదల సమయంలోనే ఆయన చనిపోయారు. ఈ చిత్రం ప్రివ్యూ చూసి తప్పకుండా ఈ చిత్రానికి అవార్డు లభిస్తుందనీ, నాకు బెస్ట్ యాక్టర్ అవార్డు కచ్చితంగా వస్తుందనీ చెప్పారు. నాన్నగారు ప్రముఖ దర్శకులు గనుక ముందే ఊహించారు. ఆయన చెప్పినట్టు నిజంగానే ఎన్నో అవార్డులు వచ్చాయి. కానీ ఈ సంతోషంలో పాలుపంచుకోవడానికి మా నాన్నగారు సజీవంగా లేకపోవడం విచారించదగిన విషయం. ఈ విషయంలో ఎప్పుడూ నాన్నగారు నాకు గుర్తొస్తూ ఉంటారు. ఇది మరువలేని సంఘటన.

నాన్నగారు తీసిన చిత్రాలన్నీ ఆణిముత్యాలే. జీవితబంధం, రాముని మించిన రాముడు, రాముడు - పరశురాముడు, మహాత్ముడు లాంటి సూపర్ హిట్ తెలుగు చిత్రాలేకాకుండా, తమిళ, కన్నడ చిత్రాలకు కూడా ఆయన దర్శకత్వం వహించారు. దాదాపు ఆయన చిత్రాలన్నీ విజయవంతంగా ఆడాయి.

నటన అనేది నా వృత్తి మాత్రమే. అది నా జీవితం కాదు. ఒక తండ్రిగా, కొడుకుగా, వ్యాపారవేత్తగా, సీరియల్ ప్రొడ్యూసర్‌గా, సినిమాలకు పర్యవేక్షకునిగా వ్యవహరిస్తున్నాను. నటన నా జీవితంలో ఒక భాగం మాత్రమే. నా పరిధిలో ఇంకా చాలా భాగాలున్నాయి. ప్రస్తుతం జూనియర్ ఎన్.టి.ఆర్ హీరోగా నటిస్తున్న 'జనతాగ్యారేజ్ చిత్రంలో నటిస్తున్నాను. కొరటాల శివగారు దర్శకులు.

### టెక్నికల్ బెటర్‌మెంట్

చిత్రపరిశ్రమ సాంకేతిక పరిజ్ఞానంలో ఎప్పటికప్పుడు కొత్త ఆవిష్కరణలు జరుగుతూ ఉంటాయి అంతే. ఇప్పటికాలంలో ప్లస్ పాయింట్ ఏంటంటే, ప్రేక్షకులలో అవగాహనా స్థాయి బాగా పెంపొందింది. ఒకప్పుడు నాలుగు వారాలు, అయిదు వారాలు ఆడే చిత్రాలుండేవి. ఇప్పుడు అలాంటివి లేవు. హిట్ లేదా ఫ్లాప్ అంతే.

### గతం గోల్డెన్ పీరియడంటే నమ్మను

చాలామంది చిత్రపరిశ్రమలో పాతకాలాన్ని గోల్డెన్ పీరియడ్ అంటారు. ఆ విషయాన్ని నేను నమ్మను. టైమ్ బాగుంటే అంతా గోల్డెన్ పీరియడే. ముఖ్యంగా ఇదివరలో నటులు చిత్రపరిశ్రమకు వచ్చి ఎన్నో నేర్చుకునేవారు. ఇప్పుడు ఆ అవకాశం లేదు. ఈ రోజు అంత టైమ్ కూడా ఉండటం లేదు. ప్రేక్షకులు అంత ఛాన్స్ ఇవ్వడం లేదు. అప్పట్లో నటులు మంచి పాత్రలు పోషించారు. ఇప్పుడు కూడా మంచి పాత్రలు వేస్తూనే ఉన్నారు. ఈ కాలంలో హీరోలు ఎంతో కష్టపడుతున్నారు. ఎవరూ తక్కువ చేయడంలేదు. ఇంకో విషయం ఏంటంటే ప్రెజెంట్ పొజిషన్‌లో ప్రేక్షకులను సంతోషపెట్టడం అంత ఈజీ కాదు. అన్నిటికంటే, అందరికంటే బాగా తెలివైనవారు ఇప్పటి ప్రేక్షకులు. కనుక నటుడు, నిర్మాత, దర్శకుడు, ఎవరైనా ప్రేక్షకుల అభిరుచులకు తగ్గట్టు సినిమాలు తియ్యాలి. అలాంటి సినిమాలే ఎక్కువకాలం నిలుస్తాయి. లేకుంటే ఫ్లాపే! అటు దర్శకులు, నిర్మాతలు, ఇటు పంపిణీదార్లు అందరూ నష్టపోతారు. అందరూ పచ్చగా ఉండాలంటే, మంచి చిత్రాలు నిర్మించాలి. ప్రయత్నం చేస్తే తప్పకుండా విజయం సాధిస్తారని చాలా మంది ఋజువు చేస్తున్నారు కదా! అయితే ఫలితం మాత్రం ఎప్పుడూ ఆడియన్స్‌పైనే ఆధారపడి ఉంటుంది. చిత్ర పరిశ్రమ సుభిక్షంగా ఉండాలంటే అన్నిరకాల చిత్రాలూ రావాలి. థ్రిల్లర్, హర్రర్, జానపదం, చారిత్రాత్మకం, పౌరాణికం, వెరైటీ సాంఘికాలు... ఇలా అన్ని చిత్రాలూ వస్తూ ఉండాలి.


నవ్య వీక్లీ చదువుతూ...

### సెల్ఫ్ రెస్పెక్ట్ ముఖ్యం

మౌలికంగా నేను నా మనసుకు నచ్చినట్టుగానే నడుచుకుంటాను. నాకు నచ్చింది చేస్తాను. మరొకరికి సలహా ఇచ్చేందుకు నేను ఎప్పుడూ ఇష్టపడను. మీ మీద మీరు ఎంత నమ్మకం పెట్టుకుంటారో, ఎదుటివారికి కూడా వారిమీద అంతటి నమ్మకం ఉంటుంది కదా! సెల్ఫ్ రెస్పెక్ట్ చాలా ముఖ్యం. నేను చెప్పేది ఒకటే. మనల్ని మనం ప్రేమించుకోవాలి. ఆ తరువాత పెద్దల్ని ప్రేమించాలి. అమ్మాయిని ప్రేమిస్తే ధైర్యంగా పెద్దలకు చెప్పగలగాలి. అలా ధైర్యంగా చెబితే తల్లిదండ్రులు తప్పకుండా అంగీకారం తెలియజేస్తారు. యువతరానికి సెల్ఫ్ రెస్పెక్ట్, వారిపై వారికి విశ్వాసం ఉండాలి. అంతేగానీ పిరికివాళ్ళలాగా ఆత్మహత్యలకు పాల్పడకూడదు. అది మహాపాపం. పెద్దవాళ్ళకు అది శాపంగా మారుతుంది. ఇదే నేను యువతకు చెప్పాలనుకున్నాను.

### ఆస్తులు అమ్ముకోవాల్సి వస్తుంది

తమిళ చిత్రపరిశ్రమలో 70 శాతం చిన్న బడ్జెట్ చిత్రాలే వస్తున్నాయి. విజయవంతమవుతున్నాయి. కానీ తెలుగులో మాత్రం 70 శాతం పెద్ద బడ్జెట్ చిత్రాలు వస్తున్నాయి. దీనివల్ల సినిమా సక్సెస్‌కాని సమయాల్లో సంబంధీకులు ఆస్తులు అమ్ముకోవాల్సి వస్తోంది. ఈ పెద్ద సినిమాల తాకిడికి చిన్న సినిమాలు కొనేవాళ్ళు కరువైపోతున్నారు. అదేవిధంగా థియేటర్ యజమానులు కూడా కొనుగోళ్ళు చేయడంలేదు. అలాగని పెద్ద సినిమాలు బాగా ఆడుతున్నాయా? అంటే అదీలేదు. కనుక దర్శకులు, నిర్మాతలు అన్నిరకాల సినిమాలవైపు మొగ్గుచూపిస్తే ఇండస్ట్రీ మెరుగుపడుతుంది. చిత్ర పరిశ్రమ సుభిక్షంగా ఉంటుంది.


భానుచందర్, రజనీకాంత్, అంబరీష్‌లతో...

### టీవీ సీరియల్స్

నా టీవీ సీరియల్స్‌కు బాగా ప్రజాదరణ లభించింది. వాటిల్లో 'మైనేమ్ ఈజ్ మంగతాయారు' ఒకటి. మహేశ్వరి హీరోయిన్. 'మా ఇంటి మాలక్ష్మి' మరో సీరియల్. తెలుగు, తమిళ భాషల్లో కలిపి ఇప్పటివరకు ఎనిమిది సీరియల్స్ ప్రొడ్యూస్ చేశాను. దాదాపు అన్నీ కలిపి 3000 ఎపిసోడ్స్ వరకు ఉంటాయి. ముఖ్యంగా తెలుగులో వచ్చిన సీరియల్స్‌ని తెలుగు టీవీ ప్రేక్షకులు బాగా ఆదరించారు. నేను నటించిన 'భవాని', 'ప్రార్థన' చిత్రాలకు అవార్డులు వచ్చాయి. విశాఖపట్నం, నెల్లూరు, విజయవాడ సహా కోస్తా జిల్లాలు, హైదరాబాద్‌లలో ఉన్న ప్రముఖ సంస్థల నుంచి ఈ చిత్రాలకు గాను ఎన్నో అవార్డులు అందుకున్నాను. ఇది ఎంతో సంతోషించదగ్గ విషయం. నేను ఎప్పటికీ మరచిపోలేని చిత్రాలు ఈ రెండూ.

నాకు నచ్చిన హీరోలు ఎన్టీఆర్, కాంతారావుల చిత్రం జయసింహ. సినిమా అంటే ఇలా ఉంటుందా అనిపించింది. గులేబకావళికథ, గుండమ్మ కథ, మాయాబజార్, దానవీరశూరకర్ణ, అల్లూరి సీతారామరాజు సినిమాలన్నీ కళ్ళముందు కదలాడుతున్నట్టుగా ఉంటాయి. శ్రీదేవి, సౌందర్య, ఎస్వీరంగారావు, నగేష్ నాకు నచ్చిన నటులు. ప్రస్తుత నటుల్లో చిరంజీవిగారంటే నాకు ప్రాణం. ఆయనకు వీరాభిమానిని. పవన్‌కల్యాణ్, మహేష్‌బాబులది ఒకటైప్ నటన. అల్లుఅర్జున్, జూనియర్ ఎన్టీఆర్‌లది ఒకటైప్ నటన. వారిని బాగా అభిమానిస్తాను.

ప్రస్తుతం నా జీవితం హ్యాపీగా గడిచిపోతోంది. నాకు ఒక అబ్బాయి. పేరు నిఖిల్. అమెరికాలో ఉద్యోగం చేస్తున్నాడు.

**కె.హరనాథ్**
**సెల్ 970 35 42 598**

# ఇవన్నీ నిజాలే!

### ఇదో రకం టైటానిక్!

A క్రీస్తుశకం 1533లో లిస్బన్ నుండి భారత్‌కు బయలుదేరి గల్లంతైన పోర్చుగీసు నౌక ఎనిమిదేళ్ళక్రితం నమీబియా తీర ప్రాంత ఇసుక గర్భంలో కనిపించింది. మానవ కంకాళాలతోపాటు బంగారు, వెండి నాణాలు రాశులకొద్దీ ఇందులో ఉన్నాయి. ఆయుధాలు, ఖడ్గాలు, కత్తులు, దుస్తులు, కాంస్యంతో చేసిన విలువైన పాత్రలు ఈ నౌకలో దొరికాయి. ఇప్పుడీ ప్రాంతం యునెస్కో అధీనంలో ఉంది.

•••

A ముద్దు అంటే భయపడటాన్ని ఫిలెమాఫోబియా అంటారు.

•••

A ప్రపంచంలో శాఖాహారం తినే అతి పెద్ద దేశం మనదే.

•••

A తలంటుకునే 'షాంపూ' ను మొట్టమొదట ఔషధ మొక్కల నుంచి కనిపెట్టింది భారతదేశమే. 'చంపు' అనే సంస్కృత పదం నుండి వచ్చిందే షాంపూ.

•••

A రెండవ ప్రపంచ యుద్ధంలో పాతికమంది సోవియట్ సైనికులు, పదిమంది పౌరులు కలిసి స్టాలిన్‌గ్రాడ్‌లో ఒక పెద్ద భవంతిని జర్మన్ల వశం కాకుండా కాపాడుకున్నారు. పారిస్ నగరంపై జరిగిన దాడిలో చనిపోయినంతమంది జర్మన్ సైనికులను ఈ యుద్ధంలో వారు మట్టుపెట్టారు!

•••

A క్రీస్తుపూర్వం నాలుగో శతాబ్దంలోనే భారతదేశంలో వజ్రాలు కనుగొన్నారు. సిల్క్‌రూట్ ద్వారా ప్రపంచ దేశాలకు వాటిని ఎగుమతి చేసేవారు.

•••

A పెళ్ళిళ్ళకు ఎంగేజ్‌మెంట్ రింగ్ పెట్టే సంప్రదాయం 1215లో ప్రారంభమైంది.

•••

A వైకుంఠపాళి (పాము, నిచ్చెన) ఆట భారతీయులదే. కర్మ గురించి చెప్పడం కోసం 'మోక్ష పాతము' అనే పేరుతో ఇది నీతి పాఠాల్లో ఉండేది. ఆ తర్వాత వాణిజ్యరూపం ధరించి ప్రపంచవ్యాప్తంగా ఆదరణ పొందింది.

•••

A కుక్కలు, పిల్లులు, చేపలను ప్రేమించే ఆమెరికన్లు పక్షుల్ని కూడా విపరీతంగా ప్రేమిస్తారు. ఆమెరికాలో దాదాపు కోటీ నలభై లక్షల పక్షులు ఆ రూపేణా పంజరాల్లో మగ్గిపోతున్నాయి! వీటిల్లో ఎక్కువ రామచిలుకలే.

•••

A ముద్దు పెట్టడం, తీసుకోవడం అనే ప్రక్రియ మానవ సమాజంలో నాలుగువేల యేళ్ళ క్రితమే మొదలైంది.

•••

A డైనోసార్లలో అతిపెద్ద హెర్బివోరస్ డైనోసార్ 115 అడుగుల పొడుగు, 100 టన్నుల బరువు ఉండేది. అంటే ఇది దాదాపు పన్నెండు ఏనుగుల బరువుతో సమానమన్నమాట.

-చిన్నారి

# సుధామ పదగారడి-271

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| h | 1 | | 2 | h | 3 | | | 4 |
| 5 | h | h | 6 | | | h | h | |
| | h | h | | h | | 8 h | h | |
| 7 | 8 | | h | 9 | h | 10 | 11 | |
| h | 11 | h | 12 | | | h | | h h |
| 13 | | 15 | h | h | h | 14 h | | 15 |
| | h | h | 16 | h | 17 | 19 h | h h | |
| h | h | h | 18 | | | h | h h | |
| 19 | | | | h | 20 | | | h |

## ఆధారాలు

**అడ్డం**

1. గ్రామ దేవతలకు జరిపేది (3)
3. ఉజ్జయిని దేవత సికింద్రాబాద్‌లోనూ వుంది (4)
6. రామబంటు (3)
7. ఇదో రకం ఆకు అటుగా నాదీ వుంది (3)
10. బహుమతి (3)
12. పూమాల (3)
13. తుమ్మెద (3)
14. స్త్రీ ముందు అంగవేసింది (3)
18. బంధువును పడకపోతే దీనితో పోల్చడం వుంది (3)
19. యముడు, పోలీసు బంట్రోతు (4)
20. కిచిడీ వంటిదే (3)

**నిలువు**

2. గుట్టు (3)
3. మమకారము (3)
4. పిఠాపురం నుంచి ఆవంత్స సోమసుందర్ నడిపిన పత్రిక తిరగబడింది (3)
5. దుఃఖము (3)
8. రాజుల కాలపు డబ్బు నాణెం (3)
9. చింపిగుడ్డ (3)
11. ఫేనము (3)
13. నాలుగు వేదాల్లో ఒకటి. ప్రవచనకర్త షణ్ముఖశర్మ గారింటి పేరు (4)
15. దిగంబరం (3)
16. కాళ్ళది ఇది ఆరకుండానే చనిపోయే వధువులున్నారు (3)
17. ఉన్ననాడు తెలివిగలిగి చేయవలసింది భవిష్యత్తుకై (3)

### పదగారడి-270 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 ప్రి | 2 యాం | క | | 3 భో | | 4 స | 5 మ | త |
| | క | | 6 అం | జ | న | | జ్ఞ | |
| 7 మ | ర | 8 నా | | నం | | 9 పొ | గ | 10 రు |
| హా | | భి | | | 11 డ | గ | | క్కాం |
| ప్ర | | | | | | | | గ |
| స్థా | | 12 సా | త్తు | | | 13 జ | | దు |
| 14 నం | 15 ద | న | | 16 త | | 17 బు | 18 ధు | డు |
| | త్త | | 19 పె | రం | టం | | ర | |
| 20 ద్యూ | త | ము | | గం | | 21 ప్రా | ణ | ము |

Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: A.N.JAGANNADHA SARMA

